# ఆంధ్రప్రదేశ్ ను గురించి....

| | |
|---|---|
| విస్తీర్ణం | 1,06,286 చ. మైళ్ళు |
| జిల్లాలు | 20 |
| తాలూకాలు | 189 |
| గ్రామాలు | 28,[illegible]7 |
| పట్టణాలు నగరాలు | 212 |
| మొత్తం జనసంఖ్య (1961) | 359.83 లక్షలు |
| జన సాంద్రత (1961) | 339 చ. మైళ్ళు. కి |
| అక్షరాస్యులు (1961) | 76.27 లక్షలు |
| షెడ్యూల్డు కులాలవారు (1961) | 49 74 లక్షలు |
| షెడ్యూల్డు తెగలవారు (1961). | 13.24 లక్షలు |
| నమోదైన కర్మాగారాలు | 3,928 |
| విశ్వవిద్యాలయాలు | 4 |
| పంచాయతీలు | 15,226 |
| పంచాయతీ సమితులు | 321 |
| ఆంధ్ర ప్రదేశ్ నుండి పార్లమెంటు సభ్యులు | [illegible]1 |
| విధాన సభ సభ్యులు | 288 |
| శాసనమండలి సభ్యులు | 91 |

# ఆంధ్రప్రదేశ్

సంపుటి: 13]

జూలై 1969
ఆషాఢం—శ్రావణం 1891 శా.శ

[సంచిక 9

ప్రధాన సంపాదకులు
వి. వామనరావు

సంపాదకులు
ఎస్. వి. గోపాలశాస్త్రి


## ఈసంచికలో....

పేజీ



## ముఖచిత్రం

బస్తీలలోలాగా రకరకాల వినోద కార్యక్రమాలు పల్లె సీమలలో వుండవు. పని పాటలుచేసి పగలల్లా శ్రమించిన గ్రామీణులకు జానపద కళలు వరప్రసాదం వంటివి.

చిరతల రామాయణం, కోలాటం, ఆడుగులు, సుద్దులు మొదలైన కళా రూపాలు తెలంగాణా ప్రాంతపు గ్రామాల్లో బాగా ప్రచారంలో వున్నాయి.

ఒక తెలంగాణా గ్రామంలో వినోద కార్యక్రమ దృశ్యం

**మూడో అట్ట :** పొట్టకోసం

**నాలుగో అట్ట :** పరుగులుతీసే మూసీనది

**వెల: 50 పైసలు**

**Regd. No. H. 133.**

# ప్రశాంత పరిస్థితుల వైపు....

ఈ యేడు జూలై నెలలో కనీవినీ ఎరుగని కొత్త సంఘటనలు జరిగినవి. మానవుడు చంద్రోపరితలం మీద అడుగు పెట్టి నూతన చరిత్ర సృష్టించాడు. రోదసీ కుహరమంతా యిక ముందు మానవుని అదుపాజ్ఞలలో మెలగుతుందా అనిపించేటంత విజయాన్ని సాధించాడు. భూగోళచరిత్రలో యిదొక అపూర్వ సంఘటన. కుల మత జాతి లింగ వయోభేదాలు లేకుండా నేలనాలుగుచెరగులా యావన్మానవజాతి సంభ్రమాశ్చర్యాలలో ఓలలాడింది. మానవుడి చంద్రలోక విజయం వంటి మహత్తర సంఘటన, సృష్ట్యాదినుండి నేటివరకు మరొకటి లేదంటే అతిశయోక్తి కాదు. నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్, ఎడ్విన్ ఆల్డ్రిన్ — ఈ యిద్దరు అంతరిక్ష యాత్రికుల పేర్లు మానవ జాతికి చిరస్మరణీయాలుగా వుంటాయి. చంద్రుని మీద పడిన వారి పాదముద్రలు యింకా అనేక యితర గ్రహాల విజయానికి ప్రథమ సోపానాలవుతాయి. చంద్రలోక రహస్య భేదనకు తొలి బాటలు వేసిన అంతరిక్ష యాత్రికులకు జోహారులు.

మనజాతీయ రంగంలో కూడా యీనెలలో అతిముఖ్యమైన మన ఆర్థికవ్యవస్థలో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చే సంఘటనలు జరిగినవి. దేశంలోని 14 పెద్దబ్యాంకులను జాతీయంచేయడంతో చాలా రోజులుగా వివాదగ్రస్తంగావున్న సమస్యకు పరిష్కారం జరిగినట్లయింది నిజానికి భీమాకంపెనీలను జాతీయం చేసినదానికంటే బ్యాంకుల జాతీయీకరణ ఎక్కువ ప్రయోజనకరమైనది. ఆర్థికరంగంలో దేశాన్ని ఎదుర్కొంటున్న అనేక గడ్డుసమస్యల పరిష్కారానికి దీనితో శుభారంభం జరిగింది. ప్రధానమంత్రి తీసుకున్న యీ సాహసోపేతమైన నిర్ణయానికి దేశ ప్రజలందరు హర్షామోదాలు తెలిపారు.

ఇక మన రాష్ట్రంలో. విస్తృత ప్రాతిపదికతో జూలై 19వ తేదీన క్రొత్త మంత్రివర్గం ఏర్పడింది. వివిధ వర్గాలకు తగిన ప్రాతినిధ్యం కల్పించే ఉద్దేశంతో రాష్ట్ర మంత్రివర్గం అనేక మార్పులతో పునర్నిర్మాణం చేయబడింది. ఏమంత్రి వర్గమైనా విజయవంతంగా పనిచేయడానికి మంత్రిమండలిలో భావైక్యత చాలా అవసరం దీనిని దృష్టిలో పెట్టుకునే యీ పునర్నిర్మాణం జరిగింది. "ఈనాడు మన రాష్ట్రాన్ని ఎదుర్కొంటున్న గడ్డుసమస్యల పరిష్కారానికి వివేకమూ, చైతన్యమూ ఎంతో అవసరం. అందుకే వివిధ ప్రాంతాలకు, వర్గాలకుమధ్య సమన్వయం వుండేవిధంగాను, చిరకాల అనుభవానికి, యువకులశక్తి సామర్థ్యాలకూ సమన్వయంవుండే విధంగాను కొత్త మంత్రివర్గం ఏర్పాటు చేయబడింది "అని తమ మంత్రి మండలిని గురించి చెప్తూ ముఖ్యమంత్రి అన్నారు.

తెలంగాణానుండి ఉపముఖ్యమంత్రి నియామకంతో సహా, కొత్త మంత్రివర్గం ఏర్పాటుచేయడం ద్వారా ప్రధాన మంత్రి ప్రకటించిన అష్టసూత్ర ప్రణాళికలో ఉద్దేశించిన రాజకీయపు ఏర్పాట్లు అమలుజరిగినట్లు భావించవచ్చు: తెలంగాణాలో అదనపు ఉద్యోగసౌకర్యాలకోసం ప్రత్యేకం కొత్తగా ఏర్పాటుచేసిన 2005 ఉద్యోగాలతో సహా మొత్తం 3288 ఉద్యోగాలలో యిప్పటి వరకు 2136 ఉద్యోగాలకు నియామకాలు జరిగినవి. మిగిలిన ఖాళీలు భర్తీ చేయడానికి కూడా చర్యలు తీసుకుంటున్నారు. తెలంగాణా ఉన్నతాధికార సంఘం ప్రథమ సమావేశం జరిపింది సమస్యల తక్షణ పరిష్కారానికి కృషిజరగాలనే వాంఛ సమావేశంలో స్పష్టంగా కనిపించింది. దీనికి తోడు తెలంగాణా ప్రాంతఅభివృద్ధికీ యితోధిక ఉద్యోగ సౌకర్యాల కల్పనకూ అవసరమైన చర్యలను సమీక్షించడానికి, సత్వరంచేయడానికి తెలంగాణా మంత్రులుసమావేశమై సంప్రదింపులు జరుపుతున్నారు.

తెలంగాణా నాన్ గెజెటెడ్ ఉద్యోగుల సమ్మె ఉపసంహరణ నిర్ణయం అభినందనీయం. మామూలు ప్రశాంత పరిస్థితులు నెలకొల్పే కృషిలో యిది ఒక ముఖ్యమైన మజిలీ. సమ్మెచేసినందువల్లగానీ, యితర చర్యలవల్లగానీ ఉద్యోగులకు ఏవిధమైన యిబ్బంది కలుగకుండా సమ్మెదారుల పట్ల ప్రభుత్వం ఎంతో ఉదారంగా, హుందాగా ప్రవర్తించింది దీనిని ఉద్యోగులు గుర్తించి సంతృప్తి వెల్లడించారు. ఇన్నాళ్లుగా మూతపడివున్న పాఠశాలలు, కళాశాలలు తెరవడానికీ విద్యార్థుల భవిష్యత్తు చెడకుండాను అమూల్యమైన ఒక సంవత్సరం వృధా కాకుండా చేసేందుకూ సకల ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇప్పుడింక బాధ్యత అంతా తెలంగాణా విద్యార్థులమీదేవుంది. ముసు ముందు తమకు ఉద్యోగావకాశాలు లభించ వేమోనని ఆదుర్దాపడుతున్న తెలంగాణా విద్యార్థులు మళ్లీ చదువులవైపు దృష్టి మరలించాలి. చదువులను నిర్లక్ష్యంచేసి ఉద్యోగవకాశాలు కోల్పోయి తమలక్ష్యాన్ని తామే భగ్న పరచుకోవడం మంచిదికాదు.

పి.వి.ఆర్.



# సమైక్యరాష్ట్రంలోనే తెలుగుజాతికి వికాసం

## ముఖ్యమంత్రి సందేశం

తెలుగు ప్రజల ప్రయోజనాలు విశాలమైన, సమైక్య రాష్ట్రంలోనే చక్కగా పరిపోషించబడుతాయని తాము విశ్వసిస్తున్నట్లు ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి అన్నారు. తెలంగాణ సంక్షేమం పట్ల ఆసక్తి వున్న వారందరికీ విజ్ఞప్తి చేస్తూ మామూలు శాంతి పరిస్థితులు ఏర్పడడానికి దారితీస్తున్న ప్రస్తుత వాతావరణం కొనసాగడానికి తోడ్పడి, తద్వారా తెలంగాణా అభివృద్ధికి అవసరమైన చర్యలు గైకొనడానికీ, తెలంగాణా ప్రజల న్యాయమైన హక్కులను పరిరక్షించడానికీ తోడ్పడాలని ఆయన ప్రజలను కోరారు.

1969 జులై 19 వ తేదీన, సాయంకాలం ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుండి ఒక సందేశం యిస్తూ ముఖ్యమంత్రి మంత్రి మండలిలో వివిధప్రాంతాలవారికీ, వివిధ దృక్పథాలు కలిగిన వారికీ సముచిత ప్రాతినిధ్య లభించేటట్లుగానూ, అనుభవజ్ఞులకూ, ప్రతిభా వంతులైన యువకులకూ తగిన స్థానం వుండేటట్లుగానూ శ్రద్ధ వహించడం జరిగిందని పేర్కొన్నారు.

### పూర్తి పాఠం

"నూతన మంత్రిమండలి ఈవేళ ప్రమాణ స్వీకారం చేసిన సంగతి మీకు తెలిసిందే. వివిధ వర్గాలవారికీ, దృక్పథాలవారికీ తగు విధంగా ప్రాతినిధ్యం కల్పించడమే మంత్రిమండలిని పునర్నిర్మించడంలో నాలక్ష్యం. ఇంకా ఇతర దృక్పథాలు కలిగివున్నవారు ఎవరైనా చేర్చుకొనబడకుండా వున్నట్లయితే అందుకు అవకాశం కల్పించడానికి వీలుగా తరువాత మరో నలుగురయిదుగురు మంత్రులనుకూడా చేర్చుకోవడంజరుగుతుంది. మంత్రిమండలి సాధ్యమైనంత విస్తృత ప్రాతిపదికపై ఏర్పడినదికావడంతోపాటుగా ఉమ్మడి ధ్యేయంతో కూడిన ఐక్యభావం కలిగినదై వుండాలన్నదే నాఆకాంక్ష. ముఖ్యంగా యువకులలో ప్రతిభావంతులైన వారికి అవకాశం యివ్వడానికి కూడా నేను ప్రయత్నించాను. ఈ విధంగా, ప్రస్తుతం మన రాష్ట్రాన్ని ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించడానికి అవసరమైన ప్రతిభా సామర్థ్యాలను సంతరించుకోడానికి అనువుగా నూతన మంత్రిమండలిలో వివిధ ప్రాంతాలకు చెందిన వారికీ, వివిధ దృక్పథాలు కలిగిన వారికీ, అనుభవం గడించిన వారికీ, ప్రతిభా శాలురైన యువకులకూ స్థానం కల్పించడానికి నేను ప్రయత్నించాను.

రాష్ట్ర సమైక్యతనూ, సమగ్రతనూ పరిరక్షించడం, రాష్ట్ర ప్రజల ఆర్థిక పరిస్థితులను మెరుగుపరచడం అనే లక్ష్యాన్ని చేరుకోడానికి మంత్రివర్గ పునర్వ్యవస్థీకరణ అనేది ఒక సాధనమాత్రమే. ఆంధ్రప్రదేశ్ సమైక్యతను పరిరక్షించడానికి నేను కృషిచేస్తున్నానంటే కేవలం సమైక్యతను సిద్ధాంతంగా గ్రహించడం వల్లగానీ, దీనినొక ఆదర్శంగా భావించడంవల్లగానీ కాదు. తెలుగు ప్రజలు

వారు ఏప్రాంతం వారైనప్పటికీ- వారి సంక్షేమం విశాల, సమైక్య రాష్ట్రంలోనే పరిరక్షించబడగలదని నేను హృదయపూర్వకంగా విశ్వసిస్తున్నాను. సమైక్యతను పరిరక్షించాలంటే తెలంగాణా సమస్యలను- అవి యీ ప్రాంతం అభివృద్ధికి సంబంధించినవిగానీ, యిక్కడి నిధులను వెచ్చించడానికి సంబంధించినవిగానీ, లేక యిక్కడి ప్రజలకు ఉద్యోగావకాశలను కల్పించడానికి సంబంధించినవి గానీ ఏవైనప్పటికీ-వాటిని వెనువెంటనే పరిష్కరించుకోవలసిన గురుతరబాధ్యత మనమీదవున్నది. ఈ విషయమై యిప్పటికే కొన్ని చర్యలు తీసుకోవడం జరిగింది. తెలంగాణా ప్రాంతం వారికి ఉప ముఖ్యమంత్రి పదవి యివ్వడం కూడా యీ విషయంలో మరోముఖ్యమైన చర్య. ఇక ముందు కూడా యీ సమస్యలను పరిష్కరించడానికి చిత్తశుద్ధితో గట్టి కృషి వెంటనే జరుగుతుందని హామీయిస్తున్నాను.

ప్రజల సంక్షేమాన్ని కోరే వారందరూ ఈ కృషిలో నాకు తమ సహకారాన్ని యివ్వవలసినదిగా విజ్ఞప్తి చేస్తున్నాను. పరస్పర అవగాహన, సహనంతో కూడిన దృక్పథంతో సమస్యలను పరిష్కరించవలసిన విషయమిది. భిన్నాభిప్రాయాలు ఏర్పడడానికి వీలైనట్లుగా యీ సమస్యలు క్లిష్టమైనవి. సాధ్యమైనంత వరకు వివిధ అభిప్రాయాలను అర్థంచేసుకుని ఒక అవగాహనకు రావడం అవసరం. చర్చల ద్వారా, అభిప్రాయాల మార్పిడిద్వారా ఒక అవగాహనను చేరుకోవడానికి ప్రజాస్వామికంలో వీలుంది. ప్రజాస్వామిక వ్యవస్థలోవున్న సుగుణం యిదే. అందువల్ల ఈ నాడు మనం చేయవలసినదేమంటే యీ విధమైన చర్చలకు, సంప్రదింపులకు అనువైన వాతావరణాన్ని కల్పించాలి. పరస్పర విశ్వాసం వున్నప్పుడే యిది సాధ్యమౌతుంది. నిరంతర ఆందోళనల వల్ల, హింసాప్రవృత్తి వల్ల విశ్వాసవాతావరణం ఏర్పడదు ఇటీవలి అలజడుల వల్ల నిజానికి మనం ఏప్రజల సమస్యలన పరిష్కరించాలని ఉద్దేశించామో ఆ ప్రజలకే అమితమైన నష్ట కలిగిందని గుర్తించడం అవసరం.

ఇతర ప్రాంతాలలో కూడా అనేక గడ్డు సమస్యలను మ రాష్ట్రం ఎదుర్కోవలసి వస్తున్నది. ఇటీవలి తుఫాను, వరదలవ కోస్తాప్రాంతంలో దెబ్బతిన్న ప్రజల యిబ్బందులను నివారించడాని చర్యలను తీసుకోవలసివుంది. రాయలసీమలో ఏటేటా వస్తున్న కరువును పారద్రోలవలసివుంది. అటువంటి ప్రధానమై సమస్యలను పరిష్కరించుకోవాలంటే ప్రభుత్వం తన శ సామర్థ్యాలను కేవలం శాంతిభద్రతల పరిరక్షణకే వినియోగిం వలసిన పరిస్థితిలో సాధ్యంకాదు.

మనం ఈ నాడు అతిక్లిష్టమైన పరిస్థితిలో వున్నాం. అయి విజ్ఞతతో, అవగాహనతో, ముందు చూపుతో ప్రవర్తిస్తే రాష్ట్ర యావత్తూ-ముఖ్యంగా తెలంగాణావంటి వెనుకబడిన ప్రాంతాలు శీఘ్రగతిని అభివృద్ధిచెందడానికి విస్తృతమైన అవకాశాలన సృష్టించుకోగల సమయంకూడ యిదే. తెలంగాణ అభివృద్ధికీ, తెలంగాణా ప్రజల న్యాయసమ్మతమై హక్కుల పరిరక్షణకూ, వీటితోపాటు రాష్ట్రంలోని యిత ప్రాంతాలలో ఏర్పడిన సమస్యలను శీఘ్రంగా పరిష్కరించ కోడానికీ, మన ప్రజల ఆర్థిక స్థితిగతులను మెరుగుపరుచుకోడాని అవసరమైన చర్యలన్నిటినీ తీసుకుందుకు వీలుగా మామూల శాంతిపరిస్థితులు ఏర్పడ్డానికి దారితీస్తున్న ప్రస్తుత వాతావరణ కొనసాగడానికి తోడ్పడవలసిందిగా తెలంగాణా సంక్షేమాన్నీ ఆంధ్రప్రదేశ్ సంక్షేమాన్నీ కోరే ప్రజలందరికీ విజ్ఞప్తి చేస్తున్నాను.



గవర్నరుతో రాష్ట్ర నూతన మంత్రివర్గం

# మన మంత్రులు . . . . . .

# వారు నిర్వహించే శాఖలు

| | |
|---|---|
| శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి (ముఖ్యమంత్రి) | .. సాధారణ పరిపాలన, సర్వీసులు, సహకారం, భారీపరిశ్రమలు, ఎక్సైజు, మద్యనిషేధం, గిరిజన సంక్షేమం, శాంతిభద్రతలు, కోర్టులు, జైళ్ళు, శాసనసభ |
| శ్రీ జె. వి. నరసింగరావు (ఉప ముఖ్యమంత్రి) | .. ప్లానింగ్, అర్థగణాంకములశాఖ, భవనాలు, రోడ్లు, రహదార్లు, పురోద్యానవనాలు, నగర మంచినీటి సరఫరా, పి. డబ్ల్యు. డి. వర్క్‌షాప్స్, రైల్వేలు, టెలిగ్రాఫ్‌లకు సంబంధించిన విషయాలు |
| శ్రీ పి. తిమ్మారెడ్డి | .. భూమిశిస్తు, రిజిస్ట్రేషన్ అండ్ స్టాంప్స్, కాందిశీకుల ఆస్తులు, అతియాత్ జాగీర్ నిర్వహణ, ఋణపరిష్కారబోర్డు |
| శ్రీ తోట రామస్వామి | .. పంచాయతీ రాజ్యం, పంచాయతీలు, చిన్న మొత్తాల పొదుపు |
| శ్రీ పి. వి. నరసింహారావు | .. విద్య, పురాతత్త్వపరిశోధన, స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, అకాడమీ మ్యూజియంలతోసహా సాహిత్య, శాస్త్రీయసంస్థలు; సంగీతకళాశాల, సంగీత పాఠశాలలు, పురాతన వ్రాతప్రతుల అనువాదం, పరిరక్షణ, సాహితీవేత్తలకు ఆర్థికసహాయం, ఆధునిక భారతీయభాషల అభివృద్ధి, రాష్ట్రపురాపత్ర పరిరక్షణ, ప్రాంతీయచారిత్రక పరిశోధన, రికార్డులకమిటీ, లలితకళలు,వాస్తుశాస్త్రకళాశాల |
| శ్రీ కాకాని వెంకటరత్నం | .. వ్యవసాయం, ఆహారోత్పత్తి, పశుసంవర్ధన, సమీకృత పాలప్రాజెక్టు, పాడిపరిశ్రమ అభివృద్ధి. |
| శ్రీ డా॥ ఎం. ఎన్. లక్ష్మీనరసయ్య | .. రవాణా విషయాలు |
| శ్రీ ఎన్. చెంచురామానాయుడు | .. పురపాలక సంఘాల నిర్వహణ, టౌన్‌ప్లానింగ్ |
| శ్రీ కె. విజయభాస్కరరెడ్డి | .. ఆర్థికశాఖ, వాణిజ్యపన్నులు |
| శ్రీ ఆర్. రామలింగరాజు | .. దేవాదాయ, ధర్మాదాయశాఖ |
| శ్రీ ఎస్. సిద్దారెడ్డి | .. చిన్న, మధ్యతరహా ఇరిగేషన్, డ్రెయినేజ్‌లు మినహా నీటిపారుదల, వరదల నిరోధం |
| శ్రీ మహమ్మద్ ఇబ్రాహిం అలీ అన్సారీ | .. ఆరోగ్యం, వైద్యం, వక్ఫ్‌బోర్డు, సాలార్జంగ్ మ్యూజియం |
| శ్రీ జె. వెంగళరావు | .. హోమ్, పోలీసు, ఆయుధాలచట్టం, పాస్‌పోర్టు, సినిమటోగ్రఫీ, ఎన్నికలు |
| శ్రీ ఎ. భగవంతరావు | .. చేనేతపరిశ్రమ, సహకార జవుళిమిల్లులు, సహకార చక్కెరఫ్యాక్టరీలు |
| శ్రీ వి. కృష్ణమూర్తినాయుడు | .. విద్యుచ్ఛక్తి, స్టేషనరీ, ముద్రణ |
| శ్రీ జి. సంజీవరెడ్డి | .. కార్మిక, పునరావాసం |
| శ్రీ డి. పెరుమాళ్లు | .. మహిళా సంక్షేమం మినహా సాంఘిక సంక్షేమం |
| శ్రీ సాగి సూర్యనారాయణరాజు | .. అడవులు |
| శ్రీ ఎ. వాసుదేవరావు | .. సమాచారం, పౌరసంబంధాలు |
| శ్రీ ఎ. సంజీవరెడ్డి | .. పౌరసరఫరాలు, రేషనింగ్ |
| శ్రీ రామచంద్రరావు కళ్యాణి | .. మార్కెటింగ్, రాష్ట్రగిడ్డంగుల సంస్థ, వ్యవసాయ పారిశ్రామిక సంస్థ |
| శ్రీ ఆర్. నారపరెడ్డి | .. మధ్యతరహా నీటిపారుదల, డ్రైనేజీ, వరద నిరోధం |
| శ్రీమతి రోడామిస్త్రీ | .. మహిళా సంక్షేమం, టూరిజం, రవీంద్రభారతి, రాష్ట్రాన్ని సందర్శించే సాంస్కృతిక ప్రతినిధుల బృందాలు |
| శ్రీ జి. సి. వెంకన్న | .. లఘుపరిశ్రమలు, లఘుపరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్, పారిశ్రామిక సహకారసంఘాలు |
| శ్రీ వి. పురుషోత్తమరెడ్డి | .. చిన్న నీటివనరులు |
| శ్రీ రాజనరసింహ | .. గృహనిర్మాణం, వసతి, క్రీడామండలి, ఆటలు, స్టేడియం |
| శ్రీ పి. అంకినీడు ప్రసాదరావు | .. వాణిజ్యం, ఎగుమతుల అభివృద్ధి, గనులు, గనుల త్రవ్వకం సంస్థ. |
| శ్రీ ఎస్. ఆర్. ఎ. ఎస్. అప్పలనాయుడు | .. మత్స్యపరిశ్రమ, రేవులు |



12—2

# ప్రభుత్వంలోని ప్రజా ప్రతినిధులు

## కేబినెట్ మంత్రులు

### శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, గుంటూరు జిల్లా చిరుమామిళ్ల గ్రామంలో 1909 జూలై 28 వ తేదీన జన్మించారు. ఆయన చిన్నతనం నుంచి నిరాడంబరుడు, బిడియస్తుడు, మిత భాషి. గుంటూరులో ఉన్నత పాఠశాల విద్య పూర్తిచేశారు. పచ్చయప్ప కళాశాల నుంచి పట్టభద్రులైన తరువాత మద్రాసు విశ్వవిద్యాలయంనుంచి న్యాయశాస్త్రంలో డిగ్రీ పొందారు. తిరువేంద్రంలో ఒకసంవత్సరంపాటు విద్యాభ్యాసం చేశారు. ఆయన మొదటి నుంచీ జాతీయ భావాలు కలిగినవారు కావడంవల్ల విద్యార్థిగా వున్నప్పుడే ఆయనను కాంగ్రెసు సంస్థ ఆకర్షించింది. గుంటూరులో సహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా కొనసాగుతున్న రోజులవి. శ్రీ బ్రహ్మానంద రెడ్డి తమ 12వ యేట 1921 వ సంవత్సరంలో విజయవాడలో గాంధీని మొదటిసారిగా దర్శించారు. తనను తీర్చిదిద్దిన తన పెద్ద సోదరుడు శ్రీ వెంకటరెడ్డిని శ్రీ బ్రహ్మానందరెడ్డి ఎల్లప్పుడూ కృతజ్ఞతతో స్మరించుకుంటూ వుంటారు. శ్రీ వెంకటరెడ్డి 1937 లో రాష్ట్ర శాసనసభ సభ్యుడుగా వున్నారు. శ్రీ బ్రహ్మానందరెడ్డి న్యాయవాదిగా రాణించారు. అయితే ఆయన ఆవృత్తిని నిర్విఘ్నంగా సాగించలేదు. ఆయన క్రీడారంగంలో ఆసక్తి కనబరిచేవారు. తమ కళాశాల హాకీ జట్టుకు ఆయన సారథ్యం వహించారు. టెన్నిస్ బాగా ఆడేవారు. తమ 27వ యేట శ్రీ బ్రహ్మానందరెడ్డి గుంటూరు జిల్లా బోర్డు అధ్యక్ష పదవి నలంకరించారు. 1941 వ సంవత్సరంలోనూ తిరిగి "క్విట్ ఇండియా" ఉద్యమం సందర్భంలోనూ ఆయన రాజమండ్రి, వెల్లూరు, తంజావూరు జైళ్ళలో నిర్బంధించబడినారు.



శ్రీ బ్రహ్మానందరెడ్డి 1946 వ సంవత్సరంలో మద్రాసు శాసన సభకు మొదటిసారిగా ఎన్నికయ్యారు. 1952_55 వ సంవత్సరాల మధ్య తప్ప అప్పటినుంచి ఆయన వరుసగా శాసన సభ సభ్యుడుగా వుంటున్నారు.

ఆయన ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేటు సభ్యుడుగావున్నారు. 1955_56 సంవత్సరాలలో రాష్ట్ర కాంగ్రెసు కమిటీ ప్రధాన కార్యదర్శిగా వున్నారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత శ్రీ నీలం సంజీవరెడ్డి ఏర్పరిచిన మంత్రివర్గంలో చేరవలసిందిగా శ్రీ బ్రహ్మానందరెడ్డిని ఆహ్వానించారు, ఆయనకు స్థానిక పరిపాలన, నీటి సరఫరా, డ్రెయినేజి, టౌన్ ప్లానింగ్ శాఖలు అప్పగించబడినవి.

శ్రీ బ్రహ్మానందరెడ్డి 1958 ఏప్రిల్‌లో ఆర్థిక మంత్రి అయ్యారు. ఆరు సంవత్సరాలకు పైగా ఆయన ఆ శాఖను నిర్వహించారు. 1959 మార్చిలో ప్రణాళికా శాఖ కూడా ఆయనకు అప్పగించబడింది.

1960 జనవరిలో శ్రీ సంజీవయ్య మంత్రివర్గం ఏర్పడినప్పుడు శ్రీ బ్రహ్మానందరెడ్డి ఆయన మంత్రివర్గ సభ్యుడుగా ఆర్థిక శాఖతోపాటుగా న్యాయశాఖనుకూడా నిర్వహించారు. 1962 సాధారణ ఎన్నికలలో శ్రీ బ్రహ్మానందరెడ్డి గుంటూరు జిల్లా ఫిరంగిపురం నియోజకవర్గం నుంచి ఎన్నికయ్యారు. మూడవ సాధారణ ఎన్నికల తరువాత 1962 మార్చిలో శ్రీ సంజీవరెడ్డి రాష్ట్ర ముఖ్యమంత్రిగా తిరిగి వచ్చిన తరువాత శ్రీ బ్రహ్మానందరెడ్డి ఆర్థిక, సహకార శాఖల మంత్రి అయ్యారు. తరువాత సమాచారం, ఎన్నికలు, శాసనసభ శాఖలు కూడా ఆయనకు అప్పగించ బడినవి.

శ్రీ సంజీవరెడ్డి 1964 ఫిబ్రవరిలో రాజీనామా చేసిన పిమ్మట నూత్న మంత్రి మండలిని ఏర్పరిచే నిమిత్తం శ్రీ బ్రహ్మానంద రెడ్డిని ఆహ్వానించారు. శ్రీ బ్రహ్మానందరెడ్డి మంత్రి మండలి 1964 ఫిబ్రవరి 29 వ తేదీన ప్రమాణ స్వీకారం చేసింది. శ్రీసంజీవరెడ్డిని 1964 జూన్‌లో కేంద్రమంత్రి మండలిలోచేర్చుకొనబడినప్పుడు శ్రీ బ్రహ్మానందరెడ్డి పార్టీ నాయకుడుగా ఎన్నిక అయ్యారు. గత 13 సంవత్సరాలలో దాదాపు అన్ని శాఖలనూ ఏదో ఒక సమయంలో నిర్వహించే అవకాశం శ్రీ బ్రహ్మానంద రెడ్డికి కలిగింది. అందువల్ల ఆయన పరిపాలనా విషయాల నన్నింటినీ క్షుణ్ణంగా అవగాహన చేసుకొనగలిగారు.

గత సాధారణ ఎన్నికల తరువాత కాంగ్రెసు మెజారిటీ పార్టీగా గెలుపొందడంతో 1967 మార్చిలో శ్రీ బ్రహ్మానందరెడ్డి

తమ రెండవ మంత్రిమండలిని ఏర్పరచి రాష్ట్రానికి సారథ్యం వహించారు. శాసన సభలోనే కాకుండా సంస్థ నిర్వహణలో సైతం పూర్తిగా ఆధ్వర్యం కలిగి అభిమాన పాత్రుడైన రాష్ట్ర నాయకుడు శ్రీ బ్రహ్మానందరెడ్డి. శాసన సభలో కాంగ్రెసుకు అత్యధిక మెజారిటీవున్న ఒక విశాలమైన రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా శ్రీ బ్రహ్మానందరెడ్డి అఖిలభారత ప్రతిపత్తిని సంతరించుకున్నారు.

శ్రీ బ్రహ్మానందరెడ్డి అనేక సంవత్సరాలు అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యుడుగా వున్నారు. కాంగ్రెసు కార్య నిర్వాహక సంఘం సభ్యుడుగా ఎన్నికయ్యారు. రాష్ట్రంలో ఇటీవల ఏర్పడిన క్లిష్ట పరిస్థితులు తప్పితే, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి సారథ్యంలో అనేక రంగాలలో గణనీయమైన అభివృద్ధిని సాధించింది. దేశంలోని అగ్ర రాష్ట్రాలతో ఒకటిగా రూపొందడానికి అవకాశాలు సమకూర్చుకున్నది. ఆయనను తీవ్రంగా విమర్శించేవారు సైతం ఈ విషయాలను కాదనలేరు.

## శ్రీ జె. వి. నరసింగరావు



శ్రీ జె. వి. నరసింగరావు 1914అక్టోబరు 14వ తేదీన ఆదిలాబాదుజిల్లాలో లక్సెట్టిపేటతాలుకాలో వ్యవసాయ కుటుంబంలో జన్మించారు. అలీఘర్ ముస్లింవిశ్వవిద్యాలయం నుండి పట్టా పొందారు. ఆ తర్వాత ఎం. ఎ; ఎల్. ఎల్. బి. పట్టాలను బెనారసు హిందూ విశ్వవిద్యాలయము నుండి పొందారు. విద్యార్థి దశలోనే శ్రీ రావు విద్యార్థి కార్యక్రమాలలో ఆసక్తితో పాల్గొన్నారు. బెనారసు హిందూ విశ్వవిద్యాలయం విద్యార్థుల సంఘానికి అధ్యక్షులుగ వ్యవహరించారు.

లాయరుగా ఆయన బార్ అసోసియేషన్, బార్ కౌన్సిల్‌లో వివిధ హోదాలలో పనిచేశారు. 6 సంవత్సరాలకుపైగా ఉస్మానియా విశ్వవిద్యాలయం సిండికేటు సభ్యులుగ ఉన్నారు.

స్వతహాగాజాతీయవాదియైన శ్రీ నరసింగరావు, ఆంధ్రమహాసభ ప్రదేశ్ కార్యనిర్వాహక వర్గం సభ్యులుగాను, హైదరాబాదు రాష్ట్ర కాంగ్రెసు సభ్యులుగాను వ్యవహరించారు. "పోలీసుచర్య"కు పూర్వం నిజాము పరిపాలనకు వ్యతిరేకంగా ఆయన న్యాయవాదుల ఆందోళన సంఘం స్థాపించారు. ఆదాయం బాగా లభిస్తున్న న్యాయవాదవృత్తిని త్యజించి రాజకీయాలలో పాల్గొన్నారు. ఆయన ఎ.ఐ.సి.సి. సభ్యులుగా ఉన్నారు. 1956లో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సమయంలో ఆయన హైదరాబాదు ప్రదేశ్ కాంగ్రెసు సంఘం అధ్యక్షులుగా వ్యవహరించారు.

1956లో ఆంధ్ర, తెలంగాణా విలీనీకరణ సమయంలో హైదరాబాదు ప్రదేశ్ కాంగ్రెసు సంఘం అధ్యక్షులుగా ఆయన ఉభయ ప్రాంతాల నాయకులు ఒప్పందం కుదుర్చుకోవడంలో ప్రముఖపాత్ర నిర్వహించారు. తెలంగాణా ప్రజల భయసందేహాల నివృత్తికి తెలంగాణాకు ప్రాంతీయ సంఘం ఉండాలని ప్రప్రథమంగా ఆయనే సూచించారు. 1956సం॥ పెద్దమనుషుల ఒప్పందంపై సంతకం చేసినవారిలో ఆయనకూడ ఉన్నారు.

1956లో సంజీవరెడ్డి మంత్రివర్గంలో శ్రీ నరసింగరావు ప్రప్రథమంగా మంత్రి పదవి అధిష్ఠించారు. 4 సంవత్సరాలపాటు విద్యుచ్ఛక్తి నీటిపారుదల శాఖలను నిర్వహించారు. 1963 ఏప్రిల్‌లో ఆంధ్ర ప్రదేశ్ విద్యుచ్ఛక్తి మండలి అధ్యక్షులై 1966 డిసెంబరు వరకు పనిచేశారు.

గత ఎన్నికలలో శ్రీ రావు, ఆదిలాబాదు జిల్లా లక్సెట్టిపేట నియోజకవర్గంనుండి శాసనసభకు ఎన్నికైనారు. బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో కమ్యూనికేషన్ల మంత్రిగా వ్యవహరించారు. శ్రీ నరసింగరావు తిరుగులేని కాంగ్రెసువాది. నిరంతర కృషిశీలి. విశ్వసించిన సిద్ధాంతాలను గట్టిగా ఆచరణలో పెట్టే స్వభావంగల ప్రజానాయకుడు.

## శ్రీ పి. తిమ్మారెడ్డి



శ్రీ పి. తిమ్మారెడ్డి 1914 నవంబరు 24వతేదీన చిత్తూరు జిల్లా, వాయల్పాడు తాలుకా చెనెపల్లిలో జన్మించారు. మదనపల్లిలో విద్యాభ్యాసం చేశారు. 1930 ప్రారంభంలో రాజకీయాలలో చురుకుగా పాల్గొన్నారు. 1936_37 లో రాయలసీమ విద్యార్థుల ఫెడరేషన్ అధ్యక్షులైనారు. ఆ తరువాత సంవత్సరం ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం ఉపాధ్యక్షులుగా 1941 లో అధ్యక్షులుగా ఎన్నికైనారు.

1946లో శ్రీ రెడ్డి, ఆంధ్రప్రాంత కాంగ్రెసు సంఘం ఉపాధ్యక్షులుగా ఎన్నికైనారు. ఆ పదవిలో రెండు సంవత్సరాలపాటు ఉన్నారు. "క్విట్ ఇండియా" ఉద్యమంలో పాల్గొని రెండు సంవత్సరాలకు పైగా ఖైదుశిక్ష అనుభవించారు.

1952 సాధారణ ఎన్నికలలో శ్రీ రెడ్డి కె.ఎల్.పి టికెట్టుపై మద్రాసు శాసనసభకు ఎన్నికైనారు. ఆంధ్ర రాష్ట్రంలో ప్రకాశం

మంత్రివర్గంలో వ్యవసాయం, పశుపోషణ, అడవులు, మత్స్య పరిశ్రమ, స్థానిక పరిపాలనల శాఖల మంత్రిగా ఆయన వ్యవహరించారు. 1955లో జరిగిన మధ్యంతర ఎన్నికలలో నెగ్గారు. 1956 నుండి సంజీవరెడ్డి మంత్రివర్గంలో వ్యవసాయం, ఆహారశాఖల మంత్రిగా ఉన్నారు. నఫీల్డ్ ఫౌండేషన్‌వారి ఆహ్వానంపై 1961లో బ్రిటన్ పర్యటించారు.

1962 జూన్‌లో ఖాదీగ్రామీణ పరిశ్రమల మండలి అధ్యక్షులుగా రెండు సంవత్సరాలు ఉన్నారు. 1964లో జరిగిన ఉప ఎన్నికలో వాయల్పాడు నుండి శాసనసభకు ఎన్నికయ్యారు. 1964లో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘం అధ్యక్షులైనారు. 1967లో అదే నియోజక వర్గంనుండి రాష్ట్ర శాసనసభకు తిరిగి ఎన్నికైనారు. ఆ తర్వాత బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో వ్యవసాయ మంత్రిగా చేరారు. శ్రీ తిమ్మారెడ్డి రైతుజన బాంధవుడుగా పేరుపొందారు. వివిధసమస్యల విషయాలలో రైతుల పక్షంవహించి ఉన్నదున్నట్లు చెప్పే స్వభావంకలవారు శ్రీ తిమ్మారెడ్డి.

## శ్రీ తోట రామస్వామి



శ్రీ తోట రామస్వామి తూర్పు గోదావరి జిల్లా, పెద్దాపురం తాలుకాలో, వీరవరం గ్రామంలో 1906 డిశంబరు 5 తేదీన జన్మించారు. 1940_1955 సంవత్సరాల మధ్య కాలంలో 15 సంవత్సరాలపాటు రాష్ట్ర చెరకు వుత్పత్తిదార్ల సంఘం సభ్యులుగానూ, 1952 నుంచి రెండు సంవత్సరాలపాటు భారత చెరకు విషయాల సంఘం సభ్యుడుగానూ వున్నారు.

శ్రీ రామస్వామి, 1937_40 సంవత్సరాల మధ్య జిల్లా బోర్డు సభ్యుడుగాకూడా వున్నారు. 1952 నుంచి రెండు సంవత్సరాల పాటు మద్రాసు శాసనసభ సభ్యుడుగా వున్నారు. ఆయన కాకినాడ సహకార కేంద్ర బ్యాంకు అధ్యక్షుడుగానూ, కాకినాడ జిల్లాపరిషత్తు అధ్యక్షుడుగానూ పనిచేశారు.

శ్రీ రామస్వామి, 1963 మార్చిలో ఆంధ్రప్రదేశ్ శాసన మండలికి శాసనసభ నియోజక వర్గంనుంచి ఎన్నిక అయ్యారు. 1964 మే లో సహకారశాఖ మంత్రి అయ్యారు. గత సాధారణ ఎన్నికల తరువాత శ్రీ బ్రహ్మానందరెడ్డి ఏర్పాటు చేసిన మంత్రి వర్గంలో పంచాయతీరాజ్ శాఖా మంత్రిగా చేరారు. తరువాత అటవీ శాఖ కూడా ఆయనకు యివ్వబడింది. శ్రీతోట రామస్వామి వస్తుతః మితభాషి, కార్యనిర్వహణలో పట్టుదల కలవారు. సహాయశీలి.

## శ్రీ పి. వి. నరసింహారావు



శ్రీ పి. వి. నరసింహారావు 1921లో కరీంనగర్ జిల్లాలో జన్మించారు. నాగపూర్ విశ్వవిద్యాలయం నుండి బి.ఎస్.సి; ఎల్. ఎల్. బి. డిగ్రీలు పొందారు. వెనకటి హైదరాబాదు రాష్ట్రంలో 'వందే మాతరం' ఉద్యమంలో పాల్గొన్నారు. హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ కమిటీ ప్రధాన కార్యదర్శిగా పని చేశారు.

1956 లో ప్రదేశ్ కాంగ్రెస్ ఉపాధ్యక్షులుగా నియమింప బడ్డారు. అఖిల భారత ఖాదీబోర్డులోనూ, ఉస్మానియా విశ్వవిద్యాలయ సిండికేట్‌లోనూ, హైదరాబాదు ఖాదీబోర్డులోనూ ప్రముఖమైన పాత్ర వహించారు.

కరీంనగర్ జిల్లా మంథెన నియోజకవర్గం నుంచి రాష్ట్ర శాసనసభకు తొలిసారిగా 1957లోనూ, తర్వాత 1962లోనూ ఎన్నికయ్యారు. సంజీవరెడ్డి మంత్రి మండలి 1962 మార్చిలో ఏర్పాటైనప్పుడు అందులో న్యాయ, సమాచార శాఖలను నిర్వహించారు. 1964లో బ్రహ్మానందరెడ్డి నాయకత్వాన ఏర్పడిన మంత్రిమండలిలో న్యాయ, దేవాదాయ శాఖలను నిర్వహించారు.

గత ఎన్నికలలో తిరిగి మంథెన నియోజక వర్గంనుండి గెలుపొంది 1967లో శ్రీ బ్రహ్మానందరెడ్డి మంత్రి వర్గంలో చేరారు. ఒక ఏడాదిపాటు ఆరోగ్య, వైద్య శాఖల మంత్రి పదవిని నిర్వహించారు. అటుతర్వాత విద్యా మంత్రి అయ్యారు. అటు పిమ్మట 1969లో సమాచార శాఖనుకూడా ఆయనకు అప్పగించడం జరిగింది. శ్రీనరసింహారావు బహు భాషా కోవిదులు. మంచి వక్త, చక్కటి రచయితకూడా. ఎంత క్లిష్టమైన బిల్లునైనా శాసనసభలో ప్రవేశపెట్టి సునాయాసంగా సమర్థవంతంగా నిర్వహించగల ధీశాలి.

## శ్రీ కాకాని వెంకటరత్నం

శ్రీ కాకాని వెంకటరత్నం కృష్ణాజిల్లాలోని గన్నవరం తాలూకాకు చెందిన ఆకునూరులో 1900 ఆగస్టు 3వ తేదీన జన్మించారు. 1924లో కాకినాడలో జరిగిన కాంగ్రెస్ సభలకు వీరు హాజరైనప్పటి నుంచి వీరి రాజకీయ జీవితం ప్రారంభమైంది. 1930లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని రెండున్నర సంవత్సరాల జైలు శిక్ష అనుభవించారు. 1937_40 మధ్య కాలంలో పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు కమిటీ కార్యదర్శిగా పనిచేశారు. మునగాల, లింగగిరి పరగణాలలోని 'జమీందారీ రైతుల' ఆందోళనలో ప్రముఖ పాత్ర వహించారు. 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో



పాల్గొన్నందుకు మూడేళ్ళ పాటు కారాగారవాసం కూడా అనుభవించారు.

1946లో పశ్చిమ కృష్ణా జిల్లా కాంగ్రెస్‌కమిటీ ప్రత్యేకాధికారిగా ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ ఆయనను నియమించింది. ఏడాది తర్వాత పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. 1953_58 మధ్యకాలంలో జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులుగా కూడా వీరు వ్యవహరించారు.

1949లో కృష్ణాజిల్లా బోర్డు అధ్యక్షులయ్యారు. ఆ పదవిలో ఉన్నప్పుడు వారు అనేక విద్యాసంస్థలను ఏర్పాటు చేశారు. 1953లో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్‌కు ప్రధాన కార్యదర్శి అయ్యారు. కృష్ణాజిల్లా ఉయ్యూరు నియోజకవర్గం నుంచి 1952_62 ఎన్నికలలో శాసన సభకు ఎన్నికయ్యారు. 1965_66లో చెరకు సలహా మండలి కార్యదర్శిగా వ్యవహరించారు. 1965_66లో విజయవాడ సహకార కేంద్ర బ్యాంకు డైరెక్టరుగా కూడా పని చేశారు.

1966 సెప్టెంబరులో ఆంధ్రప్రదేశ్ ఎన్నికల సంఘం సభ్యులయ్యారు. 1967 ఏప్రిల్ 7వ తేదీన ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. 1968 మేలో గన్నవరం నియోజక వర్గానికి జరిగిన ఉపఎన్నికలలో రాష్ట్ర శాసన సభకు ఎన్నికయ్యారు. శ్రీ కాకానిని "ఉక్కు కాకాని" అని పిలుస్తారు ప్రజలు. మొదటి నుండీ పోరాటశీలం కలిగిన ప్రజాసేవకుడు. సంపూర్ణమైన కాంగ్రెసు వాది; సర్దార్ కాకాని కాంగ్రెసు సంస్థలో పాత తరానికి చెందిన నాయకుడు.

## డా॥ ఎం. ఎన్. లక్ష్మీనరస్సయ్య

డా॥ ఎం. ఎన్. లక్ష్మీనరస్సయ్య 1913 అక్టోబరు 26వ తేదీన హైద్రాబాద్‌జిల్లా అల్వాలలో జన్మించారు. వైద్య వృత్తిలో ఉన్న ఆయన 1946 నుండి రాష్ట్ర కాంగ్రెసు కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంటున్నారు. హైదరాబాదు విముక్తి ఉద్యమం సందర్భములో ఆయన అరెస్టు అయ్యారు. ఆ తర్వాత 6 సంవత్సరాలకు పైగా హైదరాబాదు జిల్లా కాంగ్రెసు సంఘం ఉపాధ్యక్షులుగా వ్యవహరించారు. 1957 ఎన్నికలలో ఇబ్రాహింపట్నం నియోజకవర్గం నుండి శాసన సభకు ఎన్నికైనారు. 4 సంవత్సరాలపాటు శాసనసభ కాంగ్రెసుపార్టీ కార్యదర్శిగా వ్యవహరించారు.

1959లో శ్రీ లక్ష్మీనరస్సయ్య హైదరాబాదు జిల్లా పరిషత్తు అధ్యక్షులైనారు. ఒక దశాబ్దంపాటు భారత సాంఘిక సంక్షేమ మండలి కార్యనిర్వాహక వర్గం సభ్యులుగా ఉన్నారు. మూడవ సాధారణ ఎన్నికలలో ఇబ్రాహింపట్నం నియోజకవర్గం నుండి శాసనసభకు ఎన్నికైనారు. సంజీవరెడ్డి మంత్రివర్గంలో ఆయన మధ్య తరగతి, లఘు పరిశ్రమలశాఖను నిర్వహించారు. ఆ తర్వాత భారీ పరిశ్రమలను కూడా నిర్వహించారు.



1964లో బ్రహ్మానందరెడ్డి మంత్రివరం ఏర్పడిన తర్వాత డా॥లక్ష్మీనరస్సయ్య పంచాయతీరాజ్ శాఖను నిర్వహించారు. గత సాధారణ ఎన్నికలలో ఇబ్రాహింపట్నం నియోజకవర్గం నుండి తిరిగి శాసనసభకు ఎన్నికైనారు.

శ్రీ లక్ష్మీనరస్సయ్య అతి నిరాడంబరులు. యదార్థవాది.

## శ్రీ ఎన్. చెంచురామానాయుడు



శ్రీ నలమోతు చెంచు రామానాయుడు, నెల్లూరు జిల్లా, కందుకూరు తాలూకా, చింతలపాలెంలో 1914 అక్టోబరులో జన్మించారు. ప్రారంభ విద్యానంతరం జాతీయోద్యమంలో ప్రవేశించారు. 1935వ సంవత్సరం నుంచి కాంగ్రెసు సంస్థలో వున్నారు. 1936లో నెల్లూరు జిల్లా బోర్డు సభ్యుడుగా ఎన్నికయ్యారు. త్వరలోనే బోర్డు ఉపాధ్యక్షులయ్యారు. 1942లో క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంలో ఆయన జిల్లాబోర్డులో క్విట్ ఇండియా తీర్మానాన్ని ప్రవేశపెట్టారు.

శ్రీ చెంచురామానాయుడు 1949 నుంచి 1953 వరకు నెల్లూరు జిల్లా బోర్డు అధ్యక్షుడుగా వున్నారు, 1959_1962 సంవత్సరాల మధ్య నెల్లూరు జిల్లా పరిషత్తు తొలి అధ్యక్షుడుగా పని చేశారు. ఆయన 1952లో పూర్వ మద్రాసు రాష్ట్ర శాసన సభకు ఎన్నికయ్యారు. అప్పటి నుంచి వరుసగా కందుకూరు శాసనసభా నియోజకవర్గం నుంచి ఎన్నికవుతున్నారు మూడవ సాధారణ ఎన్నికలలో ఆయన అదే నియోజకవర్గం నుంచి గెలుపొందారు.

వీరు 1966 లో శ్రీ బ్రహ్మానందరెడ్డి మంత్రి మండలిలో మ్యునిసిపల్ పరిపాలన, అటవీశాఖల మంత్రిగా చేరారు. ఆయన గత సాధారణ ఎన్నికలలో కందుకూరు నియోజక వర్గం నుంచి ఎన్నికైన తర్వాత మ్యునిసిపల్ పరిపాలన, గృహనిర్మాణం, గృహవసతులశాఖా మంత్రిగా మంత్రిమండలిలో తిరిగి చేర్చుకొనబడినారు. ఆయన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం సెనేటు సభ్యుడుగానూ, రాష్ట్రీ రవాణా సంస్థ సభ్యుడుగానూ వున్నారు.

శ్రీ చెంచురామా నాయుడు మృదుభాషి, మితభాషి, ప్రయోజనకరమైన సత్కార్య నిర్వహణ ఆయన అభిమతం

## శ్రీ కె. విజయభాస్కర రెడ్డి



శ్రీ కె.విజయభాస్కర రెడ్డి, కర్నూలు జిల్లా లద్దగిరి గ్రామంలో 1922లో జన్మించారు మదనపల్లి లోని థియోసాఫికల్ కళాశాల నుంచి పట్టభద్రులయ్యారు మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి లా డిగ్రీ పుచ్చుకున్నారు. "క్విట్ ఇండియా" ఉద్యమం సందర్భంలో విద్యార్థి ఉద్యమంలో పాల్గొన్నారు.

శ్రీ విజయభాస్కర రెడ్డి, 1951 నుంచి పి. సి. సి. సభ్యుడుగా వుంటున్నారు. పి. సి. సి. కార్యదర్శిగా పనిచేశారు 1955_62 సంవత్సరాల మధ్య శాసనసభ కాంగ్రెసుపార్టీ కార్యదర్శిగా వున్నారు, అమెరికా ప్రభుత్వం ఆహ్వానంపై ఆయన అమెరికా సంయుక్త రాష్ట్రాలలో పర్యటించి అచ్చటి విద్యా విధానాలను పరిశీలించారు.

ఆయన 1959లో కర్నూలు జిల్లా పరిషత్తు తొలి అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు, 3 సంవత్సరాలపాటు ఆ పదవిని నిర్వహించారు 1961లో ఆయన మళ్ళీ ఆ పదవికి ఎన్నుకొనబడినారు. 1955 నుంచి 1962 వరకు శాసనసభ సభ్యుడుగా వున్నారు. 1967లో ఆయన బ్రహ్మానంద రెడ్డి మంత్రివర్గంలో సహకారశాఖా మంత్రిగా చేరారు, తరువాత శాసన మండలికి ఎన్నికయ్యారు, శ్రీ విజయభాస్కరరెడ్డి ఆజానుబాహువు. ఆయన ఆంధ్రప్రదేశ్ స్పోర్ట్సుకౌన్సిలు అధ్యక్షుడుగా కూడా ఉన్నారు. సహకారం,నాగార్జునసాగర్ విషయాల మంత్రిగా వున్నప్పుడు ఆయకట్టు అభివృద్ధి కృషిని చురుకుగా కొనసాగించారు.

## శ్రీ రుద్రరాజు రామలింగరాజు

శ్రీ ఆర్. రామలింగరాజు తూర్పుగోదావరి జిల్లా, రాజోలు తాలూకాలోని పద్మరాజపురంలో 1915 డిశంబర్ 14న జన్మించారు. గత32 సంవత్సరాలనుంచి ఆయనకు ఎ.పి.సి.సి.తో సంబంధంవుంది.

1960 నుంచి 1966 వరకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘంలో సభ్యులు. అఖిలభారత కాంగ్రెసులో 1967 నుంచి సభ్యులు. ఆరు సంవత్సరాలపాటు డి.సి.సి.అధ్యక్షుడుగా పని చేశారు. 1954 నుంచి జిల్లారైతుకాంగ్రెసుఅధ్యక్షుడుగా వున్నారు. ఆయన పాలకొల్లు చక్కెర ఫ్యాక్టరీ, సహకార కేంద్రీ బ్యాంకుల డైరెక్టర్ల బోర్డు సభ్యుడుగా వున్నారు.



శ్రీరామలింగరాజు 1958 వ సంవత్సరంనుంచి శాసన మండలి సభ్యుడుగా వుంటున్నారు. 1966 లో ఆయన స్థానిక సంస్థల నియోజక వర్గంనుంచి ఎగువ సభకు ఎన్నికయ్యారు. 1967 లో మంత్రిమండలిలో చేరారు. ఆయనకు ధర్మాదాయశాఖ అప్పగించబడింది.

శాసనసభలోగానీ, బయటగానీ మాట్లాడేటప్పుడు శ్రీ రాజు హుందాగా మాటాడుతారు. మంచి విగ్రహం.

## శ్రీ శీలం సిద్ధారెడ్డి

శ్రీ శీలం సిద్దారెడ్డి ఖమ్మం జిల్లా, మధిర తాలూకా, బనిగండపాడు గ్రామంలో 1927 ఆగస్టు 23 వ తేదీన జన్మించారు. ఖమ్మం ఉన్నత పాఠశాలలో విద్య నభ్యసించారు. 1948 లో పట్టభద్రులయ్యారు, 1950 లో ఉస్మానియా విశ్వవిద్యాలయంనుంచి న్యాయశాస్త్ర పట్టా పొందారు.



ఉన్నత పాఠశాలలో చదువుకొంటున్నప్పటి నుంచికూడా శ్రీ సిద్దా రెడ్డి స్వాతంత్ర్యోద్యమంతో సన్నిహితంగా పరిచయం కలిగి వున్నారు. ఉస్మానియా విశ్వ విద్యాలయ విద్యార్థి నాయకుల్లో వీరు ఒకరు. హైద్రాబాదు సంస్థానం భారత యూనియన్‌లో విలీనం కావాలని ప్రజలు స్వాతంత్ర్య పోరాటం కొనసాగిస్తున్న సమయంలో శ్రీ సిద్దారెడ్డి 'కళాశాలల బహిష్కరణ' ఉద్యమాన్ని 1946_48 కాలంలో నిర్వహించారు.

19.6 లో కాంగ్రెసు సంస్థలోచేరారు. 1949 నుంచి 1952 వరకు తాలూకా కాంగ్రెసు కమిటీకి కార్యదర్శిగా పని చేశారు. 1954_1957 మధ్యకాలంలో జిల్లా యువజన కాంగ్రెసు సంఘానికి

కన్వీనర్‌గానూ, 1959 లో ప్రధాన కార్యదర్శిగాను, 1959_1964 మధ్యకాలంలో ఖమ్మం జిల్లా కాంగ్రెసు సంఘానికి అధ్యక్షుడుగాను వ్యవహరించారు. ప్రదేశ్ కాంగ్రెసు ఆర్గనైజరుగా 1963_1964లో పనిచేశారు. 1964 లో ప్రాంతీయ కాంగ్రెసు సంఘానికి ప్రధాన కార్యదర్శిగా నియమింపబడి 1967 సాధారణ ఎన్నికల అనంతరం మంత్రిపదవిని చేపట్టేవరకు ఆ పదవిలోనే ఉన్నారు. అనేక సహకార సంస్థలతో వీరికి సన్నిహిత పరిచయం వుంది. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర సహకార బ్యాంకుకు వీరు 1965 నుంచి 1967 వరకు అధ్యక్షులుగా వ్యవహరించారు.

వీరి స్వంతజిల్లా ఖమ్మంలో అనేక విద్యాసంస్థలను గ్రంథాలయాలను, హరిజన హాస్టళ్ళను ఇంకా అనేక యితర సాంఘిక సంక్షేమ సంస్థలను ఏర్పాటుచేయడానికి వీరు కారకులయ్యారు.

1958 లో ఆంధ్ర ప్రదేశ్ శాస. మండలి తొలిసారిగా ఏర్పాటు చేయబడినప్పుడు వీరు దానికి స్థానిక సంస్థల తరపున ఎన్నికయ్యారు. అప్పట్లో వీరే శాసనమండలిలోని సభ్యులందరిలోకీ చిన్నవారు 1964 లో తిరిగి వీరు శాసనమండలికి అసెంబ్లీ నియోజకవర్గంనుంచి ఎన్నికయ్యారు. 1958 లో శాసనసభ కాంగ్రెసు పార్టీ ఎగ్జిక్యూటివ్‌కు ఎన్నికయ్యారు. 1961 లో శాసనసభ కాంగ్రెసు పార్టీకి కార్యదర్శిగా నియమింపబడి 1964 వరకు ఆ పదవిలోనే వున్నారు.

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి నాయకత్వంక్రింద 1967 లో ఏర్పడిన మంత్రివర్గంలో సేద్యపునీటి విషయాలు, గిరిజనసంక్షేమం శాఖల మంత్రిగా శ్రీ శీలం సిద్దారెడ్డి వ్యవహరించారు. ఆ మంత్రిమండలిలో ఆయన అందరికంటే చిన్నవాడు.

శ్రీ శీలం సిద్దారెడ్డి సంస్థా నిర్మాణకృషిలో దిట్ట. ఆడంబర రహితంగా ప్రజాసేవ చేసే నాయకుడుగా ఆయన పేరుపొందారు.

## శ్రీ మహమ్మద్ ఇబ్రాహిం అలీ అన్సారీ

శ్రీ మహమ్మద్ ఇబ్రాహిం అలీ అన్సారీ మహబూబ్‌నగర్ పట్టణంలో 1917 జూన్ 10వ తేదీన జన్మించారు. హైద్రాబాద్ లోని సెయింట్ జార్జి గ్రామర్ స్కూలులో ప్రారంభ విద్య నభ్యసించిన అనంతరం అలీగడ్ ముస్లిం విశ్వవిద్యాలయంలో చేరారు. బొంబాయి టెక్నికల్ ఇనిస్టిట్యూటు నుంచి ఏ.ఎం.ఐ. టి. డిప్లొమా పొందిన తరువాత 1939లో నిజాం ప్రభుత్వంలో అటవీశాఖలో చేరారు 1946లో తమ ఉద్యోగానికి రాజీనామా చేశారు,

రెండు సంవత్సరాల తరువాత కాంగ్రెసులో చేరి మహబూబ్‌నగర్ జిల్లా కాంగ్రెసు కమిటీలో ప్రముఖ సభ్యుడుగా రూపొందారు. 1951లో మునిసిపల్ కౌన్సిలరు అయ్యారు. ఆ తరువాత ఆరు సంవత్సరాలకు మహబూబ్‌నగర్ సిటీ మునిసిపాలిటీ అధ్యక్షుడుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. 1955లో మహబూబ్ నగర్ సహకార కేంద్ర బ్యాంకు ఉపాధ్యక్షుడుగా ఎన్నికయ్యారు.

1960 లో ఆయన ఉస్మానియా విశ్వవిద్యాలయ సెనేటుకు, మహబూబ్‌నగర్ స్థానిక సంస్థల నియోజకవర్గం నుంచి అయిదు సంవత్సరాల కొరకు ఎన్నికయ్యారు. తరువాత రెండు సంవత్సరాలకు జిల్లా ముస్లిం వక్ఫ్‌బోర్డు అధ్యక్షుడుగా నామినేటు చేయబడినారు. 1965లో మహబూబ్‌నగర్ మార్కెటు కమిటీ అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు.



శ్రీ అన్సారీ, గత సాధారణ ఎన్నికలలో మహబూబ్‌నగర్ శాసనసభా నియోజకవర్గం నుంచి ఎన్నికయ్యారు. అప్పుడు వారు శ్రీ బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో చేర్చుకొనబడినారు.

శ్రీ అన్సారీ ప్రశాంత స్వభావం గలవారు. చూపులకు గంభీరంగా కనిపించినా, సామాన్య ప్రజల క్షేమం కోరే అమృత హృదయులు.

## శ్రీ జలగం వెంగళరావు

శ్రీ జలగం వెంగళరావు 1921 సంవత్సరంలో జన్మించారు. జాతీయ నాయకుల పిలుపుపై జాతీయోద్యమంలో చేరారు. వెనకటి హైదరాబాదు రాష్ట్రంలో రజాకార్లకు వ్యతిరేకంగా ఉద్యమం ప్రారంభించబడినప్పుడు ఆయన అందులో ప్రముఖపాత్ర వహించారు.



హైదరాబాదు రాష్ట్రం భారత యూనియన్‌లో విలీనమైన వెంటనే 1948లో మధిర తాలూకా కాంగ్రెస్ అధ్యక్షులయ్యారు. ఆ తర్వాత ఖమ్మం జిల్లా పరిషత్తుకు తొలి అధ్యక్షులయ్యారు.

ఖమ్మంజిల్లా అభివృద్ధికై ఆ జిల్లా పరిషత్తు, శ్రీ వెంగళరావు గారి నాయకత్వం క్రింద కేటాయించిన ధనాన్ని సద్వినియోగపరచి ఎంతో అభివృద్ధిని సాధించింది. గత రెండు సార్వత్రిక ఎన్నికలలోనూ ఆయన ఖమ్మంజిల్లా వెంసూరు నియోజకవర్గం నుంచి రాష్ట్ర శాసనసభకు ఎన్నికయ్యారు.

1962లో రాష్ట్రప్రభుత్వం ఆయనను ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పంచాయతీరాజ్ మండలి అధ్యక్షునిగా నియమించింది. 1968 ఫిబ్రవరి వరకు ఆయన ఆ హోదాలో పనిచేశారు.

సంస్థా నిర్మాణకృషిలో శ్రీ వెంగళరావు దిట్ట. ఆయన సహజలక్షణాలైన నిరాడంబరత, మితభాషిత్వంలోనే ఆయన లోని శక్తిసంపద అంతర్గతంగా వున్నది.

## శ్రీ అనగాని భగవంతరావు



శ్రీ అనగాని భగవంతరావు, 1923 జూలై మొదటి తేదీన గుంటూరు జిల్లా, రేపల్లె తాలూకాలోని అనగానివారి పాలెంలో ఒక మధ్యతరగతి కుటుంబంలో జన్మించారు. గుంటూరు లోని ఏ.సి. కళాశాలలోనూ నాగపూర్‌లోని విశ్వవిద్యాలయ కళాశాలలోనూ ఉన్నత విద్యనభ్యసించినారు. నాగపూర్ లోనే యం.ఎ, యల్.యల్.బి. పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. తరువాత 1954 లో ప్రజా జీవితంలోనికి ప్రవేశించారు. 1955–62 సంవత్సరాల మధ్య శాసనసభ్యులుగా వున్నారు.

1957 డిశంబరు మొదలు 1960 జనవరి వరకు పరిశ్రమలు, ధర్మాదాయశాఖల మంత్రిగా వున్నారు. 1967వ సంవత్సరంలో జరిగిన సాధారణ ఎన్నికలలో కూచినపూడి నియోజకవరం నుంచి ఎన్నికయ్యారు. 1956–57వ సం. లో ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన తరగతుల సంఘం అధ్యక్షుడుగా వున్నారు

1964 జూన్ నుంచి 1966 నవంబరు వరకు ఖాదీ, గ్రామీణ పరిశ్రమల మండలి అధ్యక్షుడుగా పనిచేశారు.

శ్రీ భగవంతరావు మృదుహృదయులు: స్నేహశీలి.

## శ్రీ వాసిరెడ్డి కృష్ణమూర్తి నాయుడు



శ్రీ వాసిరెడ్డి కృష్ణమూర్తినాయుడు శ్రీకాకుళం జిల్లా, బొబ్బిలి తాలూకాలోని పినపరిలో 1922 ఆగస్టు 16 వ తేదీన జన్మించారు. గిండి ఇంజనీరింగ్ కళాశాలలో ఎల్. సి. ఇ కోర్సు అభ్యసించారు. 1942 లో 'క్విట్ ఇండియా' ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించారు తరువాత ఒక సంవత్సరంపాటు చదువు మానివేశారు. పిమ్మట 1946 లో ఎల్. సి. ఇ. కోర్సు పూర్తి చేశారు.

శ్రీ కృష్ణమూర్తి నాయుడు అయిదు సంవత్సరాలకు పైగా జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యుడుగా వున్నారు. 1956 లో ఆయన సోషలిస్టు పార్టీ చేరి మూడు సంవత్సరాల తరువాత ఆ పార్టీ నుంచి బయటకి వచ్చారు. చీపురుపల్లి నియోజకవర్గంనుంచి సోషలిస్టు పార్టీ అభ్యర్థిగా పార్లమెంటుకు పోటీచేశారు. 1962 సాధారణ ఎన్నికలలో బొబ్బిలి తాలూకా బలిజెపేట శాసనసభ నియోజకవర్గం నుంచి కాంగ్రెసు అభ్యర్థిగా ఎన్నికయ్యారు 1968 లో శాసన మండలి సభ్యుడు అయ్యారు.

శ్రీ నాయుడు 1962 లో శ్రీకాకుళంజిల్లా పరిషత్తు ఉపాధ్యక్షుడయ్యారు మరుసటి సంవత్సరం అధ్యక్షుడయ్యారు. 1964లో ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ సభ్యత్వం పొందారు. మూడు సంవత్సరాల తరువాత ఎ ఐ. సి సి సభ్యుడుగా ఎన్నికయ్యారు. 1968 నుంచి ఎ. పి. సి. సి. ప్రధాన కార్యదర్శిగా వున్నారు. 1967 నుంచి రాష్ట్ర హౌజింగ్ బోర్డు సభ్యుడుగా వ్యవహరిస్తున్నారు కొంత కాలంపాటు ఆంధ్రప్రదేశ్ చెరకు ఉత్పత్తిదార్ల సంఘం ఉపాధ్యక్షుడుగా పనిచేశారు.

## శ్రీ జి. సంజీవరెడ్డి

1929లో జన్మించిన శ్రీ సంజీవరెడ్డి విద్యార్థి కాంగ్రెస్ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొన్నారు. 1940 ప్రాంతంలో నిజామ్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగిన సత్యాగ్రహంలో పాల్గొని అనేక సారు అరెస్టు అయినారు. 1962 లో జరిగిన సాధారణ ఎన్నికలలో సిర్పూరు ద్విసభ్య నియోజక వర్గంనుండి శాసనసభకు ఎన్నికైనారు. గత ఎన్నికలలో కూడ అదే నియోజక వర్గంనుండి ఎన్నుకోబడినారు. స్వయంకృషివ ప్రధానమైన కార్మిక నాయకుడుగా విఖ్యాతిచెందారు. కార్మిక వర్గానికి విశ్వాస పాత్రుడైన నాయకుడు.



శ్రీ రెడ్డి, రాష్ట్రంలో పేరుపొందిన కార్మిక నాయకులు. 20 సంవత్సరాల ప్రాయంనుండే ఆయన కార్మికులతో, కార్మిక సంఘాలతో సన్నిహితసంబంధం కలిగి ఉన్నారు. 1954 లో ఐ. ఎన్. టి. యు. సి. కి ప్రధాన కార్యదర్శిగా ప్రప్రథమంగా ఎన్నికైనారు. ఆ తర్వాత 1955లో కూడ ఆ పదవిలోఉన్నారు. హైద్రాబాదు రాష్ట్ర విభాగం ఐ. ఎన్. టి. యు. సి. అధ్యక్షులుగా ఎన్నికైనారు. 1957 లో ఆంధ్ర ప్రదేశ్ విభాగం ఐ. ఎన్. టి. యు. సి. అధ్యక్షులుగా ఎన్నికైనారు. 1964 లో అఖిల భారత ఐ. ఎన్. టి. యు సి. ఆర్గనైజింగ్ కార్యదర్శిగా వ్యవహరించారు.

పూర్వపు హైద్రాబాదు రాష్ట్రంలోను తర్వాత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోను1955 నుండి నిరంతరంగా ఆయన కార్మికసలహాసంఘం సభ్యులుగా ఉన్నారు. పూర్వపు హైద్రాబాదు రాష్ట్రంలోను ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలోను కనీసవేతనాల సంఘం సభ్యులుగా ఉన్నారు.

1964 లో ఆయనను ఆల్విన్ మెటల్ వర్క్సు ప్రభుత్వం డైరెక్టరుగా నియమించింది. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘం కార్యనిర్వాహక వర్గసభ్యులుగా ఎన్నికైనారు.

శ్రీసంజీవరెడ్డి అంచనాల సంఘం, భారతప్రభుత్వ ప్రాంతీయ సైన్యం సలహాసంఘం, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రరోడ్డు రవాణా కార్పొరేషన్ సలహాసంఘం, యంత్రపరికరాల పరిశ్రమ, కాగితం పరిశ్రమ మొదలగు అనేక సంఘాలలో సభ్యులుగా వ్యవహరించారు.

## శ్రీ దాసరి పెరుమాళ్ళు



శ్రీ దాసరి పెరుమాళ్ళు స్వాతంత్ర్య సమరయోధుల కుటుంబానికి చెందినవారు. పశ్చిమగోదావరిజిల్లా తణుకు తాలూకా ఓడూరు గ్రామ నివాసులు. ఆయన కుటుంబానికి రాజకీయ, సాంఘిక చరిత్ర ఉంది. ఆయన తండ్రి కొంతకాలం జిల్లాబోర్డు సభ్యులుగాను, ఆతరువాత ఓడూరు జిల్లా బోర్డు అధ్యక్షులుగాను పనిచేశారు. శ్రీ పెరుమాళ్ళు పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెస్ సంఘం కార్యనిర్వాహకవర్గం సభ్యులుగా వ్యవహరించారు. ఆరు సంవత్సరాలకు పైగా తిరుమల తిరుపతి ట్రస్టుబోర్డు సభ్యులుగా ఉన్నారు. ఒక సంవత్సరం పాటు సింహాచలం దేవస్థానం ట్రస్టుబోర్డు సభ్యులుగాకూడ వ్యవహరించారు. రెండు సంవత్సరాలపాటు రాష్ట్రసాంఘిక సంక్షేమ సలహామండలి సభ్యులుగా ఉన్నారు. పేదప్రజలను ఎంతో సానుభూతితో చూస్తూ సాధ్యమైన సహాయ సహకారాలు అందజేస్తున్నారు. గ్రంథాలయోద్యమంతో సన్నిహిత సంబంధం కలిగిఉన్నారు. రాష్ట్రగ్రంథాలయ సలహా సంఘం సభ్యులుగా కూడ వ్యవహరించారు. 195' నుండి రాజకీయాలలో పాల్గొంటూ పశ్చిమ గోదావరిజిల్లా ఆచంట నియోజకవర్గం నుండి కాంగ్రెసు టిక్కెట్టుపై శాసనసభకు వరసగా ఎన్నికవుతున్నారు.

## స్టేట్ మంత్రులు

## శ్రీ సాగి సూర్యనారాయణ రాజు

శ్రీసాగి సూర్యనారాయణరాజు, విశాఖపట్నం జిల్లా నర్సీపట్నం తాలూకాలోని తంగేడు గ్రామంలో 1903 నవంబరు మొదటి తేదీన జన్మించారు. విజయనగరంలోని మహారాజా కళాశాలలో విద్యాభ్యాసం చేశారు. గాంధీజీ పిలుపు నందుకొని చదువుకు స్వస్తి చెప్పారు.



శ్రీ రాజు, 1952లో మొదటి సాధారణ ఎన్నికలలో పాయకరావు పేట నియోజకవర్గం నుంచి మద్రాసు శాసనసభకు ఎన్నికయ్యారు. 1955లో జరిగిన మధ్యంతర ఎన్నికలలో నర్సీపట్నం పాయకరావు పేట ద్విసభ్య నియోజకవర్గంనుంచి ఆంధ్ర శాసనసభకు ఎన్నిక అయ్యారు. గత సాధారణ ఎన్నికలలో ఆయన అదే నియోజకవర్గం నుంచి ఎన్నికైనారు.

శ్రీ రాజు జిల్లాకాంగ్రెసు కమిటీలోనూ, ప్రాంతీయకాంగ్రెసు కమిటీలోనూ వివిధ హోదాలలో పనిచేశారు. ఆయన విశాఖపట్నం జిల్లా పరిషత్తు తొలి అధ్యక్షుడు, ఏటికొప్పాక చక్కెర ఫ్యాక్టరీ అధ్యక్షుడుగా పనిచేశారు. తిరుమల తిరుపతి ధర్మకర్తల బోర్డు సభ్యుడుగావున్నారు. ఎలమంచిలి తాలూకా ఉప్మాకలోని శ్రీ వెంకటేశ్వరస్వామి దేవాలయ పునరుద్ధరణ సంఘ అధ్యక్షుడుగా వున్నారు. నర్సీపట్నం తాలూకాలోని శ్రీ రాజ గోపాల స్వామి దేవాలయపునరుద్ధరణసంఘం అధ్యక్షుడుగాకూడా పనిచేశారు. 1963_67 సంవత్సరాలమధ్య ఎ.ఐ.సి.సి. సభ్యుడుగా వున్నారు. 1967లో శాసనసభ కాంగ్రెసుపార్టీ చీఫ్‌విప్‌గా ఎన్నిక అయ్యారు.

అరవైఆరు సంవత్సరాల వయస్సునకూడా సడలని శక్తి సామర్థ్యాలుగల వ్యక్తి.

## శ్రీ ఎ. వాసుదేవరావు

శ్రీ అక్కిరాజు వాసుదేవరావు, 1926 జూలై 10వ తేదీన నల్గొండ జిల్లా, హుజూర్‌నగర్ తాలూకాలోని మేళ్లచెరువులో జన్మించారు. జగ్గయ్యపేటలో విద్యాభ్యాసంచేశారు.



1947వ సంవత్సరంలో హైద్రాబాదు స్టేట్‌కాంగ్రెసు పతాకంక్రింద సత్యాగ్రహం చేసినందుకు ఆయనకు ఆరున్నర సంవత్సరాలు జైలుశిక్ష విధించారు. కాని "పోలీసుచర్య" తరువాత విడుదల చేశారు.

శ్రీ వాసుదేవరావు గత రెండు సాధారణ ఎన్నికలలోనూ హుజూర్ నగర్ నియోజకవర్గం నుంచి ఎన్నిక అయ్యారు. ఆయన కాంగ్రెసు సంస్థలో తాలూకా

స్థాయిలోనూ జిల్లా స్థాయిలోనూ అనేక పదవులు నిర్వహించారు. ఏ. ఐ. సి. సి. సభ్యుడుగాకూడా వున్నారు. తమ జిల్లాలో అనేక విద్యా సంస్థలను నెలకొల్పి ప్రోత్సహించారు. కోదాడులోని కె. ఆర్. ఆర్. కళాశాలతో ఆ సంస్థ స్థాపక సభ్యుడుగానూ, అధ్యక్షుడుగానూ ఆయనకు సన్నిహిత సంబంధంవుంది, శ్రీ వాసుదేవరావు ప్రజాసమూహాలను కదిలించగల మంచివక్త. ప్రజల, ప్రాంతాల పరిస్థితుల అవగాహన కలిగినవారు శాసన సభలో ప్రభుత్వపక్షానికి ఎల్లప్పుడూ ఆయన పెట్టనికోటలా వుండేవారు.

## శ్రీ ఆనం సంజీవరెడ్డి

శ్రీ ఆనం సంజీవరెడ్డి, 1923 నవంబరు 6వ తేదీన జన్మించారు. ఆయన ఆంధ్ర విశ్వవిద్యాలయం పట్టభద్రులు. ఈ శతాబ్దిలోని నాలుగు, అయిదవ దశాబ్దాలలో ఆయన నెల్లూరు జిల్లాలో విద్యార్థి, యువజన కాంగ్రెసు ఉద్యమాలను చేపట్టి వాటికి సారథ్యం వహించారు. పూర్వపు జిల్లా బోర్డు సభ్యుడుగా వున్నారు. నెల్లూరు జిల్లా కాంగ్రెసు కమిటీ కార్యదర్శిగానూ. అధ్యక్షుడుగానూ వున్నారు. 1961వ సంవత్సరంలో ఆయన ఏ.ఐ.సి.సి. లో సభ్యుడు.



1962లో జరిగిన సాధారణఎన్నికలలో శ్రీసంజీవరెడ్డి నెల్లూరు జిల్లాలోని ఆత్మకూరు నియోజకవర్గంనుంచి ఎన్నికయ్యారు. 1968 ఫిబ్రవరిలో జరిగిన ఉపఎన్నికలలో రాపూరు శాసనసభా నియోజకవర్గం నుంచి ఎన్నికయ్యారు.

శ్రీ సంజీవరెడ్డి, కీ.శే, ఎ.సి. సుబ్బారెడ్డి సోదరునిపుత్రుడు. మంచి విగ్రహం, పట్టుదలగల స్వభావం గల నాయకుడు.

## శ్రీ రామచంద్రరావు కళ్యాణి

శ్రీ రామచంద్రరావు కళ్యాణి, 1916లో మహబూబ్ నగర్ జిల్లా, మక్తల్ తాలూకాలోని నారాయణపేటలో జన్మించారు. పూర్వ హైద్రాబాదు రాష్ట్రంలోని స్టేట్ కాంగ్రెసు కార్యకలాపాలలోనూ ఆంధ్రమహాసభ కార్యకలాపాలలోనూ ఆయన ప్రముఖంగా పాల్గొన్నారు. నిజాం పరిపాలనకు వ్యతిరేకంగా జరిగిన సత్యాగ్రహోద్యమంలో ముందంజవేసి కారాగార వాసంఅనుభవించారు. 1952_1961 సంవత్సరాల మధ్య నారాయణపేట మునిసిపల్ కౌన్సిలు అధ్యక్షుడుగా వున్నారు, డి.సి.సి. అధ్యక్షుడుగానూ. పి. సి. సి. సభ్యుడుగానూ వున్నారు.



శ్రీ రామచంద్రరావు కల్యాణి, 1967 సాధారణ ఎన్నికలలో మహబూబ్ నగర్ జిల్లా మక్తల్ నియోజకవర్గంనుంచి ఎన్నికయ్యారు ఆయన శాసన సభ్యుడుగా, భూమి శిస్తు మదింపు; దుకాణాలు, వ్యాపార సంస్థల చట్టం సంయుక్త సెలక్టు కమిటీలలో పనిచేశారు.

తెలంగాణా ప్రాంతీయాభివృద్ధి ఉపసంఘం సభ్యుడుగాకూడా వున్నారు.

## శ్రీ ఆర్. నారపరెడ్డి

శ్రీ రొండా నారపరెడ్డి, గుంటూరుజిల్లా బాపట్లతాలూకా, బందిళపల్లి గ్రామంలో 1922, ఆగస్టు 28వ తేదీన జన్మించారు, 1936 నుంచి 1941వరకు ఆయన విద్యార్థి సమాఖ్య వ్యవస్థాపక కార్యదర్శిగా పనిచేశారు. రాష్ట్ర సమాఖ్య కార్యవర్గ సభ్యుడుగా వున్నారు.

శ్రీ నారపరెడ్డి బాపట్ల తాలూకా యువజన సంస్థ అధ్యక్షుడుగా పనిచేశారు. 1942వ సంవత్సరంనుంచి కిసాన్ సభ సభ్యుడుగా వున్నారు, 1946 నుంచి గుంటూరు జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యుడుగా పనిచేశారు. జిల్లా కాంగ్రెసు కమిటీ ఉపాధ్యక్షుడుగా కార్యదర్శిగా కూడా ఆయన వ్యవహరించారు. శ్రీ నారపరెడ్డి 1957 నుంచి 1962 వరకు ఒంగోలు లోకసభా నియోజక వర్గానికి ప్రాతినిధ్యం వహించారు, 1957 నుంచి ఆయన కేంద్ర పొగాకు సంఘం సభ్యుడుగా లోక్ సభనుంచి ఎన్నికయ్యారు. 1964 నుంచి 1967 వరకు ఆయన గుంటూరు జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడుగా వున్నారు,



శ్రీ నారపరెడ్డి. గుంటూరు జిల్లా పరిషత్తు సభ్యుడుగా. పరిషత్తు ఏర్పడినప్పటి నుంచి వున్నారు. గుంటూరు జిల్లా కేంద్ర సహకార బ్యాంకు డైరెక్టర్ల బోర్డులో కూడా ఆయన సభ్యులు. గుంటూరు జిల్లా పొగాకు ప్రోసెసింగ్. మార్కెటింగ్ సంఘం

అధ్యక్షుడుగా, గుంటూరు జిల్లా సహకార మార్కెటింగ్ సంఘం సభ్యుడుగా కూడా ఆయన పనిచేశారు.

శ్రీ నారపరెడ్డి ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ సభ్యుడుగానూ, ఆంధ్రప్రదేశ్ లఘుపరిశ్రమల సంస్థ డైరెక్టరుగానూ, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర గిడ్డంగుల సంస్థ డైరెక్టరుగానూ వున్నారు.

ఆయన, 1960లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనమండలి సభ్యుడుగా ఎన్నికయ్యారు. 1968 నుంచి ఆయన జాతీయ లఘు పరిశ్రమల సంస్థ డైరెక్టరుగా వున్నారు.

## శ్రీమతి రోడామిస్త్రీ

శ్రీమతి రోడామిస్త్రీ, 1928 అక్టోబరు 15వ తేదీన సికింద్రాబాదులో జన్మించారు. పాఠశాలలో విద్యాభ్యాసం చేస్తున్న రోజుల నుండి సాంఘిక కార్యక్రమాలలో ఆసక్తితో పాల్గొన్నారు. భారత సాంఘిక సంక్షేమమండలి వ్యవహారాలతో సన్నిహిత సంబంధం కలిగి ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విభాగం మండలికి అధ్యక్షురాలుగా వ్యవహరించారు. అఖిల భారత సాంఘిక సంక్షేమమండలి ఉపాధ్యక్షురాలుగా కూడ ఉన్నారు. 1956లో రాష్ట్రప్రభుత్వం, వికలాంగుల నిమిత్తం ఆరామ్ ఘర్‌ను (అప్పటి బెతుల్ మాజూరిన్) ఐ.సి.ఎస్.డబ్ల్యు. పరం చేసినప్పుడు ఆ సంస్థ నిర్వహణను అభివృద్ధి చేయడానికి ఆమె తీవ్రంగా కృషిచేశారు. 1958 లో ప్రారంభించిన మహిళల ఉపాధికల్పన పథకాల నిర్వహణకు ఆమె అధ్యక్షురాలుగా ఉన్నారు.



శ్రీమతి రోడామిస్త్రీ 1958లో చైనాలోను, 1961లో అమెరికాలోను పర్యటించారు. మన దేశం నుండి జపాన్, స్వీడన్ దేశాలకు వెళ్లిన అంతర్జాతీయ ప్రతినిధివర్గాలలో ఆమె సభ్యురాలు. ఆమె అనేకసార్లు ఆసియా ఖండం, ఇంగ్లండు, దూర ప్రాచ్యం, రష్యా దేశాలలో పర్యటించి అక్కడ సంక్షేమ సంస్థల నిర్వహణను పరిశీలించారు. 1962 సం॥ సాధారణ ఎన్నికలలో ఆమె హైదరాబాదులోని జూబిలీహిల్స్ నియోజక వర్గంనుండి ఎన్నికైనారు. పి. సి. సి. ఎ. ఐ. సి. సి.లలో కూడా సభ్యురాలుగా వ్యవహరించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం సెనేటు, రెడ్‌క్రాస్ సొసైటీ ఆంధ్రప్రదేశ్ విభాగం కార్యనిర్వాహక వర్గం, భారత శిశు సంక్షేమ మండలి కార్య నిర్వాహక వర్గం, ఆరోగ్య సలహా సంఘాలలో సభ్యురాలుగా వ్యవహరించారు. ఆలోచన, ఆత్మ విశ్వాసం, చొరవ గల చైతన్యవంతమైన సాంఘిక సేవకురాలు శ్రీమతి రోడామిస్త్రీ, కేవలం నిరంతర స్వయం కృషివల్లా, కార్యదీక్షవల్లా ఆమె ప్రజాభిమానం చూరగొన్నారు.

3

## శ్రీ జి. సి. వెంకన్న



శ్రీ జి. సి. వెంకన్న అనంతపురం జిల్లా ఉరవకొండ వాస్తవ్యులు. ఆయన వయస్సు 56సంవత్సరాలు. 1935 వ సంవత్సరంలో ప్రజా రంగంలోనికి ప్రవేశించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో జైలుకు వెళ్ళారు. కొంతకాలం జిల్లా కిసాన్ కాంగ్రెసు అధ్యక్షుడుగా పనిచేశారు. 1951 లో ఆయన ప్రజా సోషలిస్టు పార్టీలో చేరి రాష్ట్ర శాఖ కార్యనిర్వాహక సంఘం సభ్యుడుగా ఎన్నిక అయ్యారు. కాని, 1962 సాధారణ ఎన్నికలకు పూర్వం ఆ పార్టీ సభ్యత్వానికి రాజీనామా చేసి, ఎన్నికలలో ఉరవకొండ నియోజక వర్గం నుండి ఇండిపెండెంటు అభ్యర్థిగా పోటీచేసి గెలుపొందారు. మంచి వక్త. ప్రతిపక్ష సభ్యుడుగా శాసనసభలో శ్రద్ధాసక్తులతో పాల్గొనేవారు. తరచు ప్రశ్నలు అడుగుతూ సభను చైతన్యవంతముగా చేయడంలో నేర్పరి.

శ్రీ వెంకన్న ఉరవకొండ గ్రామ పంచాయతీ, పంచాయతీ సమితుల అధ్యక్షుడుగా వున్నారు. ఉరవకొండలో హరిజన హాస్టలును స్థాపించారు. జిల్లా బోర్డు సభ్యుడుగా వున్నారు. 1967 సాధారణ ఎన్నికలలో ఉరవకొండ నియోజకవర్గంనుంచి కాంగ్రెసు అభ్యర్థిగా గెలిచారు.

## శ్రీ వి. పురుషోత్తమ రెడ్డి

శ్రీ వి. పురుషోత్తమ రెడ్డి నల్గొండ జిల్లా, రామన్నపేట తాలూకా అడగూడూరులో 1933 డిశంబరు 7 వ తేదీన జన్మించారు. సూర్యాపేటలో ప్రారంభవిద్య నభ్యసించిన తరువాత హైద్రాబాదులోని వివేకవర్ధనీ కళాశాలలో ఉన్నత విద్య పొందారు. ఆయన ఉస్మానియా విశ్వవిద్యాలయపు ఆర్ట్సు పట్టభద్రుడు.



అఖిల భారత జాతీయ విద్యార్థిసంఘాన్ని వ్యవస్థీక

రించడంలో శ్రీ పురుషోత్తమరెడ్డి ప్రధానపాత్ర నిర్వహించారు. 1946_48 సంవత్సరాల మధ్య ఆయన నిజాం పరిపాలనకు వ్యతిరేకంగా నేలమర్రిలో సరిహద్దు శిబిరాలను నిర్వహించారు.

ఆయన, 1968 లో శాసనసభా నియోజకవర్గం నుంచి రాష్ట్రశాసన మండలికి ఎన్నికయ్యారు. 1962_68 సంవత్సరాల మధ్య, రామన్నపేట తాలూకాలోని మోతుకూరు పంచాయతీ సమితి అధ్యక్షుడుగానూ, 1964_68 సంవత్సరాల మధ్య నల్గొండ జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడుగానూ పనిచేశారు. 1959_62 సంవత్సరాల మధ్య ఆయన ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ సభ్యుడుగానూ, ఆంధ్రప్రదేశ్ యువజన కాంగ్రెసు కార్యదర్శిగానూ వున్నారు.

## శ్రీ సి. రాజనరసింహ



శ్రీ సి. రాజనరసింహ, సికింద్రాబాదు రామగోపాలపేటలో 1932 జూన్ 18వ తేదీన జన్మించారు. ప్రారంభ విద్యానంతరం 1946 లో ప్రజాజీవితం లోనికి ప్రవేశించారు. 1962 సాధారణ ఎన్నికలలో సదాశివపేట శాసన సభా నియోజకవర్గం నుంచి పోటీ చేశారు. 1961_65లో ఆంధ్రప్రదేశ్ శాసన సభ కాంగ్రెసు పార్టీ కార్యవర్గ సభ్యులుగా ఎన్నికయ్యారు.

శ్రీ రాజనరసింహ, 1967 సాధారణ ఎన్నికలలో ఆందోల్ (రిజర్వుడు) శాసన సభా నియోజక వర్గం నుంచి గెలుపొందారు. ఆయన 1966లో సికింద్రాబాదు మునిసిపల్ కార్పొరేషను సభ్యుడుగా వున్నారు. మెదక్ జిల్లా కాంగ్రెస్ కమిటీ ఉపాధ్యక్షుడుగా కూడా పనిచేశారు. జిల్లా భారతీయ దళిత వర్గాల సమాఖ్య అధ్యక్షుడుగా వ్యవహరించారు. ఆయన ఏ. పి. సి. సి. కార్యనిర్వాహక సంఘం సభ్యుడు కూడా. తమ నియోజక వర్గంలోని జోగిపేటలో ఆర్ట్సు అండ్ సైన్స్ కళాశాల స్థాపనకు ఆయన తీవ్రంగా కృషి చేశారు.

## శ్రీ పి. అంకినీడు ప్రసాదరావు

శ్రీ పి. అంకినీడు ప్రసాదరావు గుంటూరుజిల్లా, బాపట్ల తాలూకాలోని నిడుబ్రోలులో 1929 ఫిబ్రవరి 25 తేదీన జన్మించారు. గుంటూరు ఏ.సి కళాశాల నుంచి పట్టభద్రులయ్యారు. 1942 లో ఉన్నత పాఠశాలలో విద్యాభ్యాసం చేస్తున్న రోజుల్లో "క్విట్ ఇండియా" ఉద్యమంలో పాల్గొనడం వల్ల అరెస్టు చేయబడినారు. 1960_62 సంవత్సరాల కాలంలో రెండు సంవత్సరాల పాటు బాపట్ల తాలుకా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడుగా వున్నారు. 1962_64 సంవత్సరాల కాలంలో గుంటూరు జిల్లా కాంగ్రెసు కమిటీ ఉపాధ్యక్షుడుగా పనిచేశారు. 1956 నుంచి 1960 వరకు నిడుబ్రోలులోని ప. బి. ఎస్. కళాశాల కమిటీ అధ్యక్షుడుగా వున్నారు. ఆయన పొన్నూరు పంచాయతీ సమితిఅధ్యక్షులుగాను, జిల్లా పంచాయతీల పరిషత్తు అధ్యక్షుడుగానూ పని చేశారు. 1968 లో జిల్లా సహకార మార్కెటింగ్ సంఘం అధ్యక్షుడుగా ఎన్నికయారు. 1954 నుంచి ఏ పి. సి. సి. సభ్యుడుగా వున్నారు.



శ్రీ ప్రసాదరావు, 1967 సాధారణ ఎన్నికలలో గుంటూరుజిల్లా పొన్నూరు నియోజక వర్గం నుంచి కాంగ్రెసు టికెట్టుపై ఒక కమ్యూనిస్టు (మార్కిస్టు) అగ్రనాయకునితో పోటీ చేసి మంచి మెజారిటీతో ఎన్నికైనారు

## శ్రీ ఎస్. ఆర్. ఎ. ఎస్. అప్పలనాయుడు



శ్రీ ఎస్. ఆర్. ఎ ఎస్. అప్పలనాయుడు విశాఖపట్నం జిల్లా పెందుర్తిలో 1925 నవంబరు 6వ తేదీన జన్మించారు. ఆయన డి సి. సి. సభ్యుడుగానూ పి సి సి. సభ్యుడుగాను వున్నారు. 1944_64 సంవత్సరాల మధ్య గ్రామ మునసబుగా పనిచేశారు. అవిభాజిత మద్రాసు రాష్ట్రంలో, 1946 లో శ్రీ టంగుటూరి ప్రకాశం ప్రవేశపెట్టిన ఫిర్కా అభివృద్ధి పథకం అమలులో శ్రీ అప్పలనాయుడు ప్రముఖంగా పాల్గొన్నారు 1964 నుంచి 3 సంవత్సరాలపాటు సర్‌పంచ్‌గా వ్యవహరించారు.

1967 సాధారణ ఎన్నికలలో ఆయన విశాఖపట్నం జిల్లా పరవాడ నియోజక వర్గం నుంచి ఎన్నికయ్యారు. ఈ నియోజక వర్గం నుంచి ఎన్నిక అయిన తొలికాంగ్రెసు అభ్యర్థి శ్రీ అప్పలనాయుడు. హరిజన సంక్షేమ విషయాలలో ఆయన చాలా శ్రద్ధ తీసుకున్నారు. పెందుర్తిలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని, ఉన్నత పాఠశాలను నెలకొల్పడంలో ఆయన ప్రధాన పాత్ర వహించారు. *



# 'హింసకు పూనుకోవడం అసాంఘిక చర్య'

**ఉ**ద్యోగ రక్షణలు కల్పించడం, తెలంగాణా మిగులు నిధులు ప్రకటించడం, తెలంగాణా ప్రాంతీయ సంఘం పటిష్టంగా పనిచేయడానికి వీలుగా దానికి కొన్ని అధికారాలను ఇవ్వడం—వీటికి సంబంధించిన అంశాలను ప్రభుత్వం శ్రద్ధగా పరిశీలిస్తున్నదని ఉప ముఖ్యమంత్రి శ్రీ జె. వి. నరసింగరావు జూలై 22 వ తేదీన ఆకాశవాణి ఇంటర్వ్యూలో వెల్లడించారు.

శ్రీ నరసింగరావుగారు మాట్లాడుతూ గత ఆరు నెలలుగా తెలంగాణాలో క్లిష్ట పరిస్థితులు ఏర్పడ్డాయని అన్నారు. తమ యిబ్బందులను గురించి తెలియజేసి, న్యాయసమ్మతంగా లభించ వలసిన వాటిని పొందడానికి ప్రయత్నించడం ప్రజాస్వామిక విధానం. కాగా హింసకు పూనుకొని ప్రభుత్వ ఆస్తులను, ప్రైవేటు ఆస్తులను ధ్వంసం చేయడం అసాంఘిక చర్య అవుతుంది. ఇట్టి కృత్యాలు అసలు లక్ష్యాన్నే వమ్ముచేస్తాయి. అన్నారు.

తెలంగాణాలో జరిగిన సంఘటనలవల్ల పన్ను చెల్లించే పౌరులు విపరీతమైన నష్టాలకు గురికావల్సివచ్చిందనీ, తెలంగాణా ఆర్థిక వ్యవస్థకు దెబ్బ తగిలిందనీ ఆయన అన్నారు. "వివేచనతో ప్రవర్తించినట్లయితే ఇప్పటికైనా ఈ ప్రాంతం కోలుకొని మళ్లీ అభ్యుదయ మార్గంలో పయనించగలదు. మామూలు పరిస్థితులను నెలకొల్పి, సుస్థిరం చేయడానికై నేను అందరి సహాయ సహకారాలను అభ్యర్థిస్తున్నాను" అన్నారు.

తమ సమ్మెను ఉపసంహరించుకొన్నందుకు తెలంగాణా ఎన్. జి. ఓలను శ్రీ నరసింగరావు అభినందించారు. వారు తిరిగి పనులకు హాజరుకావడం మామూలు పరిస్థితులు ఏర్పడడానికి, దారి తీస్తుందని ఆయన అన్నారు. గత ఆరు మాసాలుగా మూసి వున్న పాఠశాలలను, కళాశాలలను పునః ప్రారంభించాలని ఆయన అన్నారు. విద్యా సంస్థలు మూసివుండటంచేత విద్యార్థుల భవిష్యత్తుకు తీవ్రంగా దెబ్బ తగులుతుంది. కాబట్టి ఈ పరిస్థితుల వల్ల తల్లిదండ్రులుకానీ, ఉపాధ్యాయులు కానీ, లేదా విద్యార్థులుకానీ, సంతోషంగాలేరని ఆయన పేర్కొన్నారు. పని చేయకుండా జీతాలు తీసుకోవడం ద్వారా తాము పన్నులు చెల్లించేవారికి అన్యాయం చేసినవారైనట్లు కొంత మంది ఉపాధ్యాయులు తమతోఅన్నట్లు ఆయన చెప్పారు.

ఎన్. జి. ఓ. లు, ఇతర ఉద్యోగసులు, విద్యారులు మొదలైన వారి న్యాయ సమ్మతమైన కోర్కెలన్నిటినీ ప్రభుత్వం అత్యంత సానుభూతితో పరిశీలించగలదని హామీ యిస్తూ, త్వరలో విద్యా సంస్థలను తిరిగి తెరవడానికి తోడ్పడవలసిందిగా తత్సంబంధీకు లందరికీ శ్రీ నరసింగరావు విజ్ఞప్తి చేశారు.

అదే రోజున మంత్రులు సర్వశ్రీ జె. వెంగళరావు, ఎ. వాసుదేవరావు, వి. పురుషోత్తమ రెడ్డి, రేడియో ఇంటర్వ్యూలో మాట్లాడుతూ తాము గ్రామాలలో పర్యటించి ప్రజలకు ప్రస్తుత ఆందోళన ఫలితంగా తెలంగాణా ప్రాంతానికి జరుగుతున్న నష్టాన్ని గురించి వివరించి వారి మనస్సులను అభివృద్ధి కార్యక్రమాలవైపు మళ్లించడానికి ప్రయత్నిస్తామని తమ అభిమతాన్ని వ్యక్తం చేశారు.

శ్రీ వెంగళరావు ప్రసంగిస్తూ ఆంధ్రప్రదేశ్ సమైక్యతకు, సాధారణ పరిస్థితులు నెలకొల్పడానికి తాను తీవ్రంగా కృషి చేస్తానని అన్నారు, మంత్రులు జిల్లాలలోనూ గ్రామాలలోనూ పర్యటించి ప్రజలను కలిసి విద్యార్థులు తిరిగి పాఠశాలలకు వెళ్లేవిధంగా చేయాలి, ఆందోళనకు నాయకత్వం వహిస్తున్నవారిని కలిసి ఆందోళన కొనసాగించడంవల్ల తెలంగాణాకు మంచికన్నా చెడే ఎక్కువగా జరుగుతుందన్న విషయాన్ని తెలియజెప్పాలని ఆయన అన్నారు.

శ్రీ ఎ. వాసుదేవరావు ప్రసంగిస్తూ తెలంగాణాలో వివిధ విధాలుగా వ్యక్తమైన అసంతృప్తిని నివారించడంద్వారా శాంతియుత పరిస్థితులను పునరుద్ధరింపజేయడం తమ కర్తవ్యమని అన్నారు. తెలంగాణా సమస్యలను పరిష్కరించటంలో దాని అభివృద్ధికి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు సాధ్యమైన ప్రయత్నాలు చేస్తాయనీ ప్రజలు విశ్వసించే విధంగా చేయాలన్నారు

శ్రీ వి. పురుషోత్తమరెడ్డి ప్రసంగిసూ ప్రస్తుత పరిస్థితులలో మంత్రివర్గంలో చేరిన యువకులపై గురుతరమైన బాధ్యత ఉన్నదని శాంతియుత పరిస్థితులను నెల కొల్పడం, తెలంగాణా వెనుకబడిన తనాన్ని నిర్మూలించడమే యీ బాధ్యతలనీ ఆయన అన్నారు.

# రాష్ట్ర విభజన శ్రేయస్కరం కాదు

టి. లక్ష్మీకాంతమ్మ

"స్పాట్ లైట్" కార్యక్రమంలో జూన్ 13 వ తేదీన ఆకాశవాణి ఢిల్లీ కేంద్రం ప్రసారం చేసిన ఆంగ్ల ప్రసంగానికి స్వేచ్ఛాను వాదంలోని కొన్ని భాగాలు.

సమైక్య ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పురోగతితో భాషా ప్రయుక్త రాష్ట్రాల పునర్ విభజనకు అవకాశాలు అంతరిస్తాయి. ఇందుకు విరుద్ధంగా జరిగితే దేశ అనైక్యతకు బీజాలు నాటినట్టే! రాష్ట్రాలు పటిష్టంగా ఉంటే కేంద్రంకూడా దృఢంగా ఉండగలదు. చిన్న చిన్న బలహీనమైన రాష్ట్రాలు కేంద్రాన్నికూడా బలహీనం చేస్తాయి.

రాష్ట్రమే కనుక రెండుగా చీలిపోవడం సంభవిస్తే, అది ఇతర రాష్ట్రాలుకూడా రెండు మూడుగా విభజింపబడే అవకాశాన్ని కల్పిస్తుంది. విదర్భ, సౌరాష్ట్ర, పాతమైసూరు, మరి కొన్ని చిన్న రాష్ట్రాలు తలఎత్తగలవు.

తెలంగాణా సమస్యను పరిష్కరించడానికి పూనుకునే ముందు తప్పనిసరిగా యీ ముఖ్య విషయాలను గుర్తుంచుకోవలసిన అవసరం ఉంది.

## తెలంగాణాలో గణనీయమైన ప్రగతి

ఆంధ్రప్రదేశ్ అవతరణ తర్వాత గత పన్నెండు సంవత్సరాలలోనూ తెలంగాణా విషయంలో నిర్లక్ష్యం జరిగిందా? తరచుగా యీ ప్రశ్న వినవస్తుండడం, అనేక అతిశయోక్తులు చెప్పడం జరుగుతోంది. వెనుకబడ్డ ఏ ప్రాంతాన్నైనా అభివృద్ధిచేసినప్పుడు ఇంకా ఎంతో జరగవలసింది అనడం వేరు, కాని తెలంగాణా పూర్తిగా విస్మరించబడిందనీ, అలక్ష్యం చేయబడిందనీ అనడం మాత్రం సరికాదు. వాస్తవ విషయాలను మరుగుపరచి 'అలక్ష్యం' జరిగింది అనే అభిప్రాయాన్ని కలిగించడానికి ప్రయత్నించడం దురదృష్టకరం. ప్రతి అభివృద్ధి రంగంలోనూ నిజానికి తెలంగాణా ప్రాంతం గణనీయమైన ప్రగతిని సాధించింది. రాష్ట్రంలోని తీర ప్రాంతాలతో పోల్చిచూస్తే యీ ప్రాంతం ఇప్పటికీ వెనుకబడి ఉందన్న విషయంకూడా సత్యమే. కాని గత పన్నెండు సంవత్సరాలలోనూ యీ ప్రాంతం సాధించిన ప్రగతికి ఇది ఏమాత్రం అడ్డుకాదు. పెద్ద మనుష్యుల ఒప్పందాన్ని అమలు పరచడంలో నిజానికి కొన్ని లోపాలు జరిగినమాటకూడా నిజమే. కాని పరిస్థితిని అర్థం చేసుకుని తగిన సమయం యిస్తే యీ గడ్డు సమస్యను సరిదిద్దుకొనే అవకాశం ఉంది. ఈ లోపాల స్వభావంలో కాని, పరిధిలోకాని రాష్ట్ర విభజననే నివారణ చర్యగా కోరేటంతటి విశేషం నిజానికి లేదు. ఈ సమస్యకూ, దాని పరిష్కారానికి సూచించబడ్డ నివారణ చర్యకూ ఏమీ సంబంధం లేదు.

నేడు వినిపించే అసహన శీలమైన అభిప్రాయాలను మరిచిపోయి ఈ సమస్యపై పక్షపాతరహితంగా పరిశీలన జరగాలి.

రక్షణల ఉల్లంఘన గురించి ఎంతగానో చెప్పుకుంటున్నారు. 1956 ఒప్పందం ప్రకారం యీ రక్షణలు కేవలం అయిదు సంవత్సరాల వరకే అమలులో ఉండాలి కాని మరో అయిదు సంవత్సరాలకు దీనిని పొడిగించారు. మళ్ళీ మరొక 5 సంవత్సరాలు పొడిగించవలసిందిగా సిఫార్సు జరిగింది. ఈ రక్షణల్లో ప్రధానాంశం తెలంగాణా ప్రాంతంలో పదిహేను సంవత్సరాలపాటు ఉన్న వారికే సబార్డినేటు ఉద్యోగాలను కేటాయించడం. ప్రభుత్వోద్యోగాల (ముల్కీ) చట్టంఅనే పార్లమెంటు శాసనం ద్వారా యీ రక్షణ కల్పించారు. ఈ చట్టం చెల్లనేరదని సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పువల్ల దీనిని అమలు పరచటంలో క్లిష్ట పరిస్థితి ఏర్పడింది. ఇందుకు రాష్ట్ర ప్రభుత్వ బాధ్యత ఏమీలేదు సాధ్యమైనంతవరకు పరిస్థితిని మెరుగుపరచడానికి రాజ్యాంగం రీత్యా, శాసన రీత్యా అవసరమైన చర్యలు తీసుకునే ప్రయత్నం జరుగుతున్నది. తెలంగాణా ప్రాంతానికి రాష్ట్ర ప్రభుత్వం ఇటీవలనే రెండువేల ఉద్యోగాలను మంజూరు చేసింది

## ముఖ్యమంత్రికి అధిక సంఖ్యాబలం

నేటి పరిస్థితి ఏమిటంటే తెలంగాణా ఆందోళన ఉధృతంగా ఉన్నా, అనేకమంది తెలంగాణా శాసన సభ్యులు ప్రత్యేక రాష్ట్రానికి సుముఖంగా లేరు. కాంగ్రెసు లెజిస్లేచరు పార్టీలోనూ, సంస్థలోనూ ముఖ్యమంత్రికి అత్యధికమైన మెజారిటీ ఉంది. ముఖ్యమంత్రి సమైక్యతకూ, రాజకీయ సుస్థిరతకూ ప్రతీకగా నిలిచారు. ప్రజాస్వామిక పద్ధతుల్లో ఆయనను పదవీచ్యుతుని చేయడం అసంభవం కావడం వల్ల ఆయన వ్యతిరేకులు ఉద్యమాన్ని బజారుకు యీడ్చారు.

ఆయన వ్యతిరేకులు అశాంతిని రేకెత్తించి, హింసను ద్వేష భావాన్ని ప్రేరేపించే శక్తులను రంగంలోకి దింపి సమస్యను జటిల పరిచారు. ఇటువంటి సందర్భాల్లో కేంద్రం హింసాత్మక విధానాలకు తల ఒగ్గితే ప్రమాదకర పరిణామాలు ఏర్పడక తప్పదు.

## లోపాలు ఒప్పుకున్నందుకా ?

గత పన్నెండు సంవత్సరాలలో జరిగిన లోపాలకు అనేక కారణాలను పురస్కరించుకుని ప్రస్తుతపు ముఖ్య మంత్రిని బాధ్యునిగా చేయాలనడం దురదృష్టకరం. గతంలో ఆయనతోపాటు అధికారంలోవున్నవారే ఆయనపై ఆరోపణలు చేయడం నిజంగా శోచనీయం. ఈ విషయాన్ని లోతుగా పరిశీలిస్తే, లోపాలను ఉన్నవి ఉన్నట్టుగా ఒప్పుకోవడం, వాటిని సరిదిద్దే బాధ్యత తన పైన వేసుకోవడం ఒక్కటే ముఖ్యమంత్రి చేసిన "పాపంగా" ఎవరికైనా తెలుస్తుంది. మొదటిసారిగా ఆయన తెలంగాణా మిగులు నిధులను లెక్కకట్టించి ప్రకటించారు. లోపాలను అంగీకరించి నిజమైన గాంధీవాదిలా ఆయన ప్రవర్తించారు. తెలంగాణా అభివృద్ధికై అయిదేళ్ళలో ఆ మిగులు మొత్తాలను వెచ్చించడానికి ఆయన అంగీకరించారు. ఆయన చిత్తశుద్ధితో ఈ వాగ్దానంయిచ్చిన తర్వాతనే యీ సంవత్సరం జనవరిలో, చర్యలూ ప్రతిచర్యలూ ప్రారంభమై ప్రస్తుత పరిస్థితికి దోహదం చేశాయనే విషయం గమనార్హం. రక్షణలకోసం కొందరు విద్యార్థులు ప్రారంభించిన ఆందోళన కొందరు అసంతుష్టులైన రాజకీయ వాదుల చేతుల్లోపడి తీవ్రమైన వినాశకరమైన రాజకీయ నాటకంగా పరిణమించింది.

తెలుగు మాట్లాడే ప్రజలంతా ఎప్పుడూ ఒక్కటిగానే ఉన్నారు. వారి రాజకీయ కేంద్రం గోల్కొండలో వున్నా, వరంగల్‌లో వున్నా అందరూ ఒకటిగానే ఉండేవారు. నైజాం పాలనలో మాత్రమే వారు వారి సోదర ప్రజలతో సంబంధాలు కోల్పోయారు. ముందు చూపుతో ఆలోచించినట్లయితే రాష్ట్ర విభజన ఆత్మహత్యా సదృశం. బ్రహ్మాండమైన వనరులుకల యీ విశాల రాష్ట్రానికి అది గొడ్డలి పెట్టు.

## ఆంధ్రేతరుల సమర్థన

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు తెలంగాణా ప్రజల న్యాయసమ్మతమైన కోర్కెలను తీరుస్తామని వాగ్దానం చేశాయి. ఆ వాగ్దానాల ఫలితంగానే ప్రధానమంత్రి అష్ట సూత్ర ప్రణాళిక ప్రకటించారు. తెలంగాణా మిగులు నిధులను రాబోయే అయిదు సంవత్సరాల్లో ఖర్చు చేస్తామని వాగ్దానం జరిగింది. తెలంగాణా ప్రాంతీయ సంఘానికి చట్టబద్ధమైన అధికారాలిచ్చే అవకాశాలు కూడా ఉన్నవి. వీటికి తోడు అష్టసూత్ర ప్రణాళిక క్రింద ఏర్పడిన వివిధ సంఘాల కార్యక్రమాల వల్ల తెలంగాణా ప్రజల అపోహలు దూరమై ఆ ప్రాంతపు చరిత్రలో కొత్త అధ్యాయం ప్రారంభించబడుతుంది. దాదాపు వీటివల్ల స్వతంత్ర ప్రతిపత్తి కలిగినట్లే అవుతుంది. మనమంతా ఒక్క విషయం గుర్తుంచుకోవాలి. ఇతర భాషా వర్గాలకు చెందిన హైదరాబాదులోని ఆంధ్రేతరులు కొందరు తమకు విస్తృత రాష్ట్రాలు కావాలని కోరుతూ, ఆంధ్రప్రదేశ్‌లో మాత్రం విభజనను సమర్థిస్తున్నారు. దీనికి కారణం విశదమే.

తెలంగాణా యొక్క నిజమైన సమస్య వెనుకబడినతనమూ భూస్వామ్య వ్యవస్థ పాలననుంచి స్వతంత్ర ప్రతిపత్తికి జరుగుతున్న మార్పుదశలో ఉండడమూనూ. ఈ మార్పును త్వరపరిచే అవకాశం తెలంగాణాను కేవలం ఆంధ్ర ప్రాంతంలోనేకాదు, భారతదేశంలోని అన్ని ప్రాంతాలవారితోనూ సమైక్యం చేయడంలోనే ఉంది ఈ సంపూర్ణ సమైక్యతవలననే గత కాలపు భూస్వామ్యవర్గపు వేర్పాటు ధోరణి తొలగిపోయి తెలంగాణా మొత్తం దేశ పరిపాలనా వ్యవస్థలో సమాన భాగస్వామిగా సగర్వంగా ఉండగలదు.

## సదవగాహనకు సవాలు

సామాన్య ప్రజ సమిష్టి ఆదర్శాలు, ఏకైక సంస్కృతి సమైక్య భవితవ్యంపైనే ఆంధ్రప్రదేశ్‌వంటి పెద్దరాష్ట్రాలు నిర్మితమయ్యాయి. ఉద్యోగాలూ, ధనమూ ముఖ్యమే. పైగా వెనుకబడ్డ ప్రాంతంలో అవి మరీ ముఖ్యం. కాని, యీ ప్రాథమిక సత్యాలను తాత్కాలిక సమస్యలనుంచి విడమరచి చూడలేకపోతే ప్రజాశ్రేయస్సుకు భంగం కలుగడం తథ్యం. అందువల్ల ప్రస్తుత పరిస్థితులు మన సక్రమ ఆలోచనా విధానానికీ సదవగాహనకూ సవాలు వంటివి.

# సమైక్యతద్వారా పరిపూర్ణ వికాసం

# తెలంగాణా - సంపాదక వ్యాఖ్యలు

## టైమ్స్ ఆఫ్ ఇండియా

రాష్ట్ర కాంగ్రెసు శాసనసభా పార్టీ గత ఆదివారం హైదరాబాదులో తన నాయకత్వం మీద పూర్తి విశ్వాసం ప్రకటించినంత మాత్రంచేత తెలంగాణా సమస్యను పరిష్కరించడం చాలా సుకరమైందని ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డిగారు అనుకోవడానికి వీలేదని టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రిక జూలై 8 వ తేదీ సంపాదకీయంలో పేర్కొన్నది. పరిస్థితిని అదుపులోకి తేవడంలో బ్రహ్మానందరెడ్డిగారు చేస్తున్న ప్రయత్నాలు సఫలం కావాలని నిజంగా కాంగ్రెసు హైకమాండ్ ఆశిస్తున్నట్టయితే ముందుగా అది తిరుగుబాటు కాంగ్రెసు వారిమీద క్రమశిక్షణ తీసుకోవాలి. రాష్ట్ర శాసన సభ్యులలో అధిక సంఖ్యాకులు తీసుకున్న నిర్ణయాలను బాహాటంగా యీ విడిపోయిన కాంగ్రెసు నాయకులు అతిక్రమిస్తూవుంటే చూస్తూ వూరుకోవడం పార్టీ క్రమశిక్షణా రాహిత్యానికి తార్కాణం. ఇలాటి వారికి మంచిగా నచ్చజెప్పాలి. తెలంగాణా ప్రజల న్యాయమైన యిబ్బందులను తొలగించడానికి వీలయిన చర్యలన్నీ తీసుకోవడం జరుగుతుందని నచ్చజెప్పాలి. ప్రణాళిక, ఆర్థికాభివృద్ధి, ఉద్యోగాలు మొదలైన విషయాలలో తెలంగాణా ప్రాంతానికి మరింత అధికారాలను యివ్వాలని యిదివరకే ఆలోచనలు జరుగుతున్నాయి. వాటిని అమలు పరచడంలో ఏమాత్రం అశ్రద్ధ పనికిరాదు–అని ఆ పత్రిక పేర్కొన్నది.

తెలంగాణా అలజడిని గురించి ప్రస్తావిస్తూ "యీ ఆందోళన ఉపసంహరింప బడగానే కాంగ్రెసు పార్టీ నాయకత్వం తెలంగాణా వారికి సంక్రమింప జేయడంలో బ్రహ్మానందరెడ్డిగారిని ఒప్పించే పనికి కాంగ్రెసు హైకమాండ్ పూనుకుంటుంది. ఆంధ్ర ప్రదేశ్ సమైక్యతను పరిరక్షించ దలచుకున్నవారు ముందుగా అంతా కలిసి ఒక్కటిగా ఏర్పడి ప్రత్యేక తెలంగాణాకు వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని సమీకరించవలసి వుంది" అనికూడా ఆపత్రిక పేర్కొంది.

## ఫ్రీ ప్రెస్ జర్నల్

తెలంగాణా సమస్యమీద బ్రహ్మానందరెడ్డిగారి విధానం సరియైనదని నిరూపించబడింది. అందువల్లే ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ ఆయనమీద ఏకగ్రీవంగా విశ్వాసాన్ని ప్రకటించింది. రాజీనామాను గురించి గట్టిగా పట్టుపట్టవద్దని ఆయన్ను కోరింది. నిజమే. నాయకత్వంలో సమయానుకూలంగా మార్పు తేవడానికి– ముఖ్యంగా తెలంగాణా ప్రాంతం వ్యక్తికి ఆ నాయకత్వాన్ని అందించడానికి – పార్టీ సుకరమైన మార్గం వేసింది. అయితే శాంతియుత పరిస్థితులు పూర్తిగా నెలకొన్న తర్వాతనేగాని ముందుగా ఆ విధమైన నాయకత్వపు మార్పు జరగకూడదని భావించబడింది" అని ఫ్రీప్రెస్ జర్నల్ జూలై 8 వ తేదీ సంపాదకీయంలో పేర్కొంది.

ఈ సమస్య అనేక చిక్కులతో కూడివున్న విషయాన్ని ప్రస్తావిస్తూ యీ పత్రిక యింకా యిలా అన్నది– "తెలంగాణా సమస్య బహు క్లిష్టమైనది. దీనిలో యీ ప్రాంతంవారి న్యాయమైన యిబ్బందులకు చెందిన అంశాలున్నాయి. మతానికి చెందిన విషయాలున్నాయి. వ్యక్తి కక్షలూ, భారీ ఎత్తున దౌర్జన్య చర్యలూ వున్నాయి. రాష్ట్ర సమైక్యతను కోరే శాసన సభ్యులపై విపరీతమైన వత్తిడి వుంది. వీటన్నిటికీతోడు కాంగ్రెసు అధ్యక్షుడు చెప్పినట్టు స్వార్థపరులైన వ్యక్తులు యీ అలజడికి ఆర్థిక సహాయం చేస్తున్నారు. ఇన్నిటితో యీ సమస్య చిక్కుపడి వుంది." అని యీ పత్రిక అభిప్రాయపడింది.

## ఎకనామిక్ టైమ్స్

ఎకనామిక్ టైమ్స్ పత్రిక తన జూలై 8 వ తేదీ సంపాదకీయంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారి మీద కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీ విశ్వాసాన్ని ప్రకటించడాన్ని గూర్చి ప్రస్తావిస్తూ "రెడ్డిగారిపై కాంగ్రెసు లెజిస్లేచర్‌పార్టీ పూర్తి విశ్వాసాన్ని ఏకగ్రీవంగా ప్రకటించింది. తెలంగాణా ప్రాంతానికి చెందిన శాసన సభ్యులలో అధిక సంఖ్యాకులు కూడా వీరిని బలపరచడం మనం మర్చిపోగూడదు. దీనికి చాలా ప్రాముఖ్యం వుంది. తెలంగాణా ప్రాంతం శాసన సభ్యుల మీద విపరీతమైన వత్తిడి వున్నప్పటికీ వారు దానికి లొంగిపోక గట్టిగా నిలబడివున్నారంటే విశేషించి చెప్పుకోవలసిందే. రాష్ట్ర మంత్రి మండలిలో ఆ యా వర్గాలవారికి ప్రాతినిధ్యం యివ్వడానికి వీలుగా దానిని పునర్వ్యవస్థీకరించనున్నట్టు తెలుస్తున్నది. ఇందువల్ల ప్రత్యర్థులను ఎదుర్కొనే విధంగా పటిష్ఠం కావడానికి అవకాశం వుంటుంది" అని పేర్కొంది.

ఈ సందర్భంలో రాష్ట్ర నాయకుల భుజస్కంధాల మీదున్న గురుతరమైన బాధ్యతను గూర్చి ప్రస్తావిస్తూ యీ పత్రిక జాతీయ వ్యవస్థలో వెనుకబడిన రాష్ట్రాలు వహించవలసిన పాత్ర ఒక ప్రత్యేకతను కలిగివున్నదని పేర్కొంది. "వెనుక బడిన ప్రాంతం ప్రత్యేక రాష్ట్రంగా రూపొందాలని కోరుకోవడం అర్థంలేనిది. వెనుకబడిన ప్రాంతాన్ని అభివృద్ధి పరచవలసిన బాధ్యత మొత్తం దేశం అంతటిమీదా వుంది. అలాగే మొత్తం

దేశ ప్రయోజనాన్ని దృష్టిలో వుంచుకోవలసిన గురుతర బాధ్యత వెనుకబడిన ప్రాంతంమీద వుంది. విస్తృతమైన సమగ్ర దృష్టితో ఆలోచించకుండా, వేర్పాటు ధోరణివల్ల ఎన్ని అనర్థాలు తలఎత్తుతవో ఆలోచించకుండా తన దారి తాను మనగలగడానికి పూనుకోవడం కూడని పని అని" యీ పత్రిక పేర్కొంది.

## హిందూ

హిందూ పత్రిక జూలై 8 వ తేదీ సంపాదకీయంలో కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీ శ్రీ బ్రహ్మానందరెడ్డిగారిమీద విశ్వాసాన్ని పునరుద్ఘాటించడాన్ని గూర్చి ప్రస్తావిస్తూ, గడచిన పదమూడేళ్ళుగా తెలంగాణాను చిన్నచూపు చూడడం, అలక్షించడం వంటి నేరాలను ప్రస్తుత ముఖ్యమంత్రికి అంటగట్టడం సబబుకాదని పేర్కొంది. "బ్రహ్మానందరెడ్డిగారి ముందు ముఖ్యమంత్రులుగా వున్న వారి కాలాలనుండి యీ ధోరణి వస్తూనే వుండగా ఆయన హయాములో ఆ అసంతృప్తి ఆందోళన రూపం ధరించింది. ఆయన ఎన్ని హామీలు యిచ్చినా, ప్రత్యామ్నాయ చర్యలు సూచించినా ఆందోళన అంతరించలేదు. కాగా యీ ప్రస్తుత నిర్ణయం మాత్రం పరిస్థితిని చక్కబరచగలదన్న నమ్మకమేమిటి?" అని యీ పత్రిక ప్రశ్నించింది.

కాంగ్రెస్ హైకమాండ్‌పై, ఆంధ్రప్రదేశ్ శాసనసభ్యులపై రాష్ట్రంలో ప్రశాంత పరిస్థితులు నెలకొనేట్లు చూడవలసిన బాధ్యత వున్నది. అందుకు సముచితమైన చర్యలను తీసుకోవలసిన సమయమిది—అని ఆ పత్రిక అభిప్రాయపడింది.

## నేషనల్ హెరాల్డ్

నేషనల్ హెరాల్డ్ పత్రిక జూలై 8 వ తేదీ సంపాదకీయంలో, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ సమైక్య ఆంధ్రప్రదేశ్ యందే తమ విశ్వాసాన్ని ప్రకటించడాన్ని అభినందించింది. ప్రస్తుత భాషాప్రయుక్త రాష్ట్రాలను విడదీయరాదన్న కేంద్ర పార్లమెంటరీ బోర్డు నిర్ణయాన్నికూడా యీ పత్రిక హర్షించింది. "తెలంగాణాలోని అధిక సంఖ్యాక శాసనసభ్యులతో సహా ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ సమైక్య ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర లక్ష్యంలో విశ్వాసాన్ని పునరుద్ఘాటించింది. ప్రస్తుత భాషాప్రయుక్త రాష్ట్రాలను చీల్చరాదని కేంద్ర పార్లమెంటరీ బోర్డు నిర్ణయించడం శ్లాఘనీయము. ఒకవైపు ఆందోళన కొనసాగుతూ మరోవైపు ఆక్షేపణలూ, రాజీనామాలూ జరుగుతున్నప్పటికీ యీ నిర్ణయం తీసుకోవడం చాలా సముచితంగా వుంది. రాష్ట్రపతి పాలన ఏర్పాటు చేయాలనీ, ప్రజాభిప్రాయాన్ని సేకరించాలనీ కోరుతున్న యీ ఆందోళనను నడిపిస్తున్న నాయకులమీద యీ నిర్ణయ ప్రభావం బాగానే వుండొచ్చు. ఈ పార్టీ తీసుకున్న రెండో నిర్ణయం కూడా ఎంతో విజ్ఞతతో కూడినదే. శ్రీ బ్రహ్మానందరెడ్డి రాజీనామాను ఉపసంహరించుకోవాలని ఏకగ్రీవంగా కోరుతూ చేసిన తీర్మానంలోని నిజాయితీని శంకించిన వాళ్ళుకూడా కొందరున్నారు. అయితే యీ శంక అర్థంలేనిది. ఏకగ్రీవంగా ఆయనయందు విశ్వాసాన్ని ప్రకటించిన మాట కాదనే వారెవరూ వుండరు. ప్రస్తుత పరిస్థితుల్లో శ్రీ బ్రహ్మానందరెడ్డికి తగిన వారసులెవరూ వున్నట్లులేరు. ఆయనను దిగిపోవాలని కోరుతున్న వారిని సంతృప్తి పరచడానికై ఆయన త్యాగాన్ని ప్రదర్శించనవసరంలేదు. తెలంగాణలో శాంతి భద్రతలను నెలకొల్పాల్సిన బాధ్యత ఆయనమీద వున్నది. కేంద్రం మద్దతూ, రాష్ట్రంమద్దతూ ఆయనకు వుంది. అయితే నాయకత్వంలో మార్పు రావడం అభిలషణీయం. అదిన్నీ తెలంగాణా ప్రాంతంవారికి ఆ నాయకత్వం ఇవ్వడం సముచితం. యీ విషయంలో ఆంధ్ర ప్రాంతంలోని శాసన సభ్యులు ఈ నిర్ణయం తీసుకున్నందుకు వారిని అభినందించవలసి వుంది. దీనివల్ల పాత రక్షణ హామీలూ, కొత్తగా కల్పించే ఏ హామీలన్నా తెలంగాణాకు చెందిన నాయకుని చేతిలోనే వుంటాయనే నమ్మకం తెలంగాణా ప్రజలకు ఏర్పడుతుంది." అని యీ పత్రిక పేర్కొంది.

అసంతృప్తి, ఆశ, సాహసం మొదలైన కారణాలవల తలెత్తిన ఆందోళననుంచి వాస్తవమైన ఆర్థిక సమస్యలను' ఉద్యోగ సమస్యలను విడదీసి చూడడం తక్షణ కర్తవ్యమని యీ పత్రిక అభిప్రాయ పడింది. ప్రధాన మంత్రి ప్రతిపాదించిన అష్ట సూత్ర పథకాన్ని ఆచరణలో పెట్టడంలో ఏ మాత్రం జాప్యం వుండకూడదనీ, కేంద్ర నాయకులు ఎప్పటికప్పుడు హైదరాబాదుకు వెళ్ళడం వల్ల కూడా పరిస్థితిలో కొంత మెరుగుదల వుంటుందనీ ఆ పత్రిక సూచించింది. శాంతి భద్రతలను కూడా కట్టుదిట్టంగా అమలు జరపాలనీ, ప్రస్తుతం జైళ్ళలో నిర్బంధించబడిన నాయకులను విడిచిపెట్టడమా, లేక ఆందోళన సాగిస్తున్న ఇతర నాయకులను కూడా జైలులో వుంచడమా అనే విషయం రాష్ట్ర ప్రభుత్వమే నిశ్చయించుకోవాలని కూడా ఆ పత్రిక తన సంపాదకీయంలో వ్యక్తంచేసింది. "శాంతి భద్రతల పరిరక్షణను కట్టుదిట్టం చేసేటప్పుడు యీ ఆందోళనకు ఆర్థిక సహాయాన్నిస్తున్న ఫ్యూడల్ శక్తులనూ, పారిశ్రామికవేత్తలనూ ఏ మాత్రం విస్మరించరాదు. ప్రజలు వాస్తవ పరిస్థితులను అవగాహన చేసుకొని ఆందోళనను విరమించగలరని భావించి పార్టీలో ఏర్పడిన క్రమశిక్షణా రాహిత్యాన్ని చాలావరకు సహించడం జరిగింది. అయితే జాతీయ వ్యతిరేక కార్యకలాపాలు, పార్టీలో క్రమశిక్షణా రాహిత్యం తీవ్రస్థాయికి చేరుకున్నప్పుడు అట్టి శక్తులపై రాష్ట్ర కాంగ్రెసు క్రమశిక్షణా చర్యలను తీసుకోవడానికి కేంద్రనాయకులు ఏ మాత్రం అడ్డుపడకూడదు" అని యీ పత్రిక పేర్కొన్నది.

## స్టేట్స్‌మన్

జూలై 8 వ తేదీ సంపాదకీయంలో స్టేట్స్‌మన్ పత్రిక యీవిధంగా అభిప్రాయపడింది— "ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటును, అందుకు నాందిగా రాష్ట్రపతి పాలనను కోరుతున్న ప్రత్యేక రాష్ట్ర ఉద్యమ నాయకుల కోర్కెలను నిక్కచ్చిగా తిరస్కరించడం జరిగింది. శ్రీ బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి పదవినుంచి తప్పుకుని వుంటే తెలంగాణా ప్రాంతంవారికి ముఖ్యమంత్రి పదవి

లభించి వుండేది. అప్పుడు యీ ఉద్యమ నాయకులకు కనీసం కొంత తాత్కాలిక విజయమైనా లభించినదన్న సంతృప్తి మిగిలేది. పరిస్థితులు చక్కబడేవరకు శ్రీ బ్రహ్మానందరెడ్డిగారిని కొనసాగాలని కోరడం జరిగిందిగాని ఆ పరిస్థితులు చక్కబడడం అనేది యిప్పట్లో సాధ్యమయ్యేదిగా అగుపించడంలేదు. ఎందుకంటే తన మంత్రిమండలిని ఆయన పునర్వ్యవస్థీకరించాలని భావిస్తున్నట్టు చెప్పారు. అంటే ఇప్పట్లో తను తప్పుకునే సూచనలు లేనట్టు తెలుస్తున్నది.

"ఇప్పుడు ముఖ్యమంత్రిగారూ, కేంద్ర కాంగ్రెసు నాయకులూ, కేంద్ర ప్రభుత్వమూ చేయవలసిన పనేమిటంటే ముందుగా యీ ఆందోళనని పూర్తిగా అణచివేయాలి. దానితో పాటు తెలంగాణా ప్రజల హక్కుల పరిరక్షణకు మార్గాలను సూచించవలసినదిగా కోరుతూ ఏర్పాటుచేసిన కమిటీలు చేసిన సూచనలను పూర్తిగా అమలుజరపాలి." అని ఆ పత్రిక తన సంపాదకీయంలో సూచించింది.

## మెయిల్

జూలై 8 వ తేదీ సంపాదకీయంలో మెయిల్ పత్రిక, తెలంగాణాలో శాంతి భద్రతలు నెలకొనేందుకై తక్షణం ప్రణాళిక నొకదానిని చేపట్టాలని సూచించింది. తన సంపాదకీయంలో ఆ పత్రిక యింకా యిలా వ్రాసింది.

"ఆంధ్రప్రదేశ్ లెజిస్లేచర్ పార్టీ కాంగ్రెసు శ్రీ బ్రహ్మానందరెడ్డిగారిని రాజీనామాకై పట్టుబట్టకూడదనిన్నీ, ఆయనమీద తమకు విశ్వాసమున్నదనిన్నీ తెలియజేశాయి. తన పార్టీ విశ్వాసాన్ని ఆయన ఎప్పుడూ కోల్పోలేదనేది నిర్వివాదాంశం. అందులో ఏమాత్రం సందేహంలేదు. ఆయన ఇప్పుడు ముఖ్యమంత్రిగా కొనసాగడంలోకూడా ఏమాత్రం సందేహంలేదు. అయితే యిప్పుడు తెలంగాణాలో యథాతథంగా పరిస్థితులు కొనసాగడం మాత్రం చాలా అవసరం. ముందు ముందు తెలంగాణా ప్రాంతం వ్యక్తిని ముఖ్యమంత్రిగా చేయడానికికూడా కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీ ఉద్దేశిస్తున్నది. అయితే ప్రస్తుత పరిస్థితులనుబట్టి చూస్తే అందుకు కొంతకాలం పట్టేటట్టువుంది. ఈలోగా యిరువర్గాలమధ్య సుహృద్భావం నెలకొనడం మాత్రం చాలా అవసరం. ఏ ప్రణాళిక నన్నా ఆచరణలో పెట్టాలంటే ప్రశాంత సుహృద్భావ వాతావరణం నెలకొనాలి. అప్పుడే అర్థవంతమైన ప్రయోజనాత్మకమైన చర్చలకు అవకాశం వుంటుంది." అని ఈ పత్రిక తెలియజేసింది.

తెలంగాణాలో మామూలు పరిస్థితులు నెలకొనాలంటే విధ్వంసక ఆందోళనకు స్వస్తి జరగాలనీ, గత ఆరు నెలలుగా తెలంగాణాలో జరుగుతున్న పైశాచక కృత్యాలను ఏ ప్రభుత్వమూ సహించదనీ, అన్నిటికన్నా సిగ్గుపడాల్సిన విషయం తెలంగాణా వేర్పాటు దారులు ప్రదర్శించే నినాదాల కార్డుల్లో అంశాలనీ యీ పత్రిక పేర్కొన్నది. "విద్య స్తంభించిపోయింది. ప్రజల ఆస్తులను ధ్వంసంచేయడం జరిగింది. గూండాయిజం చెలరేగింది. తెలంగాణాలో ముఖ్యంగా నగరాల్లో నివసిస్తున్న ఆంధ్ర కుటుంబీకుల హృదయాలలో భయ విభ్రాంతుల్ని రేకెత్తించారు. వేలాది ఆంధ్ర కుటుంబాలు మరోచోటికి పోయి తలదాచుకోవలసి వచ్చింది. ఇటువంటి వాతావరణంలో యిరు ప్రాంతాలవారికీ అంగీకార యోగ్యమైన చర్చలు ఎలా జరగగలవు?" అని ఆ పత్రిక ప్రశ్నించింది.

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి జూన్ 4వ తేదీన హైదరాబాదు విచ్చేసినప్పుడు పత్రికల వారితో ప్రసంగిస్తున్న దృశ్యం

కేంద్ర హోంమంత్రి శ్రీ వై. బి. చవన్ జూన్ 7వ తేదీన హైదరాబాదుకు విచ్చేసినప్పటి చిత్రం

# బ్యాంకుల జాతీయకరణ

పధ్నాలుగు అగ్రశ్రేణి భారతీయ బ్యాంకులను కేంద్ర ప్రభుత్వం 1969 జూలై 19 న జాతీయం చేసింది. 1969 జూన్ మాసాంతానికి రూ. 50 కోట్లకు పైగా డిపాజిట్లు గల బ్యాంకులకు యిది వర్తిస్తుంది

'జాతీయ ప్రాధాన్యాలు, లక్ష్యాలకు అనుగుణంగా ఆర్థికవ్యవస్థను మెరుగు పరచడానికి' ఆర్డినెన్సు ద్వారా యీ చర్య తీసుకోవడం జరిగింది.

స్వాధీనం చేసుకోబడిన ప్రతి బ్యాంకిలోని వాటాదారులకు నష్టపరిహారాన్ని బ్యాంకి అప్పులు మినహాయించగా వచ్చిన నికర ఆస్థి విలువ ప్రాతి పదిక మీద చెల్లిస్తారు.

నష్ట పరిహారం చెల్లింపు విషయంలో ఏర్పడే వివాదాల విషయంలో పరిష్కర్తగా తీర్పు చెప్పడానికై ఒక ట్రిబ్యునల్‌ను కూడా ఏర్పాటు చేస్తారు.

ఆర్డినెన్సు అమలుకు ముందు ఏకాలానికైనా, మామూలు పరిస్థితుల్లో అయితే ఆర్డినెన్సు అమలు అనంతరం లాభాలు బదిలీ అయ్యే లేదా డివిడెండ్లు ప్రకటింపబడే ఏ విధమైన, లాభాలు లేదా ఏ డివిడెండ్ల చెల్లింపు విషయములోనూ ప్రత్యేక నష్ట పరిహారాన్ని చెల్లించడం జరుగదు.

విదేశ బ్యాంకుల తాలూకు భారతదేశపు బ్రాంచీలకూ, 1969 జూన్ మాసానికి 50 కోట్ల రూపాయిల కన్న తక్కువ డిపాజిట్లు గల భారతీయ వాణిజ్య బ్యాంకులకూ యీ ఆర్డినెన్సు ఉత్తరువు వర్తించదు.

జాతీయం చేయబడిన ప్రతి బ్యాంకు దాని దైనందిన కార్యకలాపాలు నిరంతరాయంగా కొనసాగడానికి వీలుగా ఈపథకంలో తగు శ్రద్ధ తీసుకోవడం జరిగింది. అందు వల్ల డిపాజిటర్లకు, పరపతి గ్రహీతలకు వారి వారి బ్యాంకులలో గల సంబంధాలు దెబ్బతిన కుండా వుంటాయి.

జాతీయం చేయబడిన ప్రతి బ్యాంకు వ్యక్తిత్వం చెడకుండా ఒక కొత్త సంస్థరూపంలో పరిరక్షించడం జరుగుతుంది. బ్యాంకులో వ్యాపారాన్ని వ్యవస్థను యీ సంస్థకు దాఖలు పరచడం జరుగుతుంది.

అలాంటి ప్రతి కొత్త సంస్థను కేంద్రప్రభుత్వం నియమించే వ్యక్తి నిర్వహిస్తారు. ఆ వ్యక్తిని ఆ సంస్థ కస్టోడియన్‌గా వ్యవహరిస్తారు. ఆయన కొత్త బ్యాంకుకు ప్రధాన నిర్వహణాధికారిగా వ్యవహరిస్తారు.

జాతీయం చేయబడిన ప్రతి బ్యాంకు అధ్యక్షుడే ఆ కొత్తబ్యాంకు కస్టోడియన్‌గా నియమించ బడుతాడు.

జాతీయం చేయబడిన బ్యాంకులడైరెక్టర్ల బోర్డును రద్దు చేస్తారు. అయితే ప్రతి ఒక్క బ్యాంకుకు ఒక సలహా సంఘాన్ని నియమించాలని ప్రభుత్వం సంకల్పించింది.

జాతీయం చేయబడిన బ్యాంకుల ఉద్యోగులు ప్రస్తుతపు వారి ఉద్యోగ షరతుల ప్రకారమే కొత్త సంస్థలో ఉద్యోగులు అవుతారు.

జాతీయంచేయబడిన 14 బ్యాంకుల డిపాజిట్లు అడ్వాన్సుల వివరాలు. 1968 సంవత్సరాంతానికి.

| | | కోట్ల రూపాయలలో | |
|---|---|---|---|
| | | డిపాజిట్లు | అడ్వాన్సులు |
| 1 | సెంట్రల్ బ్యాంక్ | 433.27 | 296.27 |
| 2 | బ్యాంక్ ఆఫ్ ఇండియా | 394.97 | 253.05 |
| 3 | పంజాబ్ నేషనల్ బ్యాంక్ | 355.96 | 209.40 |
| 4 | బ్యాంక్ ఆఫ్ బరోడా | 313.80 | 196.14 |
| 5 | యునైటెడ్ కమర్షియల్ బ్యాంక్ | 240.58 | 144.00 |
| 6 | కెనరా బ్యాంక్ | 146.44 | 96.72 |
| 7 | యునైటెడ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా | 143 89 | 99.61 |
| 8 | దీనా బ్యాంక్ | 121.88 | 74.08 |
| 9 | యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా | 115.22 | 68 63 |
| 10 | అలహాబాదు బ్యాంక్ | 112.72 | 69.93 |
| 11 | సిండికేట్ బ్యాంక్ | 112.19 | 70.61 |
| 12 | ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్ | 93.22 | 58.32 |
| 13 | ఇండియన్ బ్యాంక్ | 84.59 | 57.16 |
| 14 | బ్యాంక్ ఆఫ్ మహారాష్ట్ర | 73.02 | 49.74 |
| | మొత్తం. | 2,741.76 | 1743.66 |

ప్రభుత్వం జాతీయం చేసిన ఈ పధ్నాలుగు అగ్రశ్రేణి బ్యాంకుల డిపాజిట్లే భారతీయ వాణిజ్య బ్యాంకుల మొత్తం డిపాజిట్లలో 72 శాతం వుంటాయి. 1968 సంవత్సరానికి ఇచ్చిన అడ్వాన్సులు 65 శాతం వుంటాయి.

రిజర్వు బ్యాంకుల లెక్కలను బట్టి యీ వివరాలు తెలుస్తున్నాయి.

ఈ పధ్నాలుగు బ్యాంకులలో కూడా మొదటి అయిదు పెద్ద బ్యాంకులే ఎక్కువ మొత్తం డిపాజిట్లు చేశాయి. అడ్వాన్సులు యిచ్చాయి.

రిజర్వు బ్యాంకు లెక్కల ప్రకారం 1968 సంవత్సరాంతానికి ఈ 14 బ్యాంకుల స్వంత నిధులు రూ 66 కోట్లని తెలుస్తూన్నది. పైన పేర్కొన్న అయిదు అగ్రశ్రేణి బ్యాంకుల స్వంత నిధులు మొత్తం నిధులలో 64 శాతం వున్నాయి. సగటు నికరలాభంలో యీ అయిదు బ్యాంకుల భాగం 70 శాతం వుంది. *

# బ్యాంకుల జాతీయం

వావిలాల గోపాలకృష్ణయ్య

మూడవ పంచవర్ష ప్రణాళిక పార్లమెంటుకు సమర్పించుతూన్న సమయంలో పార్లమెంటు సభ్యులు "ప్రణాళికలు వేస్తున్నాం. కోటాను కోట్లువ్యయంచేస్తున్నాం. అయితే ఈ ప్రయోజనం అన్ని వర్గాలవారికి అందుతున్నదా లేక కొన్ని వర్గాలవద్ద ఆకట్టబడుతున్నదా సమీక్షించడం అవసరం" అన్నపుడు పండిత నెహ్రూ అందుపై మహలనోబిస్ కమిటీని నియమించారు. వారు పరిశీలన చేసి 80 కుటుంబాలవారూ 800 కోట్లకు పైగా ఆకట్టుకుంటున్నారని మరింక ఆకట్టుకోగలిగినవారు బ్యాంకుల అధిపతులని తేల్చి చెప్పారు.

అప్పటినుండి బ్యాంకులు జాతీయంచేయడం అవసరం అనే భావం దేశంలో వ్యాప్తం అయింది. ఆ భావం ప్రబలమైనందున దానిని అరికట్టలేని స్థితిరాగా, దానిని సామాజిక పట్టులోకి తెస్తామని ఒక శాసనం చేశారు. దానిని బట్టి ఇకనైనా వ్యవసాయాభివృద్ధికి బ్యాంకుల ధనం వినియోగం అయ్యేటట్టు చూస్తాం అన్నారు.

దేశపువ్యవస్థలో బ్యాంకులు చాల ప్రధాన పాత్రవహిస్తున్నవి. బ్యాంకులు పెట్టినవారు పెట్టిన పెట్టుబడికన్న అనేకరెట్ల ప్రజల డిపాజిట్టు ధనంపై పెత్తనం వహించి డిపాజిటరు ప్రయోజనం కన్నా బ్యాంకి పెద్దల ప్రయోజనం అధికంగా ఉపయోగించుకోవడం బ్యాంకుల ప్రధాన వ్యక్తుల చేతులలో నుండే వ్యవస్థలోవున్న కీలకం.

ఒకప్పుడు ఎవరిచిత్తం వచ్చినట్లువారు బ్యాంకులు పెట్టడం. ప్రజల ధనం డిపాజిటుగా రాగానే ఆదేసందుగా దివాలా తీయడం ఆర్‌బత్‌నాట్ కంపెనీ అను సామెత తెలుగు దేశంలో అందరికీ తెలిసిందే. తిరువాన్కూరు బ్యాంకు దివాలాతీసినపుడు అనేక కుటుంబాలు దిక్కులేకుండా దీనులైపోయాయి.

అందుకని కొంత పరిమితి పట్టావుంచాలని ప్రభుత్వం కొన్ని శాసనాలు, నిబంధనలు చేసింది. అయినా ముందున్న ఇంపీరియల్ బ్యాంకును జాతీయంచేసి స్టేటుబ్యాంక్ ఆఫ్ ఇండియాగా పరివర్తన చేసింది. అయితే దేశంలో అనేక బ్యాంకులు దినదినం పుట్టడం చివరకు గుత్తవ్యాపారుల చేతికి అందుబాటు ధనంగా వుండడం అనేక కంపెనీలు అనేక బ్యాంకులను చేజిక్కించుకొని భారత దేశం లోని ద్రవ్యచలామణిని, పరపతిని 60 శాతం గుప్పెటలో వుంచుకోవడం జరిగింది.

ఈబ్యాంకులు వ్యాపారులకూ, చట్టవ్యాపారులకూ గుత్త పెట్టుబడిదారులకూ అండదండలుగా వుండసాగినవి. భారత గ్రామీణ జీవితంలోనూ వ్యావసాయిక జీవితంలోనూ ఈ ధనం అందుబాటు లేకుండాపోయింది. వివిధ దేశాలనుండి వస్తున్న ఋణాలు తీసుకోవడం సులువుగానేవున్నదిగాని, దానిని తిరిగి యివ్వడంలో వచ్చే నష్టాలు దేశం అనుభవిస్తుంటే, ప్రయోజనాన్ని బ్యాంకులూ, వ్యాపారులూ అనుభవించాసాగారు. వ్యవసాయరంగంలో పరపతికి ఉపయోగ పడడమే లేకుండాపోయింది.

రిజర్వుబ్యాంకి, స్టేటు బ్యాంకులతోసహా మనదేశంలోవున్న బ్యాంకులు నాలుగు రకాలుగా భావించాలి. ఒకటి_విదేశీ బ్యాంకులు రెండు_షెడ్యూలుబ్యాంకులు, మూడు_షెడ్యూలువ్యాపార బ్యాంకులు, నాలుగు_ సహకారబ్యాంకులు. ఈబ్యాంకుల ద్వారా దేశంలో ధనం చేతులు మారడం వ్యాపారానికి ఇతరపనులకూ పెట్టుబడులు పెట్టడం జరుగుతున్నది. ఈ విధంగా జరిగేలావాదేవీలలో ఒక్కొక్క రకం బ్యాంకుల పరిస్థితులు 1969 మే నెల రిజర్వుబ్యాంకి బులిటెన్‌లో ఈ విధంగా వివరించారు. ఇవి 1969 ఏప్రిల్ 25వ తేదీన ఉన్న అంకెలు. (మే నెల బులిటిన్ జూలై 11వ తేదీన మనకందింది).

### అన్ని బ్యాంకుల వివరాలు

| తరగతి | బ్యాంకులసంఖ్య | | డిపాజిటు (కోట్ల రూ.లలో) | |
|---|---|---|---|---|
| | 1966 | 1969 | 1966_67 | 25_4_69 |
| షెడ్యూల్డు బ్యాంకులు | 87 | 87 | 3489 | 4511 |
| షెడ్యూల్డు వ్యాపార బ్యాంకులు | 89 | 73 | 1746 | 4220 |
| ఇండియన్ షెడ్యూల్డు వ్యాపార బ్యాంకులు | 74 | 58 | 1528 | 3962 |
| విదేశీ బ్యాంకులు | 15 | 15 | 217 | 458 |
| కోఆపరేటివ్ బ్యాంకులు | 20 | 24 | 34 | 108 |
| నాన్ షెడ్యూల్డు వ్యాపార బ్యాంకులు | 256 | 17 | 42 | 27 |

ఇందులో షెడ్యూల్డు వ్యాపార బ్యాంకులు అర్వాన్సుగా యిచ్చిన అప్పులు 1967 జనవరిలో 2759 కోట్లు. జనవరి 1968లో రూ 2759కోట్లు. అది 1969 జనవరిలో రూ3129 కోట్లు అయితే ప్రధానంగా గుర్తించ వలసింది. ఈఅప్పులు ఏ పనులకిస్తున్నారో వాటి హామీలు గమనించండి.

అప్పుల వివరాలు (కోట్లరూపాయలు)

| వివరాలు | 1967 | 1968 | 1969 |
|---|---|---|---|
| ఆహార పదార్థాలు | 146 | 176 | 222 |
| పరిశ్రమల ముడిపదార్థాలు | 188 | 165 | 200 |
| టీ, కాఫీ తోటలకు | 68 | 84 | 106 |
| జవుళి, గనులు | 1189 | 1186 | 1001 |
| ఇతర హామీలు | 723 | 779 | 866 |
| హామీలు లేనివి | 374 | 363 | 424 |
| మొత్తం | 2502 | 2759 | 3129 |

ఇందులో వ్యవసాయాభివృద్ధికిచ్చింది కనపించదు. ఈ సంవత్సరం ఈమధ్య సోషల్ కంట్రోలు చేశామన్న తర్వాత ఇప్పుడిప్పుడే ఆఅపవాదు బాపుకోవటానికిగాను అక్కడక్కడ బ్యాంకులు వ్యవసాయకులకు అప్పులు ఇవ్వడం ప్రారంభించాయి. ఇచ్చిందాని కన్న లక్షరెట్లు ప్రచారంసాగించాయి.

1967 మార్చి నెలవరకు ఆయా బ్యాంకులు వివిధ వర్గాలకు పనులకు యిచ్చిన అడ్వాన్సు ఋణాలు పరిశీలన చేస్తూ 1968 డిసెంబరు నెల రిజర్వు బ్యాంకు బులిటెన్‌లో కొన్ని వివరాలు యిచ్చారు. అంతకన్న మనకు అద్యతన కాలంలో అంకెలు లభించడం అసాధ్యంకదా. 1969,68,67 సంవత్సరాలలో అప్పులు యివ్వడం బ్యాంకులు యే విధంగా యిచ్చినవో యే రకమగు హామీలపై యిచ్చినవో పైన వివరించాను కదా.

1967, 1966, 1965 సంవత్సరాలలోని వివరాలు పరిశీలన చేశారు. ఈ పరిశీలనలో ఈ ఋణాలు కొన్ని వర్గాలుగా విభజన చేశారు. అవి 1. పరిశ్రమలు 2. వ్యాపారం 3. ద్రవ్యసంస్థలు 4. వ్యవసాయం 5. వ్యక్తిగతం 6. ప్రభుత్వం 7. ఇతర విధాలు. ఈ విధంగా యిచ్చిన అప్పులు ఏవిధంగా ఉపయోగ పడుచున్నవో ఉదహరణగా 1951, 1956, 1961, 1967 సంవత్సరాల వివరాలు గమనించితే ఈ క్రింది విధంగా వుంటున్నవి.

## అప్పుల వివరాలు

(కోట్ల రూపాయలు)

| వర్గం | 1951 | 1956 | 1961 | 1967 |
|---|---|---|---|---|
| పరిశ్రమలు | 198 | 285 | 663 | 1748 |
| వ్యాపారం | 210 | 281 | 373 | 526 |
| ద్రవ్యసంస్థలు | 74 | 71 | 67 | 96 |
| వృత్తులు | 39 | 51 | 87 | 114 |
| వ్యవసాయం | 12 | 15 | 40 | 56 |
| ప్రభుత్వం | — | — | — | 13 |
| ఇతరం | 49 | 64 | 73 | 161 |
| మొత్తం | 584 | 770 | 1306 | 2717 |

అప్పులుగా ఇచ్చిన ధనం చూచినపుడు తేడా కన్పించనే కనిపించుచున్నది. వ్యవసాయం అసలు గమనంలోనే లేదని, భారతదేశంలోని బ్యాంకింగు విధానం ఇతరత్రా ఉపయోగపడిందే గాని వ్యవసాయరంగంలో ఏమాత్రం ఉపయోగపడలేదని తేలిపోతున్నది.

ఈ అప్పు దామాషా ధనరూపంలో కాకుండా శాతాలల్లో అయితే మరింత కొట్టవచ్చినట్లు నగుపడగలదు. ఆ వివరాలు వరసగా వ్రాసేదానికన్నా అంకెలలో చూపడం ఉపయోగం కాగలదని ఈ క్రింద వివరిస్తున్నాను.

## అప్పుల శాతం

| వర్గం | 1951 | 1956 | 1961 | 1967 |
|---|---|---|---|---|
| పరిశ్రమలు | 34.0 | 37.1 | 50.8 | 64.3 |
| వ్యాపారం | 36.0 | 36.5 | 28.6 | 19.4 |
| ద్రవ్యసంస్థలు | 12.7 | 9.3 | 5.1 | 3.6 |
| వృత్తులు | 6.8 | 6.6 | 6.7 | 4.2 |
| వ్యవసాయం | 2.1 | 2.0 | 3.1 | 2.1 |
| ప్రభుత్వం | — | — | — | 0.5 |
| ఇతరం | 8.4 | 8.4 | 5.6 | 5.9 |
| మొత్తం | 100.0 | 100.0 | 100.0 | 100.0 |

ఈ వివరాలు గమనించితే రెండు మూడు ప్రణాళికల్లో బ్యాంకుల వల్ల ప్రయోజనం వ్యాపారానికి లభించింది. దాని వాటా వరవతి 12 నుండి 17 శాతంకు పోయింది. ఇదే సమయంలో పరిశ్రమలకు రెండు, మూడు ప్రణాళికలలో వరుసగా 71,78 శాతంలో లభించింది. ద్రవ్యసంస్థలకు 1951 లో 13 శాతం వున్నది. 1967 లో 4 శాతం కావడంతో తగ్గింది. (టీ, కాఫీ) తోటలతో సహా వ్యవసాయానికి రెండు నుండి మూడు శాతాల మధ్యనే వుండిపోయింది. ఇందులో టీ, కాఫీ తోటలకు యిచ్చిన అప్పులు మినహాయించితే అసలు వ్యవసాయానికి అర (0.5) శాతం కన్నా లభించలేదు. వ్యక్తులకిచ్చిన అప్పులు కూడా 1951 లో 7 శాతం వున్నది. 1967 కు నాలుగు శాతానికి దిగింది. ప్రభుత్వ సంస్థలు, స్థానిక సంస్థలుసహా పొందిన అప్పులు 1967 లో మాత్రమే అనుకోండి. అయినా అవి అరశాతం (0.5) కన్నా లేదు. ఈ విధంగా మొదటి, రెండు ప్రణాళికలలో సమాజంలోని వర్గాల విషయం అటుండగా ఉత్పత్తి వర్గాలలో కూడా నూటికి 90 వంతులుగా వున్న వ్యవసాయభివృద్ధికి అర (0.5) శాతం ఉపయోగ పడింది. మరి పారిశ్రామికాభివృద్ధికి 71 నుండి 78 శాతం వరకు చెందింది. ఈ పారిశ్రామికాభివృద్ధి కూడా నాలుగు అయిదు పట్టణాలలో కేంద్రీకృతం అయింది. అయిదారు కుటుంబాలకు చెందిపోయింది. అందుకే మహలనోబిస్ కమీషనువల్ల

యదార్థం తేలలేదన్నప్పుడు, గుత్త వ్యాపార పరిశీలన సంఘాన్ని నియమించితే యే పదిమందో భారత సంపదను అటు పరిశ్రమల పేర, చట్టవ్యాపారంపేర, జీవిత భీమా కంపెనీలపేర, బ్యాంకుల పేర, పత్రికలపేర అన్నీ తమ గుప్పెట్లలో పెట్టుకొని వ్యాపారాలు సాగించారని తేలింది. లోతుకువెళ్ళితే ప్రజల డిపాజట్టైన ఆ ధనం వారికి ఉపయోగపడినదని, – దేశపు అభివృద్ధికి ప్రణాళికా నిర్వహణకు విదేశాలలో ఋణాలు తేవడం, దేశంలో ఋణాలు తేవడం, విదేశాల దయకు రూపాయి విలువ తగ్గించుకోవడం ఆ విధంగా మరి మూడోవంతు అప్పు భారం వేసుకోవడం, నాల్గవ ప్రణాళిక నాటికి ఆర్థిక వ్యవస్థ, ద్రవ్యవ్యవస్థ అస్తవ్యస్తమై రాజకీయ జీవితం అయోమయం అయిపోవడం జరిగింది.

నాల్గవ ప్రణాళిక ప్రారంభకాలంలో బ్యాంకుల జాతీయం చేయడం భారతదేశ ప్రణాళికలకు ద్రవ్యవనరులు దేశంలోనివి ఉపయోగించుకోవటానికి ఎంతో సహాయకారి అవుతుంది. అందుచే ఈ నాడు ప్రధాని ఇందిరాగాంధి అన్ని బ్యాంకులను జాతీయం చేయవలసింది. చేయకపోయినా కనీసం ఈ 14 బ్యాంకులను జాతీయం చేయడంలో న్యాయం, అవసరం యెంతైనావుంది

ఈ నాడు జాతీయంచేసిన 14 బ్యాంకులలో డిపాజిట్లు భారత దేశంలో అన్ని బ్యాంకులలో వున్న డిపాజిటులలో 1968 ఆఖరుకు 72 శాతం డిపాజిట్లున్నవి. ఇండియాలోని షెడ్యూల్టు బ్యాంకుల లోని డిపాజిట్లలో 65 శాతం వున్నవి. ఈ 14 బ్యాంకులలో 1968 ఆఖరువున్న డిపాజిటు ధనం మొత్తం రూ. 2741 కోట్లుంది. ఇతర అడ్వాన్సుల బాపతు 1743 కోట్లుంది. ఈ 14 బ్యాంకులలోనూ పై తరగతికి చెందిన అయిదు బ్యాంకులు–సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా, బ్యాంకు ఆఫ్ ఇండియా, పంజాబునేషనల్ బ్యాంకు, బ్యాంకు ఆఫ్ బరోడా, యునైటెడ్ కమర్షియల్ బ్యాంకు అధీనంలో 64 శాతం వున్నవి. 1968 ఆఖరుకు ఈ 14 బ్యాంకుల్లో ఈబ్యాంకులు ఆర్జించిన స్వంతంగావున్న ధనం 66 కోట్లు మాత్రమే. అంటే 66 కోట్ల స్వంత ధనంతో పరుల 2741 కోట్ల ధనంపై పెత్తనం చలాయించడమేగాక 2741 కోట్ల పైకంతో భారత ఆర్థిక రాజకీయ జీవితాన్ని తమగుప్పెటలో పెట్టుకొని ఆడుతున్నారు వీటిని జాతీయం చేయడానికి యింతకన్నా అదను వేరే ఎక్కడవుంది. ప్రధాని ఇందిర అభినందనీయురాలు.



## పోచంపాడు ప్రాజెక్టుకు ఇతోధిక ప్రాముఖ్యం

తెలంగాణా అభివృద్ధికై ఏర్పరచబడిన ఉన్నతాధికార సంఘం జూన్ 26వ తేదీన హైద్రాబాద్‌లో తొలిసారిగా సమావేశమై పోచంపాడు ప్రాజెక్టు నిర్మాణ కార్యక్రమానికి అత్యధిక ప్రాముఖ్యాన్ని యివ్వాలనీ, వచ్చే సంవత్సరం 40 వేల ఎకరాలు సాగయ్యేట్టుగా యీ ప్రాజెక్టుపనిని కొనసాగించాలనీ నిర్ణయించింది. ప్రధానమంత్రి నిర్వచించిన అష్ట సూత్ర పథకాన్ని అనుసరించి యీ సంఘాన్ని ఏర్పాటుచేయడం జరిగింది. రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి యీ సమావేశానికి అధ్యక్షత వహించారు. ప్రణాళికాసంఘసభ్యుడు శ్రీ ఆర్. వెంకట్రామన్, తెలంగాణా మంత్రులు, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఎం టి. రాజు, ప్రభుత్వంలోని యితర కార్యదర్శులు ఈ సమావేశానికి హాజరయ్యారు.

1969_70 లో తెలంగాణా వార్షిక ప్రణాళికను యీ సంఘం పరిశీలించింది. ఈ ఏడాది ఆంధ్రప్రదేశ్‌కు రు. 87.42 కోట్లు కేటాయించబడినవి. ఇందులో తెలంగాణా ప్రత్యేక అభివృద్ధి పథకాలకు కేటాయించిన రు. 9 కోట్లుకూడా చేరివుంది. తెలంగాణా ప్రాంతానికి ఉద్దేశించినది రూ. 39కోట్లు. ఈమొత్తంలో ప్రత్యేకాభివృద్ధి పథకాలకై కేటాయించిన రూ. 9 కోట్లుకూడా చేరివుంది. హైద్రాబాద్ మున్సిపల్ కార్పొరేషన్‌కు కేటాయించిన రూ. 40 లక్షలుకూడా యీ ప్రత్యేక కేటాయింపులో చేరివున్నాయి.

ఈ సంఘం వ్యవసాయ పారిశ్రామిక సంస్థ, భూమితనఖా బ్యాంకు మున్నగు సంస్థల కార్యకలాపాలనుకూడా పరిశీలించింది. తెలంగాణా ప్రాంతం అవసరాలనుకూడా యీ సంస్థలు గుర్తించి ప్రవర్తించేందుకై వాటినికూడా పై సమావేశంలో పరిశీలించడం జరిగింది.

తెలంగాణాలో నీటి పారుదల, భూగర్భ జలాలు, గ్రామీణ విద్యుదీకరణ, పరపతి, భూసార పరిరక్షణ, కమ్యూనికేషన్లపట్ల ప్రత్యేక శ్రద్ధ అవసరమని వీరు గుర్తించారు. తెలంగాణా మిగుళ్ళనుండి కేటాయించే మొత్తాలలో వీటికి ప్రాముఖ్య మివ్వాలన్నారు.

## తెలంగాణా ప్రత్యేకాభివృద్ధి ఆవశ్యకత

ప్రణాళికా ఖర్చులో కోత మూలకంగా రూ. 50 కోట్లకు పైగా ఖర్చు పెట్టకపోవడంవల్ల నేడు చిక్కులేర్పడ్డాయని ముఖ్యమంత్రి తెలియజేశారు. ఆర్థిక కార్యక్రమాలను ఉధృతంగా సాగించాలనీ, చతుర్థ ప్రణాళిక మొదటి రెండేళ్ళలో రాష్ట్రానికి కేంద్ర సహాయం ఎక్కువచేయాలనీ ముఖ్యమంత్రి అన్నారు.

చతుర్థ ప్రణాళికలో మొదటి ఏడాది పెట్టుబడి రూ. 87.42 కోట్లకు తగ్గరాదని ముఖ్యమంత్రి వ్యక్తంచేశారు. ఇందులో తెలంగాణాకు రూ. 35.14 కోట్లు వుంటుంది. పోచంపాడు, మంజీరా నీటి సరఫరా పథకాలకు కట్టుబడి వున్నందున యీ మొత్తాన్ని రూ. 39 కోట్లకు పెంచవలసి వచ్చిందని ముఖ్యమంత్రి తెలియజేశారు.

తెలంగాణాకు మాట యిచ్చినవాటి నన్నిటినీ రాష్ట్ర ప్రభుత్వం అమలుజరపడానికై కేంద్ర ప్రభుత్వం ప్రత్యేక సహాయాన్ని భారీయెత్తున యివ్వగలదన్న ఆశాభావాన్ని ముఖ్యమంత్రి వ్యక్తంచేశారు.

## సవరించిన వేతనాలు

ఆంధ్ర ప్రదేశ్ మంత్రివర్గం 1969 జూన్ 12 వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి అధ్యక్షతన సమావేశమై రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగుల, స్థానిక సంస్థల ఉద్యోగుల వేతనాలను సవరించిన స్కేళ్ళను మంజూరుచేసింది. ప్రభుత్వం మంజూరుచేసిన యీ కొత్త వేతనాలవల్ల ప్రభుత్వానికి సాలీనా రూ. 5.5 కోట్లు అదనంగా వ్యయమవుతుంది. ఈ సవరణవల్ల 2 లక్షల 50 వేల మంది ఉద్యోగులకు లాభం చేకూరుతుంది. ఈ సవరించిన స్కేళ్ళు తెలుగు నూతన సంవత్సరాది అయిన 1969 మార్చి 19 వ తేదీనుంచి అమలులోకి వస్తాయి.

వివిధ తరగతులకు చెందిన ప్రభుత్వోద్యోగులు, స్థానిక సంస్థల ఉద్యోగుల వేతనాల స్కేళ్ళు, కరువుభత్యం సవరణకు సంబంధించి 1956 లో నియమించబడిన ఏకసభ్య వేతన కమిషను (న్యాయమూర్తి శ్రీ ఎన్. డి. కృష్ణారావు) 1967 ఆఖరులో సమర్పించిన నివేదికలో చేసిన సిఫార్సులను పరిశీలించడానికై శ్రీ ఎం. టి. రాజు అధ్యక్షతన అధికారుల కమిటీ ఒకదానిని నియమించడం జరిగింది. ఈ కమిటీ ప్రతిపాదనల ప్రాతిపదికపై ప్రభుత్వం యీ వేతనాలను సవరించింది.

## వేతన సంఘం సిఫార్సులకంటే హెచ్చు వేతనాలు

వేతన సంఘం ప్రతిపాదించిన స్కేళ్ళకన్న ప్రభుత్వం మంజూరుచేసిన స్కేళ్లు మెరుగావున్నాయి. సామర్థ్యానికి సంబంధించిన ఎఫిషియన్సీబార్‌ను ప్రవేశపెట్టాలన్న వేతన సంఘం సిఫారసులను మంత్రిమండలి ఆమోదించలేదు. అయితే సామర్థ్యాన్ని ప్రోత్సహించే చర్యగా రూ. 700_1,000 సవరించిన స్కేలుతోసహా ఆ స్కేలు వరకు గల ప్రతి తరగతిలోనూ సెలెక్షన్ గ్రేడు ఉద్యోగాలను మంత్రిమండలి మంజూరుచేసింది. (ఆ తరగతిలోని మొత్తం ఉద్యోగాలలో 15 శాతం సెలెక్షన్ గ్రేడువి వుంటాయి).

## ఇంటి అద్దె భత్యం

ప్రస్తుతపు కంపెన్సేటరీ అలవెన్సుకు బదులు నెలకు రూ. 320 వరకు వేతనం పొందుతున్న ఉద్యోగులకు కేంద్ర ప్రభుత్వ రేట్ల మేరకు ఇంటి అద్దె భత్యాన్ని మంజూరు చేయడం జరిగింది. $66\frac{2}{3}$ నుంచి 100 శాతం వరకు వున్న కేంద్ర ప్రభుత్వ రేట్ల మేరకు కరువుభత్యంలో కొంత భాగాన్ని పించను గ్రాట్యుయిటీల నిమిత్తం కరువు వేతనంగా పరిగణించడం జరుగుతుంది. ఈ సవరణ 1969 ఏప్రిల్ 1వ తేదీనుంచి అమలులోకి వస్తుంది. ప్రస్తుతపు దినభత్యం రేట్లు, నిర్ణీత ప్రయాణభత్యం రేట్లు $33\frac{1}{3}$ శాతం పెంచబడినవి.

## ఒక ఇంక్రిమెంటు

ఉద్యోగుల వేతనం, ప్రస్తుత స్కేలులోని వేతనంతర్వాత పై దశలో సవరించిన స్కేలులో నిర్ణయించడం జరుగుతుంది. ప్రస్తుత గ్రేడులో 5 ఏళ్ళుగాని అంతకుమించిన సర్వీసుగాని వున్నప్పుడు ఒక యింక్రిమెంటు వెయిటేజిచేర్చడం జరుగుతుంది.

ప్రస్తుతంవున్న 142 రకాల స్కేళ్ళను వేతనసంఘం సిఫార్సుమేరకు 26 స్కేళ్ళకు తగ్గించి వర్గీకరించబడినవి.

## కొన్ని ముఖ్యాంశాలు

సవరించిన వేతనాల స్కేళ్ళలో కొన్ని ముఖ్యాంశాలు :

* ప్యూన్లు ప్రస్తుతం రూ. 50_1_59_2_65 స్కేలులో వున్నారు. ఈ స్కేలు రూ. 50_1_59_ఇ_బి_2_75 కు సవరించాలని వేతనసంఘం సిఫార్సుచేయగా ప్రభుత్వం మరింత ఉదారంగా 60_2_80_3_95 కు పెంచింది.

* లోయర్ డివిజన్ క్లర్కులు ప్రస్తుతం 80_4_100_5_150. స్కేలులో వున్నారు. ఈ స్కేలును 80_4_120_ఇబి_6_150 కి సవరించాలని వేతనసంఘం సిఫారసు చేయగా ప్రభుత్వం 90_4_130_6_160 కి పెంచింది.

* అప్పర్ డివిజన్ క్లర్కులు ప్రస్తుతం రూ. 125_5_155_$7\frac{1}{2}$_200 స్కేలులో వున్నారు. ఈ స్కేలును రూ. 125_8_205_ఇబి_9_250 కు పెంచాలని వేతనసంఘం సిఫారసు చేయగా ప్రభుత్వం రూ. 140_9_230_10_280 కి పెంచింది.

* డిప్యూటీతహసిల్దారు ప్రస్తుతం 220_10_320స్కేలులో వున్నారు. ఈ స్కేలును రూ. 225_14_365_17_450 కు పెంచాలని వేతనసంఘం సిఫారసుచేయగా ప్రభుత్వం రూ. 250_15_400 20_500 కు పెంచింది.

* జూనియర్ ఇంజనీర్ ప్రస్తుతం రూ. 250_15_400 స్కేలులో వున్నారు. దీనిని రూ. 250_15_400_ఇబి_500 కు పెంచాలని వేతనసంఘం సిఫారసుచేయగా ప్రభుత్వం రూ. 300_20_600 కు పెంచింది.

పోలీసుఇనస్పెక్టరు ప్రస్తుతం రూ. 250_15_310_20_450 స్కేలులో వున్నారు. ఈ స్కేలును రూ. 250_15_400_ఇబి_20_500 స్కేలుకు సవరించాలని వేతనాలసంఘం సిపారసు చేయగా ప్రభుత్వం రూ. 300_20_600 కు పెంచింది.

## నగరంలో ఇంటి అద్దె భత్యం

జంటనగరాలైన హైద్రాబాదు, సికింద్రాబాదులలో ప్రస్తుతం నెలకు రూ. 6 చొప్పున కంపెన్సేటరీ భత్యం పొందుతున్న రూ. 75 లోపు వేతనంగల ఉద్యోగులకు ఇకముందు నెలకు రూ. 15 చొప్పున ఇంటి అద్దె భత్యం లభిస్తుంది జంటనగరాలకు వర్తించే యింటి అద్దె భత్యం విశాఖ పట్టణంలోవి ఉద్యోగులకు కూడా వర్తిస్తుంది

## తెలంగాణాలో ప్రణాళికా ఖర్చు

1956లో ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలు విలీనమైన తర్వాత రెండవ, మూడవ ప్రణాళికల కాలంలోనూ, తరువాత గడచిన 3 సంవత్సరముల కాలంలోనూ తెలంగాణా ప్రాంతంలో రు. 313.59 కోట్ల ఖర్చు జరిగింది. అంటే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఆ కాలంలో జరిగిన మొత్తం ఖర్చులో యిది. 40.5 శాతం. ఆంధ్రప్రాంతంలో అదే కాలంలో రు. 460.33 కోట్లు (59.5 శాతం) ఖర్చు చేశారు.

రెండో ప్రణాళికలో ప్రభుత్వ రంగంలో జరిగిన ఖర్చు రు. 188.60 కోట్లు. ఇందులో రు. 64.42 కోట్లు తెలంగాణాలోనూ మిగిలిన రు. 124.18 కోట్లు ఆంధ్రలోనూ ఖర్చు జరిగింది. ఈ ప్రణాళిక కాలంలో తెలంగాణా ప్రాంతంలో జరిగిన ఖర్చు రాష్ట్రం మొత్తం మీద జరిగిన ఖర్చులో 34.2 శాతం వుంది.

మూడో ప్రణాళికలో జరిగిన ఖర్చు ఆంధ్రప్రాంతలో రు. 205.82 కోట్లు, తెలంగాణాలో రు 146.60 కోట్లు. ఇందులో తెలంగాణాలో ప్రత్యేక అభివృద్ధి పథకాల అమలు కొరకు జరిగిన రు 15.62 కోట్ల మొత్తం కూడా చేరివుంది. మొత్తం ప్రణాళిక ఖర్చులో తెలంగాణాలో జరిగిన ఖర్చు 41.6 శాతం. ప్రత్యేక అభివృద్ధి పథకాల ఖర్చు తీసివేసి చూసుకొన్నా, తెలంగాణాలో జరిగిన ఖర్చు 37.2 శాతం వరకు వున్నది.

1966_67, 67_68, 68_69, సంవత్సరాల్లో రాష్ట్రంలో రు. 232.90 కోట్లు ఖర్చు జరిగి వుంటుంది. ఇందులో రు130.33 కోట్లు ఆంధ్రలోనూ, రు. 102.57 కోట్లు తెలంగాణాలోనూ (ప్రత్యేక అభివృద్ధి పథకాల ఖర్చుకు రు. 5.88 కోట్లు సహా) జరిగింది. అంటే తెలంగాణాలో జరిగిన ఖర్చు మొత్తం 44 శాతం వరకు వుంది. ప్రత్యేక అభివృద్ధి పథకాల ఖర్చు మినహాయిస్తే యీ శాతం 41.5 అవుతుంది.

## తెలంగాణాలో 2005 ఉద్యోగాల్లో నియామకాలు

తెలంగాణా ప్రాంతంలో అభివృద్ధి పథకాలను త్వరితగతిని అమలు జరుపడానికి తగు విధంగా జిల్లా పరిపాలనా వ్యవస్థను

పటిష్ఠవంతం చేయడానికై ప్రత్యేకంగా యీ ప్రాంతానికి కేటాయించిన 2,005 పోస్టులలోనూ యింతవరకు 1,018 పోస్టులలో నియామకాలు జరిగాయి.

ఎల్. డి. సి. పోస్టులలోనూ, టైపిస్టు పోస్టులలోనూ నియామకాలు జరిపే పనిని ఆ యా జిల్లా కలెక్టర్లకు అప్పగించడం జరిగింది.

మిగిలిన పోస్టులను కూడా త్వరితగతిని నింపడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వివిధ చర్యలను తీసుకుంటున్నది. 1969 మార్చి 31న రాష్ట్ర మంత్రిమండలి మంజూరు చేసిన 2005 పోస్టులలోనూ యింకా నింపవలసినవి 1969 ఏప్రిల్ 15వ తేదీ నాటికి 1,127 పోస్టులు మిగిలి వున్నాయి.

ఎల్. డి. సి. పోస్టులు, టైపిస్టులు కాక 104 జూనియర్ ఇంజనీర్లు, 90 సెకండరీ గ్రేడు టీచర్లు, 52 భాషా పండితులు గ్రేడు II, 47 బి. ఇ. డి. అసిస్టెంట్లు, 15 అసిస్టెంటు లెక్చరర్లు, 3 ఫిజికల్ ట్రైనింగ్ ఇనస్ట్రక్టర్లను ఆ యా శాఖాధిపతులు రిక్రూట్ చేసుకోవడం జరిగింది.

20 మంది యు. డి. అకౌంట్లను, 19 ఎల్. డి. అకౌంట్లను, తహసిల్దార్లు, అకౌంట్స్‌శాఖ నియామకాలు చేయడం జరిగింది. 13 మంది ఎల్.డి.సి. లను జిల్లా పరిషత్తులు రిక్రూట్ చేసుకున్నాయి.

జిల్లాలలో టైపిస్టులు, ఎల్. డి. క్లర్కుల నియామకాల వివరాలు యీ దిగువ విధంగా వున్నాయి :—

ఆదిలాబాదు జిల్లా కలెక్టరు 65 ఎల్. డి. సి. పోస్టులకు, టైపిస్టులకు ఇంటర్వ్యూలను నిర్వహించారు. ఆ యా యూనిట్ ఆఫీసర్ల నుండి పూర్తి వివరాలు వచ్చిన తర్వాత ఖాళీలను పూర్తి చేయడం జరుగుతుంది.

ఖమ్మం జిల్లాలో యింతవరకు 16 కొత్తగా సృష్టించిన పోస్టులను నింపడం జరిగింది. మిగిలిన ఖాళీలను నింపడానికి 1969 జూన్ 21న ఇంటర్వ్యూ నిర్ణయించారు. జూన్ మాసాంతానికి మొత్తం ఖాళీలు భర్తీ చేయడం జరుగుతుంది.

కరీంనగర్ జిల్లాలో 333 అభ్యర్థులను రిక్రూట్ చేసుకోవడం జరిగింది. మరో 5 ఖాళీలను భర్తీచేయడానికి ఇంటర్వ్యూలు కూడా జరిగాయి.

మహబూబ్‌నగర్ జిల్లాలో 158 పోస్టులకు ఇంటర్వ్యూలు జరిగాయి. అభ్యర్థులను త్వరలోనే ఆ పోస్టులకు పంపడం జరుగుతుంది.

నల్లగొండజిల్లాలో ఎల్.డి.సి, టైపిస్టు పోస్టులు 251ని భర్తీ చేయడానికి ఇంటర్వ్యూలు జరిగాయి. ఈ నెలాఖరుకు నియామకాలు జరుగుతాయి.

నిజామాబాదు జిల్లాలో 241 పోస్టులను భర్తీచేసే విషయములో నియామక ఉత్తర్వులు జారీ కానున్నాయి.

వరంగల్లుజిల్లాలో 170 ఎల్.డి.సి; టైపిస్టు పోస్టులను భర్తీ చేయడానికై మే 27న ఇంటర్వ్యూలు జరిగాయి. మరి కొన్ని ఇంటర్వ్యూలను ప్రస్తుత ఆందోళన వల్ల జూన్ 23 నాటికి వాయిదా వేయడం జరిగింది.

హైదరాబాదు జిల్లాలో 160 పోస్టులకు ఇంటర్వ్యూలు జరిగాయి. త్వరలోనే అభ్యర్థులను నియమించడం జరుగుతుంది.

తెలంగాణాలో కల్పించిన 2,005 కొత్త పోస్టులలోనూ, 1,036 టీచర్లు, 132 జూనియర్ ఇంజనీర్లు, ఓవర్‌సీర్లు, ట్రేసర్లు, సూపర్‌వైజర్లు మొదలైనవి, 667 ఎల్.డి., యు. డి. క్లర్కులు, 25 జిల్లా ఇనస్పెక్టర్లు, 135 టైపిస్టులకు సంబంధించిన ఉద్యోగాలు వున్నాయి

## పోచంపాడు ప్రాజెక్టుకు అదనపుసాంకేతిక సిబ్బంది

1969 జనవరి నుండి పబ్లిక్ వర్క్సు శాఖ (ఇరిగేషన్ విభాగం) లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అనేక పదవులను కొత్తగా మంజూరు చేసింది. పోచంపాడుకు కావలసిన సాంకేతిక సిబ్బంది విషయంలో 207 జూనియర్ ఇంజనీరు, సూపర్ వైజరు ఉద్యోగాలు, 51 డ్రాఫ్ట్స్‌మన్ ఉద్యోగాలు, 22 ట్రేసరు ఉద్యోగాలు, 10 బ్లూ ప్రింటరు ఉద్యోగాలను ప్రభుత్వం మంజూరు చేసింది. ఇవి గాక 77 లోయర్ డివిజన్ గుమాస్తాలు, 16 టైపిస్టులు, 6 అటెండర్ల ఉద్యోగాలను కూడా మంజూరు చేశారు. ఏలూరుకు చెందిన ప్రత్యేక మురుగు పారుదల విభాగంలో 87 జూనియర్ ఇంజనీర్లు, సూపర్‌వైజరు పదవులు,29 డ్రాఫ్ట్స్ మన్ ఉద్యోగాలు 6 ట్రేసర్లు, 68 లోయర్ డివిజన్ గుమాస్తాలు, 6 టైపిస్టు ఉద్యోగాలు మంజూరు చేయబడినవి.

ధవళేశ్వరం సర్కిలు, వేటూరు పరిశీలనా విభాగంలో 25 జూనియర్ ఇంజనీరు, 3 డ్రాఫ్ట్స్ మన్, 1 టైపిస్టు ట్రేసరు ఉద్యోగాలుమంజూరు చేశారు

జూనియర్ ఇంజనీరు, సూపర్ వైజరు పదవులను ఆ శాఖలలోని అభ్యర్థులకు ప్రమోషన్ యివ్వడం ద్వారాను, ఎంప్లాయ్ మెంట్ ఎక్స్ఛేంజినుంచి వచ్చిన వారిని నేరుగా నియమించు కోవడం ద్వారాను. ఛీఫ్ ఇంజనీర్ (జనరల్) భర్తీ చేశారు. డ్రాఫ్టుమన్‌లు ట్రేసర్లు, బ్లూ ప్రింటర్ల ఉద్యోగాలకు నియామకాలు సూపరింటెండింగ్ ఇంజనీర్లు చేస్తున్నారు. ఎంప్లాయ్ మెంట్ ఎక్స్ఛేంజిల ద్వారా వచ్చిన అభ్యర్థుల నుండి యీ నియమకాలు జరుగుతాయి. మిగిలిన ఉద్యోగాలకు జిల్లా కలెక్టరు కేటాయించిన అభ్యర్థుల నుండి యూనిట్ ఆఫీసర్లు నియామకాలు చేస్తారు.

త్వరలోనే యిటువంటి ఉద్యోగాలను మరి కొన్నిటిని కూడా మంజూరు చేయాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది. ఈ ఉద్యోగాలకు అర్హులైన అభ్యర్థు లందరూ ఎంప్లాయ్ మెంట్ ఎక్స్ఛేంజిలలో తమ పేర్లను నమోదు చేయించు కోవాలి. ఎందువల్లనంటే నేరుగా జరిగే నియామకాలు ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజిల ద్వారావచ్చే అభ్యర్థులకే పరిమితమై వుంటాయి.

## పశువైద్య పట్టభద్రులకు ఉపాధి కల్పన

ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలో వున్న పశు వైద్య పట్టభద్రులలో నిరుద్యోగ సమస్యను కొంత వరకు పరిష్కరించే ఉద్దేశంలో 12 గ్రామీణ పశు చికిత్సా కేంద్రాలను మైనర్ వెటర్నరీ డిస్పెన్సరీలుగా మార్చుతూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వులు చేసింది. దీని వల్ల అదనంగా పశు వైద్యానికి సంబంధించిన 12 మంది అసిస్టెంట్ సర్జన్లను, 12 మంది అటెండెంట్లను నియమించ డానికి వీలవుతుంది.

నిరుద్యోగులుగా వుంటున్న పశు వైద్య పట్ట భద్రులను తెలంగాణా ప్రాంతంలోని 36 గ్రామీణ పశువైద్య చికిత్సా కేంద్రాలలో వెటర్నరీ లైవ్‌స్టాక్ ఇనస్పెక్టర్లుగా నియమించ డానికి కూడా ప్రభుత్వం ఉత్తర్వులిచ్చింది.

వీటికి తోడు షాద్‌నగర్ పాల శీతల కేంద్రంలో వున్న రెండు క్వాలిటీ కంట్రోల్ అసిస్టెంట్ల పోస్టులలో, మేనేజరు పోస్టులోనూ పశు వైద్య పట్టభద్రుల్ని నియమించే విషయమై ఉత్తర్వులను జారీ చేయడం కూడా జరిగింది. ❀

---

# చంద్రోపరితలంపై మనిషి పెట్టిన తొలి అడుగు మానవ జాతికే ఒక గొప్ప వెలుగు

అనాదిగా అసాధ్యమూ అభేద్యమూఅని అనుకుంటూ వస్తోన్న ఒక రహస్యాన్ని ఎట్టకేలకు మానవుడు ఛేదించగలిగాడు. చంద్రునిపై విజయాన్ని సాధించగలిగాడు. బహుశా యీ విజయం విశ్వవిజయానికి ప్రథమ సోపానం కావచ్చు. అనంతమైన విశ్వ రంగస్థలంపై యీనాడు మానవుడు ప్రదర్శిస్తున్న యీసాహసోపేత మైన నాటకానికి పన్నెండేళ్ళ క్రిందట నాందిపలికాడు. అమెరికా వ్యోమగాములు నీల్ ఎ. ఆర్మ్‌స్ట్రాంగ్, ఎడ్విన్ ఇ ఆల్డ్రిన్‌లు 1969 జూలై 21 వ తేదీ ఉదయం 1.48 గంటలకు రాళ్ళూరప్పలతో నిండిన చంద్రోపరితలంమీద నిర్జలమైన సీ ఆఫ్ ట్రేంక్విలిటీ (శాంతి సముద్రం) అనేచోట కాలూని, యింతవరకు అందని ఆశగా మిగిలిపోయిన స్వర్గధామాన్ని మానవాళికి తెరిచివుంచారు. రష్యా కృత్రిమ ఉపగ్రహం స్పుత్నిక్ – 1 ను భూమిచుట్టూ కక్ష్యలో పరిభ్రమింపజేసి అంతరిక్ష యుగానికి అంకురార్పణచేసిన సరిగ్గా పదకొండేళ్ళతొమ్మిది నెలల పదహారు రోజులకు చరిత్రాత్మకమైన యీ విజయం సాధించబడింది.

చంద్రునిమీద దిగిన వ్యోమగాములతో అమెరికా అధ్యక్షుడు టెలిఫోనులో నేరుగా మాట్లాడుతూ "మానవచరిత్రలోనే అపూర్వమైన యీ క్షణం నిజంగా ధరిత్రిమీది మానవాళి అంతా ఒకటైన సుదినం" అని అన్నారు.

మానవుడు చంద్రుడిని చేరుకోవడంపట్ల హర్షాన్ని ప్రకటిస్తూ భారతప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ఇలా అన్నారు "మానవచరిత్రలో నిజంగా అపూర్వమైన, అత్యద్భుతమైన క్షణాలివి. చంద్రునిపై నడచిన ఆర్మ్‌స్ట్రాంగ్, ఆల్డ్రిన్‌లు మనిషిలోని ఉరకలువేసే మహాశక్తికి ప్రతినిధులు. నిప్పునూ ఆలోచనా కనుగొన్న శక్తికి, సంగీతాన్నీ, విజ్ఞానశాస్త్రాన్నీ కనుగొన్న శక్తికి, తెల్లి పడవ మీద సముద్రాలను దాటిన శక్తికి, మానవుడు తాను స్వయంగా రూపొందించుకున్న వాహనంమీద ఒక విశ్వగోళంనించి మరో గోళంమీదకి ఎగిరేశక్తికి – వారిరువురూ ప్రతినిధులు. ఈ విజయం మానవుని నమ్రతకు, ఆత్మశోధనకు కూడావిజయం. విశ్వాంతర గోళాలను సంశోధిస్తున్న మానవుడు తను నివసిస్తున్న యీ భూగోళాన్ని మరింత నివాసయోగ్యంగా, అందంగా, స్నేహమయంగా చేసుకోగలుగుతాడా ? భూగోళంమీద మానవ సౌభ్రాత్ర్యత్వం విడదీయరాని బంధంగా పెనవేసుకోవడానికి ఈ మానవ మహాశక్తిని అటుగా కేంద్రీకరిద్దాం"

---



# మహాత్ముడు - మేరీ

"సుంద"

***

మిస్ మేరీ థర్స్టన్ లండన్ లీసిస్టర్ స్క్వేర్ లోని ఒక పుస్తకాల దుకాణం యజమానురాలు. దుకాణం పేరు "ఇండియన్ బుక్ షాప్" అందులో అన్నీ భారత దేశం గురించిన గ్రంథాలే, భారతీయులూ వ్రాసినవీ, యితరులు వ్రాసినవీ వుంటాయి. భారతీయ సాహిత్యం, కళలు, సంస్కృతి మత వ్యవస్థ, నవలలు, పురాణాలు, చరిత్ర గాంధీ సాహిత్యం— అన్ని పుస్తకాలూ భారతీయమైనవే.

మిస్ మేరీ గాంధీజీకి పరమభక్తురాలు. ఆమె ఒక్కసారే చూసింది ఆయన్ను మహాత్ముడు రెండవ రౌండ్ టేబిల్ సమావేశానికి వచ్చినప్పుడు. అప్పటికి మేరీ వయస్సు 10 సంవత్సరాలు.

అనంతర **జీవితంలో** మిస్ మేరీ **గాంధీజీ** ప్రభావానికి బాగా **లో**నయింది. 18వ ఏట శాఖాహారిగా మారింది.

మేరీ హైడ్ **పార్కులో** భారత స్వాతంత్ర్య పోరాటాన్ని సమర్థిస్తూ ఉద్రేకపూరితమైన ఉపన్యాసాలు యిస్తుండేది. ఒకటి రెండు సార్లు జైలుకు కూడా వెళ్ళింది. గాంధీ సాహిత్యంలో మిస్ మేరీ నిష్ణాత.

మిస్ మేరీ గాంధీ శతజయంతి ఉత్సవాల సందర్భంగా భారత దేశం రావాలని సన్నాహాలు చేసుకుంటున్నది.

మిస్ మేరీ యీ రచయితను లండన్ లో ఒక విందు సందర్భంగా కలుసుకున్నప్పుడు తన కథ చెప్పింది. గాంధీజీతో తన ప్రథమ—అదే చివరి—సమావేశం గురించి వివరాలు చెప్పింది. ఆమె చెప్పిన కథే యిది.



రెండవ రౌండ్‌టేబిల్ సమావేశంలో పాల్గొనడానికి జాతీయ కాంగ్రెస్ ఏకైక ప్రతినిధిగా గాంధీజీ లండన్ సందర్శించిన రోజులవి. మేరీ అప్పుడు చిన్న పిల్ల. వాళ్ళ కుటుంబం ఒక భవనంలో రెండో అంతస్తులో వుంటుండేవారు. గాంధీజీ బసచేసిన యింటికి కుడివైపున మూడో యిల్లు ఆమెది. ఆ వీధిలో జనమంతా గాంధీజీ రాకకోసం ఎదురుచూస్తున్నారు. కొందరు ఉత్సాహంతో, మరి కొందరు అసమ్మతితో భారతీయ, ఆంగ్లేయ స్త్రీ పురుషులతో బజారు కిటకిటలాడుతున్నది. మేరీ, ఆమె తల్లిదండ్రులూ, వాళ్ళ యింట్లో బాల్కనీమీద నుంచుని చూస్తున్నారు. చూస్తుండగానే నాలుగైదు కార్లు వరుసగావచ్చి నిలబడ్డాయి. "తామ్రవర్ణపు మేని ఛాయతో, తెల్లటి ధోవతి" కట్టుకున్న ఒక వ్యక్తి ఒక కారులో నుంచి దిగారు. "జై మహాత్మా గాంధీకీ జై" అనే కేకలు మిన్ను ముట్టాయి. మహాత్ముడు త్వరత్వరగా మెట్లెక్కి మేడమీదికి వెళ్ళారు. చివరిమెట్టు చేరింతర్వాత వెనక్కు తిరిగిచూసి ముకుళిత హస్తాలతో ప్రజా సమూహానికి నమస్కరించి లోపలికి వెళ్ళిపోయారు.

"ఆయనంటే చాలా భక్తిలాగేవుందే వీళ్ళకు, చాలా గౌరవ పాత్రుడుగా కనిపిస్తున్నాడు" అన్నది మేరీ తల్లి.





"నిజంగా గౌరవ పాత్రుడే! చూడు. ఆయన దుస్తులు ఎంత అసహ్యంగావున్నాయో. అసలు దుస్తులు వేసుకున్నాడా అసి" మేరీ తండ్రి హేళనగా వ్యాఖ్యానం చేశాడు.

"తన దేశానికి స్వాతంత్ర్యం కోరడానికి వచ్చాడు గదూ! మన ప్రభుత్వం యిస్తుందంటారా?"

"చస్తే యివ్వదు. భారతీయులకు స్వాతంత్ర్యమేమిటి! పిచ్చిమాట!"

క్రమంగా వీధిలోని జనసమూహం ఎక్కడి వాండ్లక్కడ వెళ్ళిపోయారు. మేరీ క్రిందికి దిగింది. తనచుట్టూ తాడుతిప్పి గెంతుకుంటూ పేవ్‌మెంటుమీద రోజూ సాయంత్రం ఆడుకుంటుంటుంది మేరీ. ఇవ్వాళ కూడా అలాగే ఆడుతూ వెళ్ళింది. కొంచెం సేపటికి నలుగు రైదుగురు వ్యక్తులతోసహా మహాత్ముడు క్రిందికి దిగి వచ్చాడు. దిగివస్తూ. చివరి మెట్టుమీద నిలబడి స్కిప్పింగ్ ఆడుతున్న మేరీవంక ప్రేమగా కాస్సేపు చూసి చెయ్యెత్తి పిలిచి చిరునవ్వు నవ్వాడు. ఆట మానేసి మేరీ ఆశ్చర్యంగా ఆయనవంక చూసింది. మళ్ళీ ఆ పిల్లవంక చేయి వూపి, నవ్వుతూ మహాత్ముడు తనకోసం వచ్చిన కారులో ఎక్కి వెళ్ళిపోయాడు.



మేరీ చరచరా యింటికి పరుగెత్తుకు వెళ్ళింది. "అమ్మా, అమ్మా ఆయన నన్ను చూసి నవ్వాడమ్మా. ఆయనది ఎంత అందమైన నవ్వు అనుకున్నావ్"

"అవును తల్లీ, ఆయన మంచివాడు. పిల్లలంటే ఆయనకెంతో ఇష్టమని కూడా అంటున్నారు"

"అంతా దొంగ నాటకం" అన్నాడు తండ్రి మధ్యలో కల్పించుకుని.



ఆనంద తన్మయత్వం కొంచెం తగ్గింతర్వాత మేరీ మళ్ళీ క్రిందికివెళ్ళి తాడుఆట ఆడుకుంటున్నది.

అదే కారు తిరిగి వచ్చింది. మహాత్ముడు దిగాడు. మళ్ళీ మేరీవంక చూసి చిరునవ్వు ముత్యాలు చిలకరించాడు సమ్మోహనాస్త్రంలాంటి నవ్వు అది. అలాగే తాడుతో గెంతుకుంటూ వెళ్ళి "థ్యాంక్ యూ సార్" అన్నది మేరీ.

"ఎందుకు?"

"నన్ను చూసి చిరునవ్వు నవ్వినందుకు"

"ఆ మాత్రానికే థ్యాంక్స్ చెప్తున్నావు ఎంత మంచి పిల్లవు నువ్వు. సరేగాని నన్ను సార్ అంటున్నావెందుకు?"

"మరేమని పిలవ మంటారు సార్"

"మామయ్యా అను. సరిపోతుంది" అన్నాడు మహాత్ముడు.

"థ్యాంక్ యూ మామయ్యగారూ" అంది మేరీ.

"రైట్ అలా అను. చూడు అమ్మాయ్. నాకిప్పుడు కాస్త తీరిగ్గా వుంది. కాస్సేపు ఖులాసా కబుర్లు చెప్పుకుందాం. మా యింటికి రారాదూ"

*　　*　　*　　*　　*

మారు మాట్లాడకుండా మేరీ ఆయన చేయి పట్టుకుని దర్జాగా మేడమెట్లెక్కి పైకివెళ్ళింది. ఇద్దరూ ఒక పెద్ద గదిలోకి వెళ్లారు. గదంతా ఖాళీగావుంది ఒక తెల్లటి తివాసీ నేలమీద పరచివుంది. ఒక మూలలో అర్ధచంద్రాకారంలో అమర్చిన కుషన్ కుర్చీలు వేసివున్నాయి. మహాత్ముడు మేరీని కుర్చీలోకూచోమన్నాడు. పక్కనే మరొక కుర్చీ దగ్గరగా తను బాసింకట్లు వేసుకుని క్రింద కూచు

న్నాడు. అది చూసి మేరీ కూడ క్రిందికి దిగి తనుకూడా ఆయన లాగే కూచున్నది. బాసింకట్లు వేసుకోవడం మేరీకి కష్టమైంది.

తను కూడా క్రిందికి దిగి, ఆ పిల్ల చూపిన వినయానికి మెచ్చుకుని మహాత్ముడన్నాడు : "మంచి పిల్లవు నీ పేరేమిటమ్మా"

"మేరీ. మామూలు పేరేలే మామయ్యా"

"అదేమిటమ్మా అలా అంటావ్. మామూలు పేరా నీది? మీ దేశపు రాణీగారి పేరు గదూ" అని ఉబ్బించాడు మహాత్ముడు.

మేరీ ఆనందానికి మేరలేదు. తలమీద కిరీటం ధరించినట్లే తబ్బిబ్బులై పోయింది.

"ఏసుక్రీస్తు తల్లిపేరు కూడా మేరీ కదూ"_మళ్ళీ ఒక గొప్పతనం గుర్తు చేశాడు మహాత్ముడు.

ఈ సారి మేరీ మనస్సు మబ్బుల్లో తేలి పోతున్నట్లుంది. ఒళ్ళు జలదరించింది. తనకంత గొప్పదనం అబ్బినట్టే కలలు కన్నది.

మహాత్ముడన్నాడు : "నువ్వు చాలా మంచిపిల్లవు. రోజూ ప్రార్థన చేస్తావా?"

"తప్పకుండా మామయ్యా! ప్రతిసారి అన్నం తినబోయే ముందు, నిద్రపోయేముందు చేస్తాను."

"అలాగా. సరేగాని నువ్వుచేసే ప్రార్థన నాకు ఒకసారి వినిపించు."

మేరీ మోకాళ్ళ మీద వంగి కండ్లు మూసుకుని ప్రార్థన అప్పగించింది. మహాత్ముడు కూడా ఆ అమ్మాయితో పాటు శ్రుతి కలిపి ప్రార్థన చేశాడు.

ఆశ్చర్యంతో మేరీ కండ్లు తెరిచి "అరే, మా ప్రార్థన నీ కెలా వచ్చింది మామయ్యా? మీరు కూడా క్రైస్తవులేనా?"

"లేదమ్మా మేం హిందువులం. కాని నిజమైన క్రైస్తవుడిగా వుండాలని నేను కోరుకుంటాను."

"మామూలుగా నువ్వు చేసే ప్రార్థన ఏమిటి మామయ్యా?"

"రామ, రామ, రామ అని లోపలనే రామనామం జపిస్తుంటాను."

"రామ, రామ, రామ". మేరీ కూడా రామనామం ఉచ్చరించింది.

ఆ రామ నామంతో పాటు మహాత్ముని మనోహర విగ్రహం కూడా ఆ లేత హృదయ ఫలకంమీద అచ్చుపడింది.

"నీ పేరు వినగానే మేరీ_గొర్రెపిల్ల పద్యం గుర్తువచ్చింది నాకు. నీకు గొర్రె పిల్ల వుందా మేరీ?"అని అడిగాడు మహాత్ముడు.

"గొర్రెపిల్లంటే నాకు భలే యిష్టం మామయ్యా. కాని యిటువంటిచోట ఉంచుకునే వీల్లేదు. అందుకే పిల్లిపిల నొకదాన్ని పెంచుకుంటున్నాను. దానిపేరు "టామ్" అన్నది మేరీ.

"పిల్లి కూడా మంచిదే......అదిసరేగాని మీ అమ్మానాన్నా నీ కోసం వెతుకుతుంటారేమో. నీ 'టామ్' కూడా ఎదురు చూస్తుంటుంది. ఇవ్వాల్టికి యింటికి వెళ్ళమ్మా రేపు మళ్లీ యిదే వేళకు రావాలిసుమా. నీ 'టామ్' ను కూడా తీసుకు వస్తావుకదూ" అంటూ మహాత్ముడు అమ్మాయిని చేయిపట్టుకుని గది బైటికి తీసుకు వచ్చాడు అక్కడ నిలుచుని వున్నవాండ్లతో చెప్పాడు :

"అమ్మాయికి నాలుగు పండ్లుపెట్టి భద్రంగా యిల్లు చేరేట్లు చూడండి".

పెద్ద పండబుట్ట మోసుకుంటూ ఇంటికి వెళ్ళి తల్లి తండ్రులతో మేరీ చెప్పింది "ఇవన్నీ గాంధీ మామయ్య యిచ్చాడమ్మా." అక్కడ జరిగిన సంగతి అంతా పూసగుచ్చినట్లు చెప్పింది మేరీ.

"ఓహో, నా చిట్టి తల్లి మహాత్మా గాంధీగారి ముద్దు కోడలయింది" అని తల్లి ఆశ్చర్యపడ్డది.

"మహాత్ముడు అంటే అర్థం యేమిటో నీకు తెలుసా!" తండ్రి చీదరించుకుంటూ అడిగాడు "నిజంగా అతడు మహాత్ముడేనా? ఊరికే గాంధీ అనండి, చాలు" అని సలహా యిచ్చాడు

మర్నాడు సాయంత్రం. టైము ఎప్పుడవుతుందా అని ఆదుర్దాతో గడిపింది మేరీ. టైముకాగానే పెంపుడు పిల్లిని చంకలో పెట్టుకొని పరుగెత్తుకుంటూ గాంధీజీ వున్న ఇంటికి వెళ్ళింది. తలుపు దగ్గర యెవరో అడిగారు, "ఎవరమ్మాయివి నువ్వు? ఎందు కొచ్చావు?" అని మేరీ ఒక క్షణంసేపు గాభరా పడింది మళ్ళీ ధైర్యం తెచ్చుకొని "నా పిల్లిని గాంధీ మామయ్యకి చూపించడానికి వచ్చాను." అంది మేరీ. ఈ లోగా మరొకరు లోపలినుంచి వచ్చి, "నీకు తెలీదా యేమి, మహాత్ముని మేనకోడలు యీ అమ్మాయి" అంటూ మేరీని లోపలికి తీసుకెళ్ళాడు.

గదిలో మహాత్ముడు కూర్చొని వున్నాడు రాట్నం వడుకుతూ. "రా, రా, మేరీ" వడుకుతున్న రాట్నం ఆపివేసి ఆ అమ్మాయిని పిల్చాడు. "అబ్బా! ఎంత అందమైన పిల్లి! దాన్ని కిందికి దించు. కాస్త తిరిగి ఆడుకోనీ."

పిల్లికుషన్ కుర్చీలమీద కూర్చొని దొర్లాడింది. కిటికీలమీదికి దూకింది, గది నాలుగు మూలలా గంతులువేసింది. కాసేపు దానివేపు చూసి, మళ్ళీరాట్నం వడకడం మొదల పెట్టాడు మహాత్ముడు.

"ఎంత త్వరగా వడుకుతావు మామయ్యా! ఎంత సన్నగా దారం తీస్తావు."అన్నది మేరీ.

"అవును మరి, ఎంతో సాధన చేసిన మీదట నాకిది ఇంత బాగా వచ్చింది. నీకు స్కిప్పింగ్ వచ్చినట్లు." అన్నాడు మహాత్ముడు.

"ఈ వడుక్కోడం ఎందుకు మామయ్యా?"

"నా గుడ్డలు నేను తయారు చేసుకోవద్దూ మరి"

"ఎందుకూ? కొనుక్కోకూడదా?"

"కొనుక్కోవచ్చనుకో కాని డబ్బేదీ?"

"లేదా?"

"లేదమ్మా, నేను చాలా బీదవాణ్ణి"

"ఏమిటీ! బీదవాడివా?"

"ఇంత గొప్పవాడివి! బీదవాడివా?"

"నిజంగా. మమ్మాటికీ బీదవాణ్ణే."

"నేను నమ్మను మావయ్యా. నీవు బీదవాడివైతే, నిన్ను చూడ్డానికి ఇంత పెద్దపెద్ద వాళ్లు కార్లల్లో ఎందుకొస్తున్నారు?"

ఆ అమ్మాయికి ఇదంతా ఒక గొడవగా, ఆశ్చర్యకరంగా వుందని మహాత్ముడు గ్రహించి "సరే, అదంతా ఎందుకుకానీ, మా దేశపు మిఠాయిలు కొన్ని నీకిస్తాను, తిందువుగాని." అంటు మహాత్ముడు ఒక చిన్నపెట్టె తెరచి చేతినిండా మిఠాయి తీసుకొని మేరీకి పెట్టాడు. అవి చాక్లెట్లలాగున్నాయి ఒకటి రుచి చూచి మేరీ అంది, "భలేకమ్మగా వుంది మామయ్యా. దేనితో చేస్తారు వీటిని?"

"పంచదార పాకంలో శెనగ్గింజలు వేసి ఉడికిస్తారు అంతే"

"అంతేనా! కాని ఎంత కమ్మగావుంది! ఒకముక్క పిల్లికి యివ్వనా మామయ్యా?"

"దానికి సయిస్తుందో లేదో."

పిల్లి ఆ ముక్కను బాగా యిష్టంగానే తిన్నది. మిఠాయిలు తినేసిం తర్వాత మేరీ తలుపు వంకచూసి "సరే మామయ్యా! నే వెళ్లొస్తాను. నీకోసం చాలామంది బయట నిలబడి ఉన్నట్లుంది" అని చెప్పి, పిల్లిని చేత పట్టుకుని మేరీ వెళ్ళిపోయింది.

"మళ్ళీ వస్తావుకదూ" అన్నాడు మహాత్ముడు

నిజానికి మేరీకి మళ్ళీ ఒకసారికాదు, ఎన్నిసార్లయినా వచ్చి ఆయనతో గడపాలనే కోర్కె మనస్సులో నాటుకుంది. కాని ఆతరువాత మహాత్ముడు ఎప్పుడూ ఒంటరిగా దొరకలేదు యింట్లోనూ, బైటా ఎప్పుడూ చాలామంది ఆయనకోసం వేచి వుంటుండేవాళ్లు. ఎన్నోసార్లువచ్చి, పైకివెళ్ళి చూసిందికూడా. ఎప్పుడు వెళ్ళినా ఎడతెగకుండా జనం వుండేవాళ్ళు. ఆ అమ్మాయికి ఆశాభంగం కలుగుతూ వుండేది. తిరిగి ఆయన స్వదేశం వెళ్ళేలోగా ఒక్కసారైనా కలిసి మాట్లాడాలని తహతహలాడింది మేరీ మనస్సు. కాని సాధ్యపడలేదు. మరొక రోజున తండ్రి పెద్దగా కేకలు వేస్తుంటే మేరీకి ఉదయమే మెళుకువ వచ్చింది. తల్లిమీద అరుస్తున్నాడేమో అనుకుంది మొదట్లో, కానికాదు. "చూడు తాటికాయలంత అక్షరాళ్ళో ప్రత్యేక శీర్షిక ఎంత అవమానం, ఆ గాంధీ, మన రాజూ, రాణీ ప్రక్కన ఆ మురికి గుడ్డల్లోనే మాట్లాడాడుట! ఎంతధైర్యం? అలాగే దుప్పటి కప్పుకుని కూచున్నాట్ట. అసలు, చక్రవర్తి, మహారాణి యీ అవమానం ఎలా భరించారు అంటా! ప్రధానమంత్రి దీన్ని ఎలా అనుమతించాడు? ఇది మనజాతికే అవమానం" అంటూ కేకలు పెడుతున్నాడు తండ్రి.

తండ్రి ఎదుటికి పోవడానికి భయంవేసి మేరీ తను పండుకున్న గదిలోనే నక్కికూచుంది. కాని ఆయన అలా వూరుకునే ఘటంకాదు. "ఏయ్ మేరీ, యిలా రానువ్వు" అంటూ కేకేశాడు.

మేరీ నెమ్మదిగా వెళ్ళింది; భయభయంగా, తండ్రికి దూరంగా నుంచుంది.

"నువ్వు మామయ్యా, మామయ్యా అని కులుకుతున్నావే చూశావా! ఆయన యేమి చేశాడో. మన రాజుగారిని, రాణిగారిని అవమానపరిచాడు. ఆ మురికిబట్టలతోనే రాజభవనంలోకి వెళ్ళి విందులో వాళ్ళప్రక్కనే కూర్చున్నాడు. మళ్ళీ యింకోసారి ఆయనతో మాట్లాడావా—చూసుకో యేంచేస్తానో ... వినపడిందా నేను చెప్పింది." అని గద్దించాడు తండ్రి.

మేరీ తల వూపింది.

"తల ఊపడంగాదు. ఆయనతో మాట్లాడను అని అను"

"మాట్లాడను" అని మెల్లిగా అనుకుంటూ మేరీ భయంతో తల్లి దగ్గరకు పరుగెత్తింది.

మహాత్ముడు వెళ్ళిపోయే రోజున, మేరీ అదృష్టం కొద్దీ తండ్రి దగ్గరలేడు. మహాత్మునికి వీడ్కోలు చెప్పడానికి పెద్ద జన సమూహం చేరింది. మేరీ బాల్కనీమీదా నుంచుని ఆ ప్రజాసమూహంవైపు చూస్తున్నది లోపలినుంచి రాట్నం తీసుకొచ్చి ఒక కారులో పెడుతుండడం చూసి మేరీ పరిగెత్తుకుంటూ వెళ్ళి తల్లితో "వెళ్ళిపోతున్నాడమ్మా" అని బిగ్గరగా అరిచింది. కాసేపు ఆగి అడిగింది. "అక్కడ బాల్కనీమీద నుంచొని ఆయన్ను చూస్తానమ్మా చూడొచ్చా?"

తల్లి చిరునవ్వు నవ్వింది జాలిగా "ఎందుకు చూడకూడదు. నాన్న ఆయనతో మాట్లాడొద్దన్నాడుగాని చూట్టానికేమి? రా పోదాం! నేను చూస్తాను."

ఇద్దరూ బాల్కనీ వైపు వెళ్ళారు.

మహాత్ముడు బైటికి వచ్చాడు. ఒక మెట్టుమీద నుంచొని ప్రజలు చేసే జే జే ధన్యవాదాలకు బదులుగా చేతులు జోడించి నమస్కరించాడు. మరికొంచెం కిందికిదిగి తన ప్రక్కనేవున్న మనిషితో యేదోచెవులో చెప్పాడు ఆ మనిషి నాలుగు దిక్కులాచూసి మేరీ నుంచొనివున్న బాల్కనీవేపు చూపించాడు మహాత్ముడు చిరునవ్వుతో మేడవంకచూసి క్రిందికి రమ్మని సంజ్ఞచేశాడు.

మేరీకి గొంతులో వెలక్కాయ పడినట్లైనది. మహాత్ముడు మళ్ళీపిలిచాడు.

మేరీ యేడవడం మొదలెట్టింది.

ఆయనకేమీ అర్థం కాలేదు. "ఎందుకూ" అన్నట్లుగా చేతితో సంజ్ఞ చేస్తూ అడిగాడు.

మేరీ రెండుచేతులు ముఖానికి అడ్డంగా పెట్టుకున్నది.

"యేడవకమ్మా" అంటూ తల్లి మేరీని ఓదార్చింది. కారు కదిలిన చప్పుడువిని మేరీ గబ గబ కన్నీళ్లు తుడుచుకొని క్రిందికి చూసింది.

మహాత్ముడు కారులోంచితొంగిచూస్తూ దిగులుగా చిరునవ్వు నవ్వుతూ మేరీవంక చేయి వూపుకుంటూ ఆ పిల్లను ఆశీర్వదిస్తూ వెళ్ళిపోయాడు.

గుడ్లల్లో నీళ్ళు గ్రుక్కుకుంటూనే మేరీ చిరునవ్వునవ్వి చేయివూపుతూ ఆయనకు వీడ్కోలు చెప్పింది. ఆ కారు కంటికి కనబడినంత సేపూ మేరీ చేయి ఊపుతూనేవుంది.

"అమ్మా, అమ్మా" అంటూ తల్లిని పట్టుకొని బిగ్గరగా యేడ్చింది. తల్లికిగూడా కన్నీళ్ళు తిరిగినై. యెందుకమ్మా యేడుస్తావు అని ఓదార్చింది.

* * *

ఈ కథంతా చెప్పి చివరకు వచ్చేసరికి మేరీ థర్స్టన్‌కు గొంతు పెకల్లేదు. చాలా సేపు మౌనంగా వుండి, "ఈ కథ ఇంత వరకు యెవ్వరికి చెప్పలేదు." అన్నది

తాను మహాత్ముని కలిసినప్పటి ఆనందం, బాధ మాకు వివరంగా చెప్పినందుకు కృతజ్ఞతలు చెప్పాను. బయటికి వెళుతూ "గుడ్‌నైట్" అనడానికి బదులు నమస్తే చెప్పాను.

తరువాత కొన్నాళ్ళకు నేను, మిస్ థర్స్టన్‌ను ఇండియా క్లబ్బులో డిన్నర్‌కి ఆహ్వానించాను. క్లబ్బు ప్రక్కనే వున్న విక్టోరియా గార్డెన్సులోకి వెళ్ళి ఒక బెంచీమీద కూర్చున్నాము.

"అయితే మీరు తర్వాత మహాత్మున్ని మళ్ళీ కలుసుకోలేదా" అని అడిగాను.

"లేదు, ఆయనని కలుద్దామని మీ దేశం రావడానికి ప్రయత్నము చేశాను. కాని పడలేదు" అని ఆమె జవాబుచెప్పింది.

ఆ ప్రయాణం యెందుకు ఆగిపోయిందంటే.........

లండన్‌మీద విమానదాడులు జరుగుతున్న సమయంలో మేరీ ఒక హాస్పిటల్లో నర్సు వాలంటీర్‌గా పనిచేస్తూ ఉండేదట. ఒకరాత్రి ఆమె ఆస్పత్రిలో ఉండగా వాళ్ళ యింటిమీద బాంబుపడింది. ఇల్లు కూలిపోయి తల్లిదండ్రులు చచ్చిపోయారు. అప్పటినుండి మేరీ ఆస్పత్రి హాస్టల్‌లో మకాము పెట్టవలసివచ్చింది. మేరీ యేమి తోచక దిగులుపడివున్న ఆ సమయంలో బాంబులవల్ల నష్టమైన యింటికోసం నష్టపరిహారం కోరవచ్చని ఒక ప్లీడరు సలహా యిచ్చారు. ఆమె ఒప్పుకుంది. ఆ ప్లీడరే ఆమెతరఫున పనిచేశాడు. మేరీకి నష్టపరిహారంగా బాగానే డబ్బు లభించింది.

భారత దేశానికి ప్రయాణసన్నాహాలన్నీ పూర్తి చేసుకొని టిక్కెట్లు కొనుక్కోడానికి తయారుగావున్న సమయంలో మేరీకి పిడుగుపాటలా మహాత్ముని మరణవిషయం తెలిసింది. మేరీశరీరం సంతాపాగ్నిలో కుతకుతలాడింది. ఆ వేడికి కన్నీళ్ళన్నీ యింకిపొయ్యాయి. ఒక వారంరోజులపాటు నిద్రాహారాలు లేక గడిపింది మేరీ. యెన్నోసార్లు ఆత్మహత్యాభావము తన మనస్సులో దూకులు పెట్టింది కాని ఆలోచన వచ్చినప్పుడల్లా అంతరాంతరాల్లో రామ నామము వినిపిస్తూండేది. పదేండ్ల ప్రాయంలో తాను చూచిన ఒక ప్రసన్నవదనం ఆమె కళ్ళముందు సాక్షాత్కరించేది. చీకటిలోనే వెలుగూవుంది. దాన్ని వెతుక్కోవాలి." అని ఉద్బోధిస్తున్నట్లు వినిపించేది.

మేరీకి క్రమంగా అంతర్ముఖత్వము యేర్పడింది. గాంధీ సాహిత్యమంతా క్షుణ్ణంగా చదివింది. గాంధీజీ వ్రాసినవి, ఆయనను గురించి ఇతరులు వ్రాసినవి, తనవద్ద వున్నవి, కొత్తగా కొన్నవి యెన్నో గ్రంథాలు అధ్యయనంచేసింది. ఇలా చదువుతున్న సమయంలోనే గాంధీ భావ ప్రచారానికి తానేదైనా కృషిచేయాలని అభిప్రాయం కలిగిందిమేరీకి. అటువంటిదేదైన చేస్తేనే జీవితానికి పరమార్థం అనుకున్నది. భారత దేశానికి రావటానికి ఉద్దేశించిన డబ్బుతో "ఇండియన్ బుక్ షాప్" అనే పేరుతో ఒక గ్రంథ విక్రయశాల ప్రారంభించింది

నేను భారత దేశానికి బయలుదేరడానికి ఒక వారంరోజులు ముందుగా థర్స్టన్‌కు చెప్పి శలవు తీసుకోటానికి ఆమె దగ్గరకు వెళ్ళాను.

"మీరు ఢిల్లీకి వెళ్తారా?" అని అడిగింది.

"ఢిల్లీలోనే నా మకాం".

"మంచిది నాకో చిన్న సహాయం చేసిపెట్టాలి".

"తప్పకుండాను".

"మీరు ఢిల్లీకి వెళ్ళంగానే నా తరఫున గాంధీజీ సమాధి మీద ఒక పూలమాల వుంచండి".

"అలాగే తప్పకుండాచేస్తాను" అని వాగ్దానంచేశాను.

"మేరీ వెంటనే పర్సు తీయబోయింది".

"డబ్బు అక్కర్లేదు. పూలమాల నేనే కొంటాను".

"అదెలా కుదురుంది? నా డబ్బుతో పూలుకొంటేనే నాకు సంతృప్తి" అంటూ ఒక పౌను నోటు యివ్వబోయింది.

"ఇంత డబ్బెందుకు? మా దేశంలో పూలు చాలా చవుక"

"ఫరవాలేదులెండి. ఈ డబ్బుకు యెన్ని పూలు వస్తే అన్నీ కొనండి. అవన్నీ మహాత్మునికి సమర్పించండి. నా పూలవాసనల గుబులింపు అనంతమైన ఆయన కీర్తిపరిమళాలతో మేళవించాలి".

ఢిల్లీ చేరిన మరునాడే నేను రాజ్‌ఘాట్‌కి వెళ్ళి అక్కడ దొరికినన్ని పూలమాలలు కొనేశాను. పూలమాలలతో 'రామ'

అనే అక్షరాలు యేర్పడేటట్టుగా సమాధిమీద వాటిని అమర్చి "ఆ దూరదేశంలో ఇంగ్లండులో వున్న నీ పరమ భక్తురాలు పంపిన కుసుమాంజలులు ఇవి" అని దాదాపు బిగ్గరగానే అనేశాను.

ఈ విధంగా చేసినట్లు థర్బన్‌కు వెంటనే ఉత్తరం రాశాను. కృతజ్ఞతలు తెలుపుతూ, ఆమె జవాబుకూడా వ్రాసింది. ఇటీవల మళ్ళీ ఆమెవద్దనుండి ఒక వుత్తరం వచ్చేదాకా, మామధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగలేదు. తన దుకాణాన్ని ఒక భారతీయ మిత్రుని చేతిలో పెట్టానని ఆమె వ్రాసింది. మన దేశంలోవచ్చి, ఉండటానికి ఆమె నిర్ణయించుకున్నట్లయితే ఆ షాపు అతనికి అమ్మివేస్తుందట.

నేను ఆమెకు వ్రాసిన జవాబులో చివరకు ఇలా అన్నాను. "మిమ్మల్ని యిక్కడ కలుసుకోవాలని మనస్సు వువ్విళ్ళూరుతున్నది. యిక్కడ-అంటే యీ దేశంలో-మన యిద్దరిదీ అయిన ఈ భారత దేశంలో యిక్కడ తిరగడానికి "గాంధీ ప్రదేశాలను" అన్నీ చూడడానికి అవసరమైన యేర్పాట్లు నేను చేస్తాను. కొన్ని ప్రదేశాలకు మీతో నేనుకూడా వస్తాను.

దయచేసి మళ్ళీ మనసు మార్చుకోవద్దు. యిప్పుడే నిర్ణయం చేసుకోండి ఇక్కడికి వచ్చి ఉండడానికి.

"మాతోపాటు మా మధ్యలో ఒకరుగా మీరుంటే యెంతో బాగుంటుంది. మీ హృదయంలో వెలుగుతున్న మహాత్ముని ఆదర్శ జ్యోతి మాకుకూడా వెలుగుచూపుతూ వుంటుంది".

—(తమిళమూలం).

"ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా" సౌజన్యంతో.

---

# సమకాలీనులపై గాంధీజీ ప్రభావము

లేడీమౌంట్‌బాటన్-ఎడ్వినామీద గాంధీజీ ప్రభావం ఎంతో వుంది. భర్తను మినహాయిస్తే ఆమె మనస్సును గాంధీజీ కంటే అధికంగా ఆకర్షించిన వారు లేరనే చెప్పాలి.

వైస్రాయి భార్యగా ఆమె గాంధీజీ యింటికి వెళ్ళి చూసింది. ఒక భారతీయ నాయకుడి యింటికి వైస్రాయి భార్య వెళ్ళడం అదే మొదలు. అప్పుడాయన హరిజనుల కాలనీలో వుంటూండేవారు.

లేడీమౌంట్‌బాటన్ వెళ్లి గాంధీజీ పాదాల వద్ద కూచుంది. ఆయన తన రాట్నం ఆమెకు చూపించాడు.

బ్రిటిష్‌రాణికి పెండ్లికానుకగా ఏం పంపాలని గాంధీజీ ఎడ్వినా సలహా అడిగాడు. ఆమెచెప్పినట్లు తానే నేసిన నూలు వస్త్రం పంపాలని నిర్ణయం చేసుకున్నాడు గాంధీజీ.

1947 జూలై 18 వ తేదీన మౌంట్‌బాటన్ దంపతులకు దాంపత్య రజతోత్సవం జరిగిన రోజున ఎడ్వినాకు ఒక లేఖ వచ్చింది. అందులో యిలా వుంది:

"చెల్లీ !

సంతోష సంరంభాల పందిరి క్రింద ఆశీఃపరంపరల పూల వానలో మీ దాంపత్య జీవితపు రజతోత్సవపు వేడుకలు జరుగుతున్నాయి కదూ. నా అభినందనలు కూడా అందుకో. భారత దేశంలో మీ ఉభయులు గడిపిన జీవితం మిమ్మల్ని ప్రపంచ పౌరుల స్థాయికి చేర్చునుగాక.

మీ ప్రియమైన

యం.కె. గాంధీ

(డెన్నిస్ హాల్‌మన్ రాసిన "లేడీమౌంట్.బాటన్ కథ" నుండి)

# విద్యార్థులను గురించి నెహ్రూ

దేశపునర్నిర్మాణమనే మహాయజ్ఞానికి యీనాడు కావలసినవెన్నోవున్నాయి. పని అనేది కావాలి. కార్మికశక్తి కావాలి. ప్రశాంత పరిస్థితి నెలకొనడం కావాలి. సహకార కృషి కావాలి. దేశంలో విస్తరించివున్న వివిధప్రయోజనాత్మక ప్రగతిశక్తులన్నీ సమీకృతం కావాలి. ఇవన్నీ యీనాడు చాలా అవసరం. అయితే మనం చేస్తున్నదేమిటి ? నిజమే మనలో చాలామంది ఈ లక్ష్య సాధనకే శ్రమిస్తున్నారు. శక్తివంచనలేకుండా నిరంతరం పరిశ్రమిస్తున్నారు, ఇందులో ఏమాత్రం సందేహంలేదు. కాని ఒకసారి అలాచుట్టూ చూస్తే కనిపించేదేమిటి_ పనిచేసే వాతావరణం ఏమాత్రం కనిపించదు, పనులు చేద్దామన్న ఆలోచన ఏమూలా వుండదు. వొట్టిమాటల పోగులు మాత్రం కుప్పతిప్పలుగా కనిపిస్తాయి. ఒకరినొకరు విమర్శించుకోవడాలు, తప్పులు పట్టడాలూ, చిన్నచూపులూ, చిన్నచిన్న విషయాలమీదనే కలహించుకోవడాలు_ యిలాటివే అంతటా అన్నిమూలలా కనిపిస్తాయి. పెద్దలు, పిన్నలు అనిలేదు. అందరిలోనూ యీ లక్షణాలే. అలాంటప్పుడు నావయసు నాకు గుర్తుకొచ్చి మనసంతా దిగులుగా అయిపోతుంది. మరియింకెంతో కాలం జీవించను కదా అనిపిస్తుంది. నా జీవన చరమదశలో కష్టించి పనిచేయాలనీ, నేను చేయాల్సిన పని పూర్తి అయ్యాకనిశ్శబ్దంగా నిష్క్రమించాలనీ నాకోరిక. నేను చెయ్యాల్సిన పనిచేస్తే యిక నాగురించి నాకేం దిగులూలేదు తమపనులను తాము పూర్తిచేసుకుని నిష్క్రమించినవారినిగురించి ఊరికే తలంచుకుంటూ కూచోవడంవల్ల ప్రయోజనంలేదు. నేనుచేసే పనే నాకు లెక్కకొస్తుంది. అందుకే నా శక్తివంచనలేకుండా నా బాధ్యత నేను నిర్వర్తిస్తాను.

నేనూ, నాతోటివారూ గడచిన యిరవైముప్పై సంవత్సరాలుగా, అంతకన్న ఎక్కువ కాలంగానే, భారతదేశ రంగస్థలం మీద మంచో చెడో ప్రధాన భూమికలు ధరించాం. ఈనాడు మేము నిష్క్రమిస్తే మా స్థానాలను మరొకరెవరోవచ్చి ఆక్రమిస్తారు. ఎందుకంటే దేశమనేది ఎప్పుడూవుండేదేకదా. మనుషులే వచ్చిపోతూ వుంటారు. దేశానికి చావులేదు. అది నిరంతరంగా వుండేదే. దానిలో నివసించేవారే కాలంతోపాటు నిష్క్రమిస్తారు, కొత్తవాళ్ళు ఉద్భవిస్తారు. భారతదేశంకూడా అలాటి దేశమే. అది నిత్యసత్యం వంటిది.

ఒకవిధమైన శాశ్వతత్వం దీనిలోవుంది. దీని ఆశయాలలోనూ, పెరుగుదలలోనూ, చివరకు దీని నాశనంలోనూ యీ నిత్యసత్యం అంతర్లీనంగావుంది అందువల్ల మేము కళ్ళుమూస్తే మేంమోస్తున్న ఈ బరువంతా అది ఎక్కువ కానివ్వండి. తక్కువ కానివ్వండి _ యితరుల భుజస్కంధాలమీద పడుతుంది.

మిమ్మల్ని పొగడడానికి గానీ, మీ పొగడ్తల్ని వినడానికి గానీ నేనేమీరాలేదు. ఇంతకు ముందు చాలాసార్లు యీ పొగడ్తల ప్రహసనం కొనసాగింది. మీరు నన్ను ఇంతవాడిననీ, అంత



వాడిననీ పొగిడారు. నేను మాత్రంవూరుకున్నానా. లేదే, నేనూ మిమ్మల్ని పొగిడాను. కాని యిది మంచిపని కాదు. చేయవలసిన పని వున్నప్పుడు యిలా ఒకరినొకరం పొగుడుకొంటూ కాలం వృధా పుచ్చవద్దు మనం.

పనిచేయడానికీ, ఆడుకోడానికీ సమయాలంటూ వున్నాయి, నవ్వే సమయం, ఏడ్చేసమయం ఒకటికాదుగా. నవ్వేచోట ఏడవం, ఏడ్చేచోట నవ్వం, అలాగే పనిచేయాల్సినపుడు చేయాలి. ఆడేటప్పుడు ఆడాలి. ఇప్పుడు యీ దేశానికి పనిచేయడం అంటూ అవసరం. ఈ తరంవారు కష్టించి పనిచేయడానికి వెనుకంజ వేస్తున్నారు. అసలు మనం చేయవలసిన పనేమిటి ? దాన్ని మనం ఎట్లా చేపట్టాలి ?

మనం చేపట్టేపని శ్రమతో కూడుకున్నదయితే. అది మంచిపని అయితే, మనసుకు ఉల్లాసం కలుగుతుంది. బలంకలుగుతుంది. ఉత్తేజం కలుగుతుంది, కష్టపడి పని చేయకపోతే హాయిగా నిద్రపట్టదని చాలామంది చెప్తారు. కష్టపడి పనిచేసినందువల్లే మరణించిన వారెవరూలేరు, ఒక మంచి పనిగురించి మనస్సును పూర్తిగా లగ్నంచేసి కష్టించి పనిచేసినందువల్ల ఎవరూ మరణించలేదు. ప్రజలు మరణించారంటే దానికి కారణాలు వేరు. అనారోగ్య కారణాలవల్ల ప్రజలు మరణిస్తుంటారు. కనుక మనం శ్రమపడిపనిచేద్దాం. అయితే మనం చేయాల్సిన పనేమిటి ? అసలు పనంటే మీకున్న అభిప్రాయం ఏమిటి ?

వీధులవెంట ఊరేగి ప్రదర్శనలు జరపడం, ఫ్యాక్టరీలోనో, స్కూల్లోనో, మరోచోటో పనిని స్తంభింపజేసి హర్తాల్ చేయడం యివే యీనాడు ప్రజల దృష్టిలో పనులు అంటే. ఒకొక్కప్పుడు

వాటి ఉపయోగం వాటికి ఉన్నాయనుకోండి. అయితే యీనాడు యీరూపేణా జరుగుతున్న యీ పనికన్న ప్రమాదకరమైనది భారత దేశానికి మరోటి లేదు. దీనిని మించిన పెద్ద నేరం యింకొకటి వుండబోదు. నేనేమీ ఎగతాళికో, హాస్యానికో అనడం లేదు. ఇది ముమ్మాటికీ నిజం.

మరికొంత కాలంపాటు నేను శ్రమించాల్సివుంది. భారత దేశాన్ని పటిష్ఠవంతమైన దేశంగా, గొప్పదేశంగా చూడాలని వుంది. తన ప్రజల అభ్యుదయానికేగాక ప్రపంచంలోని వారందరి అభ్యున్నతికీ తోడ్పడే విధంగా భారతదేశం అభివృద్ధి చెందాలని నా ఆకాంక్ష. కాని నా దేశంలోని యువజనం తమ చిత్తం వచ్చినట్లు ప్రవర్తించడం చూసినప్పుడు, యువకులు, యువతులు ఒక రకమైన పిచ్చిలో బాధ్యతారహితంగా ప్రవర్తించడం చూసినప్పుడు నాకు కోపం ముంచుకొస్తుంది. స్వేచ్ఛ అంటే యిదేనా? మీరు అనుకునే ప్రజాస్వామ్యం అంటే యిదా? ఇదేం నాకు నచ్చలేదు. ఈ విషయంలో మీకు నిక్కచ్చిగా ఒకటి చెప్పాలనుకుంటున్నాను మనం మన దేశాన్ని రూపొందించుకునే మార్గం యిదెంతమాత్రమూ కాదు. ఈనాడుమన దేశం ముందున్న సమస్యలేమిటోమీకేమైనా తెలుసా? వాటిని గురించి ఎప్పుడైనా ఆలోచించారా? ప్రభుత్వంలోవున్న మేము ఏవైనా తప్పు చేసి వుండవచ్చు. ఒకటేమిటి అనేక తప్పులుచేసి వుండవచ్చు. ఆకారణంగా ప్రభుత్వంనుంచి తప్పుకోడానికి మాకేం అభ్యంతరం లేదు. మీరు అధికారంలో నిలిపినవారి భుజస్కంధాల మీద ఎంత బరువువున్నదో ఏనాడైనా మీరు ఆలోచించారా? భారతదేశంలో ఈనాడు ఏ వ్యక్తికన్నా పెద్ద శిక్ష ఇవ్వాలంటే అతన్ని తీసుకొచ్చి అతని చేతికి పరిపాలనాధికారాన్ని యిస్తేచాలు.

ఇంతకీ మనకున్న సమస్యల మాటేమిటి? వాటిని మీరు ధైర్యంగా ఎదుర్కోవాలి. వాటినిగూర్చి ఆలోచించాలి. కేవలం భారత దేశాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకొని యీ సమస్యలను పరిష్కరించడానికి పూనుకో కూడదు. విస్తృతమైన దృక్పథం కావాలి. ప్రపంచాన్ని మొత్తం దృష్టిలో వుంచుకోవాలి. ఈనాడు ప్రపంచం ఎంతో వైవిధ్యపూరితంగా వుంది. అటుచూస్తే మీకు కనిపించేదేమిటి. చక్కటి నిర్మాణాత్మక కృషి, ఉన్నతమైన లక్షాలు, వాటికై ప్రయత్నాలు కనిపిస్తాయి. మంచివాళ్ళు కనిపిస్తారు. ప్రపంచంలో ఇంతకుపూర్వం ఎప్పుడూ కనిపించనంత ఎక్కువగా మహనీయులు ఈనాడు కనిపిస్తారు. అయితే చెడు కూడా కనిపిస్తుంది ప్రతీప శక్తులు కనిపిస్తాయి. యుద్ధం, హింస, దౌర్జన్యశక్తులు కనిపిస్తాయి. ఈ నాడు యివన్నీ కలగలిసి ప్రపంచంలో మనకు కనిపిస్తాయి. ఇంత వైవిధ్యం, ఇంత సంఘర్షణ అన్నిటిలోనూ మనకు కనిపిస్తుంది. దీని ఫలితమేమిటో మనకు తెలీదు. అయితే ఒకటి మాత్రం తెలుసు. మంచితోపాటు చెడు కూడా వుంటుంది. అయితే మనం మంచి గురించి పోరాడాలి.

అసలు సమస్య ఏమిటి? మీరు ఈ సమస్యకు పరిష్కార మార్గాన్ని చూడానికి ప్రయత్నిస్తుంటారు. మీ వక్తృత్వ సమావేశాల్లోనూ, ప్రదర్శనలోనూ పరిష్కారాన్ని చూపించడానికి ప్రయత్నిస్తుంటారు. ఇంతకీ ఆ సమస్య ఏమిటో తెలిసిందా? ఆ ప్రశ్న ఏమిటో కనుగొన్నారా? చాలామంది ప్రశ్న ఏమిటో తెలుసుకోకుండానే సమాధానానికి ప్రయత్నిస్తుంటారు. ప్రపంచం ముందున్న సమస్య ఏమిటో, ప్రశ్న ఏమిటో గుర్తించకుండానే పరిష్కారానికి పూనుకుంటారు.

నిజమే, ప్రపంచం చాలా విస్తృతమైనదే, అంతమాత్రంచేత భారతదేశం సమస్యని ప్రపంచ సమస్యనుంచి మీరు విడగొట్టలేరు. ఏ ఉత్తర ప్రదేశ్ సమస్యనో, ఏ లక్నో సమస్యనో, మరో పెద్ద సమస్యనుంచి విడదీసి ప్రత్యేకించరాదు. అందుచేత ఈ విస్తృతమైన సమస్యను గురించి అస్పష్టంగానన్నా మీకు కొంత ఆలోచనంటూ ఒకటి వుండాలి.

మానవ చరిత్రలో యీ కాలం పరిణామ కాలం. ఇలాటి కాలంలో ఏ సమస్యనన్నా మీరు అర్థం చేసుకోవాలంటే దాని పుట్టుపూర్వోత్తరాలన్నీ తెలుసుకోవాలి. చరిత్రలో అది ఎప్పుడు ఎక్కడ ఎలా ఉద్భవించిందీ, ఎలా అభివృద్ధి చెందినదీ, ఎలా వేళ్ళూని నిలచిందీ, ఆమూలవేరు లేమిటో మొదలైన చరిత్రంతా తెలుసుకోవాలి. ఏవో నినాదాలు చేసినంత మాత్రంచేత సమస్య అర్థమైనట్లు కాదు. అంతమాత్రాన సమస్యకు పరిష్కారం లభించదు నినాదాలు ఒక్కొక్కప్పుడు మంచివే ఎందుకంటే ఒక భావాన్ని కొద్దిపాటి మాటల ద్వారా హృదయంలోకి ఇంజక్షన్ చేయడానికి నినాదాలు తోడ్పతాయి. నినాదాలను చేయవచ్చు. తప్పేంలేదు. అయితే నినాదమే ఒక సమస్యకు పరిష్కారమని గానీ, అదే సమాధానమనిగానీ అభిప్రాయపడడం ఆత్మవంచనే.

ప్రపంచ సమస్యలను గురించి, భారతదేశ సమస్యలను గురించి, మనం ఎదుర్కోవలసిన సమస్యలను గురించి, వాటి బహుముఖ రూపాలను గురించి నా అభిప్రాయాలను మీకు చెప్పాలనుకుంటున్నాను. నిరంతరంగా యీ సమస్యలను నేను ఎదుర్కోవలసేవుంటుంది. అది నా ధర్మం. నా బాధ్యత. అందువల్ల సమస్యలను గురించే నిత్యం ఆలోచిస్తూ, వాటిగురించే బాధపడుతూ, అవే మాట్లాడుతూ, అవే చర్చిస్తూ వుండడంవల్ల నామనస్సులో దానిబహుముఖ రూపాలన్నీ నిండిపోయాయి. వాటిని గురించి నాకు తీరిక వున్నప్పుడు మీకు చెప్పాలనీ వుంది. ఈ దేశంలో ప్రజాస్వామిక విధానంలో మనం మనమనుగడ సాగించాలంటే మన సమస్యలను ఒకరికొకరం తెలుసుకోవాలి. ఒకరికొకరం అర్థంచేసుకోవాలి. పరస్పరం అభిప్రాయాలను చెప్పుకుని అందులో కష్టసుఖాలను గురించి విడమరిచి తెలుసుకోవాలి.

సీరియల్:

# తిరస్కృతి

—వాసిరెడ్డి సీతాదేవి

సత్యం బహుశా యీ వూళ్ళోనే వుండవచ్చు. ఈ చిత్రకారుడు బహుశా ఆ సత్యమే కావచ్చు–అనుకుంది విమల.

"మీ సత్యమా—అంటే ఈ చిత్రకారుడు మీకు తెలుసా?" అడిగింది విమల ఆత్రంగా అక్కడి యువకునితో. ఆ యువకుడు కళ్ళతోనే చిలిపిగా చూస్తూ "అవును!" అన్నట్లు జవాబిచ్చాడు.

"సత్యనారాయణ అనే ఒక కుర్రాడు పది సంవత్సరాల క్రితం శాంతినికేతన్‌కు చిత్రకళ నేర్చుకొనటానికి వెళ్ళాడు. ఆ తరవాత అతన్ని చూట్టం పడలేదు అతనే ఈ చిత్రకారుడేమోననే సందేహం కలుగుతుంది" అన్నాడు కేశవరావు.

విమల ఆ యువకుని జవాబు కోసం ఆత్రంగా అతని వైపు చూసింది.

"ఈ చిత్రకారుడు కూడా శాంతినికేతన్‌లో చిత్రకళాభ్యాసం చేశాడు." విమల ఆత్రం చూసి విషయాన్ని నాన్చి చెప్పటానికి ప్రయత్నిస్తున్నాడు. విమల ముఖం సంతోషంతో వెల్లివిరిసింది.

"నిజంగా! సత్యానికి ఒక చెయ్యి . . ." పైకి అనలేక కేశవరావు ఆ యువకుని ముఖంలోకి చూశాడు

"అబ్బే అదేం లేదండీ! మా సత్యానికి రెండు చేతులూ వున్నాయి లక్షణంగా!" అంటూ విమల ముఖంలోకి చూశాడు.

మరుక్షణం విమల ముఖంలోని వెలుగు మాయమయింది. కేశవరావు ఉన్నబుచ్చుకున్నాడు ఇద్దరూ ముందుకు సాగిపోయి మౌనంగా మరో చిత్రం దగ్గర నిల్చున్నారు.

సందేహంలేదు! ఈ అమ్మాయి సత్యాన్ని ప్రేమిస్తుంది. వాడు చెప్పకపోయినా. ఇల్లు విడిచి, తన వాళ్ళందర్నీ విడిచి రావటానికి ఇలాంటిదే ఏదో కారణం వుంటుందని తను అప్పుడే అనుకున్నాడు. ఎప్పుడూ దిగులుగా ఆలోచిస్తూ వుండే సత్యం, పొరపాటున కూడా ఒక్కనాడైనా తన ఆవేదనను తెలియనివ్వలేదు. ఈ అమ్మాయిని చూసి వాడు ఎలా అయిపోతాడో! ఎంత సంతోషిస్తాడో చూడాలి!

అరే, వాళ్ళిద్దరూ వెళ్ళిపోతున్నట్లున్నారు! మిగతా చిత్రాలు చూడకుండానే కళాభవన్ బయటకు వచ్చి మెట్లు దిగుతున్న తండ్రీ కూతుళ్ళను పరుగెత్తుకుంటూ వచ్చి కలుసుకున్నాడు ఆ యువకుడు.

## జరిగిన కథ

సత్యం, సూర్యం అన్నదమ్ములు. సత్యం శాంతి నికేతన్ వెళ్ళి చిత్రకళ నేర్చుకుని వచ్చాడు. సూర్యం పట్నంలో చదువు కొంటున్నాడు. తమ యింట్లోనే వుంటున్న మేనమామ కూతురు సరళను సత్యం పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. కాని సరళ తనను చేసుకోదలచలేదని తెలిసి ఇంట్లోంచి వెళ్ళిపోయాడు. చిన్నప్పుడు సత్యానికి చదువుచెప్పిన కేశవరావుగారూ, ఆయన కూతురు విమల ఒకసారి ఓ చిత్రకళా ప్రదర్శనకు వెళ్ళారు. అక్కడ సత్యం పేరునడీ చిత్రం కనిపించింది. అక్కడవున్న ఒకతన్ని పిలిచి సత్యంను గూర్చి అడిగారువారు.

"ఏమండీ!"

కేశవరావూ, విమల నిలబడి పోయారు విమలకు చిరాకు వేసింది! ఏమిటి ఈ యువకుడు తమను వెంటాడుతున్నాడు. ఆ కొంటె చూపులూ అతనూ! వళ్లు మండిపోతుంది.

"ఏం బాబూ!" అన్నాడు కేశవరావు,

"క్షమించండి! నేను తమాషాకు అబద్ధంచెప్పాను. అతను మీ సత్యం కాదంటే ఆ అమ్మాయి ముఖం ఎలామారుతుందో చూడాలనే దుర్బుద్ధితో అలా అన్నాను. ఈ చిత్రకారుడు సత్యనారాయణకు ఎడం చెయ్యిలేదు. తెనాలి దగ్గర ఓ పల్లెటూరు. పదేళ్ల క్రితం శాంతినికేతన్‌లో చిత్రకళను అభ్యసించటానికి వచ్చాడు. అక్కడే మా ఇద్దరికీ పరిచయం కలిగింది." గబగబా అనేశాడు ఆ యువకుడు

విమల ముఖంలో నూరు కేండిల్స్ బల్బ్ వెలిగింది. మనస్సు పురివిప్పిన నెమలే అయ్యింది. "నిజంగా!" అనేసింది.

"ఎక్కడున్నాడు బాబూ! మీకు తెలిస్తే అతని అడ్రసు చెబుతారా!" అన్నాడు కేశవరావు ఆనందంతో ఉక్కిరి బిక్కిరవుతూ.

"ఎందుకునాన్నా! ఆఫీసులోకివెళ్ళి ఎవర్నయినా ఈ ప్రదర్శనకు సంబంధించిన ఆర్గనైజర్ను అడుగుదాం!" అంది విమల నిర్లక్ష్యంగా ఆ యువకుణ్ణి కించపరచే ఉద్దేశంతో.

ఆ యువకుడు ఆమె మాటలకు ఉడుక్కోలేదు. చిరునవ్వు నవ్వేసి ఊరుకున్నాడు.

"మీ ఇద్దరూ శాంతినికేతన్‌లో కలుసుకున్నారన్నావుగా? అతను ఎక్కడ వుంటాడో తెలియదా?" అన్నాడు కేశవరావు.

"తెలుసునండీ! అతను ప్రస్తుతం మా యింట్లోనే వుంటున్నాడు. నేనే ఈ ప్రదర్శనకు ఆర్గనైజర్ను" అన్నాడు ఆ యువకుడు విమలవైపు కొంటెగా చూస్తూ.

విమల తెల్లమొహం వేసింది.

"మమ్మల్నొకసారి సత్యం దగ్గరకు తీసుకెళ్లు బాబూ! ఎంతకాలమయిందో చూసి" అన్నాడు కేశవరావు.

"ఇప్పుడా! ఈ ప్రదర్శన ఎనిమిది గంటలకుకానీ మూయటానికిలేదు అంతవరకూ నేను ఇక్కడ నుంచి కదలటానికిలేదు" అన్నాడు సాలోచనగా.

"పోనీయ్, అడ్రసు చెబితే మేమే వెళ్ళిచూస్తాం" అన్నాడు కేశవరావు.

ఆ యువకుడు ఆలోచనలో పడ్డాడు. వీల్లేదు. వీరిద్దరి కలియిక— విడిపోయిన ప్రేమికుల కలయిక తన కళ్ళముందే జరగాలి. అప్పుడప్పుడూ సరదాగా వాళ్ళను ఏడిపించటానికి తను ఆ సమయంలో వుండాలి. అదీ కాక తను రాస్తున్న నవలలో ఇలాంటి సన్నివేశం ఒకటి రాయాల్సివుంది. తనకు అనుభవం లేకపోయినా, ఇలాంటి దృశ్యం చూసే అవకాశాన్ని జారవిడుచుకో కూడదు.

విమల అతని ఆలోచనను అపార్థం చేసుకుంది. మళ్ళీ అతను సత్యం తన ఇంట్లోనే వున్నాడని చెప్పినమాట అబద్ధం అనుకుంది. కోపంతో ముఖం ఎరుపెక్కింది.

"ఇది మరో అబద్ధం అయివుండాలి. అసలు సత్యం ఇతనికి తెలిసి వుండడు! పదనాన్నా" అంటూ విసురుగా రెండడుగులు ముందుకు వేసింది.

ఈసారి ఆ యువకుడు కొంచెం చిన్నబుచ్చుకున్నాడు.

"బేగంపేటలో పబ్లిక్ స్కూలుకు ఎదురుగా ఓ పెద్ద బంగళా వుంది. దాని పేరు 'రసమయి' అని రాసివుంటుంది. ఆ బంగళా రంగు మిల్క్‌వైట్. అందులోనే వుంటున్నాడు సత్యం!" అనేసి గిరుక్కున వెనక్కి తిరిగాడు ఆ యువకుడు.

"చూడు బాబూ! నీ పేరేమిటి!" ప్రశ్నించాడు కేశవరావు.

"నన్ను మాధవరావు అంటారండీ!" అన్నాడు.

"ఆ బంగళా మీదా?"

"అవునండీ!" ముక్తసరిగా జవాబిచ్చాడు. విమలకు అర్థం అయింది ఆ యువకుడికి కోపం వచ్చిందని.

"ఇప్పుడు సత్యం ఇంటిదగ్గరే వుంటాడాండీ" విమల సాధ్యమయినంత సౌమ్యతను కంఠంలోకి తెచ్చిపెట్టుకుంటూ ప్రశ్నించింది.

'అలారా దారికి!' అన్నట్లు చిరునవ్వు నవ్వాడు.

అంతా నాటకం! కోపంవచ్చినట్లు నటించాడు! చాలా గట్టివాడు లాగేవున్నాడు.

"ఈ సమయంలో లేకపోవచ్చును. రేపు ఉదయమే రాగలిగితే మంచిది. బ్రేక్‌ఫాస్టుకు వచ్చేయండి!"

"థ్యాంక్స్!" అంది విమల.

"ఏం తల్లీ! రేపు ఉదయం వెళదాం." అన్నాడు కేశవరావు.

"మీ పేరు చెబితే రాత్రికి సత్యంతో చెబుతాను" అన్నాడు మాధవరావు.

"కేశవరావు. ఆ అమ్మాయి నా కుమార్తె విమల. ఇక్కడ ఉమెన్స్ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తోంది" అన్నాడు కేశవరావు

"కేశవరావుగారా? క్షమించండి! ఇంతసేపూ మీరు ఫలానా అని తెలియక ఏమేమో వాగేశాను. మీ గురించి సత్యం నా దగ్గర చెబుతూ వుంటాడండీ! మీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేనివంటూ వుంటాడు జన్మలో ఒకసారి మిమ్మల్ని కలుసుకోవటం తటస్థపడుతుందో లేదోనని దిగులుపడుతుంటాడు" అన్నాడు మాధవరావు ఎంతో మర్యాదగా కేశవరావుతో చెయ్యికలుపుతూ.

"కుర్రవాడు చాలా బుద్ధిమంతుడు!" అన్నాడు కేశవరావు తనను సత్యం ఇంకా జ్ఞాపకం వుంచుకున్నందుకు సంతోషపడుతూ.

"అయితే! మీ గురించి ఎప్పుడూ పొరపాటున కూడా అనలేదండీ!" అన్నాడు విమల కళ్ళలోకి లోతుగాచూస్తూ.

విమల ముఖం చిన్నబుచ్చుకుంది మాధవరావు చిరునవ్వు నవ్వాడు. మాధవరావు కొంటెతనానికి కేశవరావుకు కూడా నవ్వు వచ్చింది.

"సత్యానికి సిగ్గు ఎక్కువ. చిన్నప్పుడే మాట్లాడేవాడుకాదు. అమ్మాయి చొరవగా మాట్లాడినా. నావంక చూస్తూ నాకు ఇస్తున్నట్లు జవాబిచ్చేవాడు" అన్నాడు కేశవరావు గతాన్ని నెమరు వేసుకొంటూ.

"వెళదాం నాన్నా!"

"వస్తాం బాబూ!" అన్నాడు కేశవరావు.

"రేపు ఉదయం మీ కోసం ఎదురు చూస్తుంటాం నమస్కారం!"

"నమస్కారం" అంటూ కేశవరావు ముందుకు నడిచాడు.

విమల ఓ క్షణం అతనిదగ్గర శలవు తీసుకోవాలా, లేదా అన్నట్లు నిలబడిపోయింది. తటపటాయిస్తూ మళ్ళీ ఏమనుకుందో ఏమీ అనకుండానే ముందుకు ఒక అడుగువేసింది. అప్పటికే కేశవరావు మెట్లుదిగి కొంతదూరం వెళ్ళాడు.

"విష్‌యూ హాపీ డ్రీమ్స్!"

విమల తక్కున ఆగిపోయింది. గిర్రున వెనక్కి తిరిగి చూసింది ఆమె నిల్చొనివున్న మెట్టుకు నాలుగడుగుల పైగా నిల్చొనివున్నాడు మాధవరావు. అసలే చాలా పొడవుగావున్న అతని ముఖం ఎంతో ఎత్తుగా కనిపించింది. అతను తలవంచి విమల ముఖంలోకి చిరునవ్వుతో చూశాడు. అదే కొంటెనవ్వు! అవే లోతైన చూపులు! విమలకు కోపం రాలేదు. ‿సహ్యం వేసింది. కొత్తవాళ్ళ దగ్గర, చొరబడి మరీ చనువు తీసుకునేవాళ్ళంటె విమలకు మహా‿సహ్యం! ఏదో అనబోయి ఆగిపోయింది విసురుగా మెట్లుదిగి వెళ్ళిపోయింది.

మాధవరావు మెట్టమీదే నిలబడిపోయాడు! విమల వెళ్ళిపోతూ చూసిన తిరస్కారంతో కూడిన చూపులు చెళ్ళున చెంప పగులగొట్టినట్లయింది మాధవరావుకు.

తనేమిటి ఇలా ప్రవర్తించాడు! ఇంతకంటె అందమైన యువతులు ఎందరు తనను ఆకర్షించటానికి నానాపాట్లు పడలేదు. ఏనాడూ ఎవ్వరినీ లక్ష్యం చెయ్యలేదే! తనను ఆకర్షించగల యువతి ఇంకా పుట్టలేదేమో ననుకొంటు వుండేవాడు.

ఆమెలో ఏమిటీ వింత ఆకర్షణ! పెద్ద సౌందర్యవతికాదు. పెద్ద ఏమిటి! అసలుకాదు. అతిసాధారణమైన రూపం! చామనచాయ అయినా ఆ ముఖంమీద వాలిన చూపుల్ని మరల్చుకోవటం కష్టసాధ్యం. మళ్ళీ మళ్ళీ ఆ చూపులు అటే పరిగెడతాయి. తనకు జీవితంలో మొదటిసారిగా, చాలా చిత్రమైన అనుభూతి కలిగింది.

ఆమెలోని ప్రత్యేకమైన ఆకర్షణ ఏమిటి? ఆ చిన్న చిన్న నీరుసోగ కళ్లా! బయట ప్రపంచం కంటె తనలోని ప్రపంచాన్నే ఎక్కువగా చూసుకొంటున్నట్టుండే ఆ కళ్ళేనా? లేక ఆ కళ్ళలోని ఏదోభావం . . . అదే చిరకాలంగా దేనికోసమో వ్యగ్రతలో అన్వేషిస్తున్నట్టుండే ఆ కళ్ళలోని భావమేనా, ఆ ముఖానికి ఆకర్షణ! లేక ఆమె వ్యక్తిత్వంలో స్పష్టంగా కనిపించే ఆత్మ విశ్వాసమా! అదీ కావచ్చును! కాదు . . . ప్రపంచం అంటే తనకు లక్ష్యం లేదన్నట్టు కనిపించే ఆ ముఖంలోని గాంభీర్యమా! లేక . . . తను యువతిననే భావనను ప్రతినిముషం గుర్తు చేసుకుంటున్నట్లుండే ఆమె ప్రవర్తనా . . . లేక యవ్వనం అనే పదానికి తనకు అర్థం తెలియనట్లు కనిపించే ముఖంలోగాని గాంభీర్యమా ? అడుగునుండి తొంగిచూసే అమాయకత్వమా? అవును! ఇవన్నీ ఆమెలోని ఆకర్షణకు కారణాలే.

ఎమిటి తను ఇలా ఆలోచిస్తున్నాడు! ఎప్పుడూ ఏ ఆడపిల్లను గురించి ఇంత సేపు ఒంటరిగా కూర్చొని ఆలోచించలేదే! ఆ అమ్మాయి సత్యం ప్రేమించిన పిల్ల! మర్చిపోవాలి! ఆ ఆకర్షణ నుంచి దూరంగా వుండాలి.

మరొకసారి సత్యం అదృష్టవంతుడు అనుకుంటూ ప్రదర్శన శాలలోకి వెళ్ళాడు మాధవరావు.

ఎప్పుడూ ఉత్సాహంగా, ప్రతి విషయాన్నీ చాలా తేలిగ్గా తీసుకుంటూ, హాయిగా నడిచే మాధవరావుకు, తన నడకలో ఏదో మార్పు వచ్చినట్లనిపించింది.

* * * *

ఉదయం ఏడుగంటల కల్లా ముస్తాబై తండ్రికి ఎదురుగా వచ్చి నిల్చిన విమలనుచూసి ఆశ్చర్యపోయాడు కేశవరావు. విమల సాధారణంగా నిద్రలేవటం ఏడు గంటలకు. రాత్రి ఎంతవరకైనా మేలుకొనగలదు కాని ఉదయం మాత్రం త్వరగా లేవదు. కేశవరావు తెలిగ్గా, ఎంతోకాలంగా గుండెలమీద వున్న ఎదో బరువును దించేసినట్లు తేలిగ్గా నిట్టూర్చాడు.

విమల అదేమీ గమనించే స్థితిలోలేదు. ముఖంలో ఉత్సాహం దాచినా దాగకుండాఉన్నది. ఆమెను ఎంతోకాలంగా చుట్టివేసినజడత్వం ఒక్కసారిగా కరిగి చైతన్యంగా మారినట్లు కనిపించసాగింది.

"బయలు దేరండి నాన్నా!" అంది విమల ఆమెకంఠం లీలగా వణికినట్లు తోచింది కేశవరావుకు. ఆనందం ఎక్కువయినప్పుడు కంఠం వణుకుతుంది.

కేశవరావు ఏవేవో ఆలోచనల్లోకి జారిపోయాడు. యాంత్రికంగా లేచి బయటకు నడిచాడు. విమల తాళంవేసి తండ్రి దగ్గరకు వచ్చింది.

రోడ్డు ఎక్కగానే ఎదురుగా కన్పించిన టాక్సీని ఆపి ఎక్కారు.

"ఏమ్మా కళ్లు ఎర్రగా వున్నాయి రాత్రి సరిగా నిద్రపోలేదా!" కేశవరావు ప్రశ్నకు విమల కొంచెం తడబాటు చెందింది.

"ఒకటే దోమలు సరిగా నిద్రపట్టలేదు." అనేసింది విమల తనమంచానికి దోమతెర కట్టి వుందనే విషయాన్ని మర్చిపోయి.

కేశవరావు విస్తుబోయి కూతురు మోహంలోకి చూశాడు. తన తప్పు తెలుసుకున్న విమల టాక్సీ అద్దాన్ని కిందకు దింపుతూ బయటకు చూస్తున్నట్లు నటించసాగింది. కేశవరావుకు ఏదో తోచి ముసిముసిగా నవ్వుకున్నాడు.

టాక్సీ ఆగిందో లేదో మాధవరావు ముందుకొచ్చి టాక్సీ డోర్ తెరిచాడు. అదిచూసి తండ్రి కూతుళ్ద్ద ఆశ్చర్యపోయారు. సత్యం లేకుండా మాధవరావు ఒక్కడే నిలబడ్డాడేం? విమలకు సత్యంమీద కోపం వచ్చింది.

"మా కోసమే చూస్తున్నారా!" కేశవరావు టాక్సీవాడికి డబ్బులిస్తూ అన్నాడు.

"అవునండి!"

"ఇంత పొద్దుటే వస్తామని ఎలా అనుకున్నారు!" లోపలకు వస్తూ అన్నాడు కేశవరావు.

"నాకు తెలుసు ఇంతకంటె ముందేవస్తారని!" అర్థయుక్తంగా చూసాడు మాధవరావు విమలవైపు. విమలకు అతని మాటల్లోని వ్యంగం అర్థమయింది. సిగ్గుతో తలవంచేసుకుంది.

'మిల్కీ వైట్' ( బాగా మరిగిన పాల రంగులోవున్న ) ఎత్తైన భవనం వాళ్ళను ఆహ్వానించింది. వాళ్ళు నడుస్తున్న కాలిబాటకు రెండువైపులా చక్కగా పెంచిన పూలమొక్కలు మధ్యలో పద్మం ఆరకాంలోవున్న పౌంటెన్ కనిపించాయి. విమలకూ, కేశవరావుకూ అంతపెద్ద బంగాళాలో అడుగు పెట్టాలంటే ఏదోగా వుంది. తమకు కానిస్థలంలోకి ఎక్కడకో వెళుతున్నట్లుంది. మాధవరావు ఇంత శ్రీమంతుల బిడ్డా! అయినా గర్వం ఏ కోశానా వున్నట్లు కనిపించదు. ఎంత నవ్వుతూ సరదాగా మాట్లాడుతాడు! రాత్రి కలిగిన ఏవగింపు ఇట్టే గౌరవంగా మారిపోయింది విమలకు మనసులో. కేశవరావు ఆలోచనలుకూడ దాదాపు అలాగే వున్నాయి. సత్యం ఈ బంగళాలో వుంటున్నాడా? బహుశా ఈ ప్రదర్శన సందర్భంగా వచ్చిఉంటాడు అనుకున్నాడు.

(సశేషం)

# గాంధేయ ఆర్థిక దృక్పథము

— కాకుమాను తారానాథ్

**ఈ** సంవత్సరము మనము గాంధేయ శత జయంతే కాకుండా ముఖ్యమైన ఇంకొక ఉత్సవాన్ని కూడా జరుపుకుంటున్నాము. అది గాంధీజీ ప్రముఖ వ్యాఖ్య "హింద్ స్వరాజ్య" యొక్క షష్టిపూర్తి ఉత్సవాలు. 1908 లో లండన్ నుంచి దక్షిణ ఆఫ్రికాకు నౌకలో తిరిగి వస్తూ గాంధీజీ ఈ వ్యాసాలు వ్రాశారు. అవి ప్రథమంలో దక్షిణాఫ్రికాలోని "ఇండియన్ ఒపీనియన్" పత్రికలో ప్రచురిత మయ్యాయి. మూలము గుజరాతీలో ఉంది. "ఇండియన్ ఒపీనియన్" లోని వ్యాసాలు పుస్తక రూపంలో రావటంతోనే, బొంబాయి ప్రభుత్వము దానిని నిషేధించింది. గాంధీజీ స్వయంగా ఈ గ్రంథాన్ని, శ్రీ కల్లెన్ బాచ్ కోరికమీద ఆంగ్లంలోకి అనువదించారు. బొంబాయి ప్రభుత్వ నిషేధా కి సమాధానంగా గాంధీజీ, ఈ ఆంగ్ల తర్జుమాను ప్రచురించారు

దీనిని గురించి ఎవరికి ఎన్ని అభిప్రాయాలున్నా గాంధీజీ మట్టుకు అందులోని అభిప్రాయాల నుంచి ఎక్కువ వైదొలగ లేదు ఉదాహరణకు శ్రీ గోపాలకృష్ణ గోఖలే 1912 లో దక్షిణాఫ్రికా సందర్శించారు. ఈ అనువాదాన్ని చూచారు. ఇది చాలా తొందరలోనూ, మోటుగాను వ్రాయబడిందనీ, ఒక సంవత్సరం భారత దేశంలో గడిపితే గాంధీజీయే దానిని నాశనం చేస్తారనీ అభిప్రాయపడ్డారు. కాని ఈ అభిప్రాయం ఎంత మాత్రం నిజంకాదు. 1921 లో ఈ గ్రంథాన్ని గురించి ప్రస్తావిస్తూ గాంధీజీ ఇలా అన్నారు "... ఈ వ్యాసాలు ఆధునిక నాగరికత పట్ల తీవ్ర నిరశనను తెలియజేస్తాయి అవి 1908 లో వ్రాయబడినవి. కాని నా నమ్మకము ఈ నాడు తీవ్రంగా ఉంది..."

1938 లో— అనగా "హింద్ స్వరాజ్య" ప్రచురణ తరువాత సరిగ్గా 30 సంవత్సరాలకు—దానిని పురస్కరించుకుని, బొంబాయి లోని "ఆర్యన్‌పాత్" పత్రిక తరపున శ్రీమతి సోఫియా వాడియా, "ఆర్యన్‌పాత్" పత్రిక ప్రత్యేక సంచికను వెలువరించింది. దానికిగాను "హింద్ స్వరాజ్య" గ్రంథాన్ని గురించి ప్రముఖ పాశ్చాత్య విద్వాంసుల అభిప్రాయాలు—జిడి.హెచ్. కోల్, మిడిల్‌టన్ మర్రె మొదలగు వారి అభిప్రాయాలు సేకరించబడ్డాయి. ఈ సంఘటన తరువాత సరిగా 30 సంవత్సరాలకు— స్వతంత్ర భారత దేశం ఈ నాడు "హింద్ స్వరాజ్య" షష్టిపూర్తి ఉత్సవాలు జరుపుకుంటున్నది 1938 నాటికి కూడా గాంధీజీ అభిప్రాయాలలో పెద్దమార్పేమీలేదు. "ఆర్యన్‌పాత్" ప్రత్యేక సంచికకు ఒక సందేశాన్ని పంపుతూ ఇలా వ్రాసారు "... నేను దానిని తిరిగి వ్రాయవలసి వస్తే, భాషను అక్కడా ఇక్కడా మార్చవచ్చు. కాని ఈ ముప్పది సంవత్సరాల తీవ్ర రాజకీయ జీవితం తరువాత కూడా, దానిలో వెలువరించిన భావాలను మార్చుకోవలసిన అవసరం నాకు కనపడటంలేదు..." 1968 నాటికి కూడా వీటిపట్ల గాంధీజీ అభిప్రాయాలలో తీవ్ర మార్పు ఉండదనటం, గాంధేయ తత్వారాధకులకు సువిదితమే.

"హింద్ స్వరాజ్య" గ్రంథమంతా ఆధునిక నాగరికతపట్ల, యంత్రీకరణ పట్ల అనేక ఆధునిక వ్యామోహాల పట్ల చాలాకటువైన విమర్శ ఉంది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంపట్ల— దానిలోని కొన్నిలోపాల పట్ల అతి తీవ్రమైన అభిప్రాయాలు వెలువరించబడ్డాయి. ఉదాహరణకు ఇంగ్లండు స్థితిగతుల ప్రస్తావనలో పార్లమెంటును గురించి ఈ విధంగా అంటాడు గాంధీజీ "మీరు పార్లమెంటులకు మాతృక అని దేన్నయితే భావిస్తున్నారో అది ఒక గొడ్రాలు (SterileWoman) మరియు వ్యభిచారిణి (Prostitute) లాంటిది ఈ రెండు పదాలు చాలాకటువైనవే, కాని పరిస్థితికి సరిగ్గా అతుకుతాయి."

అలాగే యంత్రీకరణపట్ల ఆయన అభిప్రాయాలు, "ఆర్యన్ పాత్ "ప్రత్యేక సంచికలో పాశ్చాత్య విద్వాంసుల విమర్శలకు లోనయ్యాయి. ప్రొఫెసర్ మర్రె, గాంధీజీ విపరీతంగా ప్రేమించే రాట్నం కూడా ఒక యంత్రమేనన్ని, మరి ఆయన సిద్ధాంతాల ప్రకారం దాన్ని కూడా రద్దు చేయాలి కదా అని అంటాడు అలాగే ప్రొఫెసర్ బరన్స్ ఏయంత్రమైనా దుర్వినియోగం చేయబడవచ్చనీ, కాని ఆలోపం ఆ యంత్రంలో లేదనీ, ఆ యంత్రాన్ని దుర్వినియోగం చేసే మానవుని నైతికతలో ఉన్నదనీ అంటాడు.

1938 లో మహదేవ దేశాయ ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ ఈ పై చెప్పిన అభిప్రాయాలకు గాంధీజీ ఎప్పుడూ వ్యతిరేకి కాదనీ, "హింద్ స్వరాజ్య" ను వ్రాసిన తొందరలో ఆయన భాషను కొంచెం సునిశితంగా వాడలేదనీ, యంత్రాల కెప్పుడూ ఆయన లోపాలను ఆపాదించ లేదని చెపుతూ, ఒక సంఘటనను ఉదహరించారు. 1924 లో ఢిల్లీలో ఆయన యంత్రము అనే ప్రతి దానికి వ్యతిరేకా అనే ప్రశ్నకు సమాధానమిచ్చి, కొన్ని ప్రత్యుత్తరాల తరువాత ఈ విధంగా అన్నాడంటారు. "ఆత్మవిముక్తికి ఈ దేహమెంత మాత్రము సహాయకారి కాదు, కాబట్టి నేనీ దేహాన్నే నిరాకరిస్తాను. అదేవిధంగా, ఆదర్శంలో నేను యంత్రాన్ని నిరశిస్తాను ఈ దృక్కోణం నుంచి నేను అన్ని యంత్రాలను వ్యతిరేకిస్తాను, కాని ఈ దేహం ఏవిధంగా ఉండక తప్పదో, ఉందో, అదే విధంగా యంత్రాలుంటాయి. నేను మీతో

చెప్పినట్లు, ఈ శరీరమే ఒక అద్భుతమైన యంత్రము. కాని ఆత్మోన్నతికి ఈ శరీరము అడ్డంకి అయితే, అది నిరాకరించబడవలసిందే."

ఈ సూక్ష్మ దృక్పథం ఆధారంగా వారి ఆర్థిక ధోరణి, పద్ధతులు పెంపొందించ బడ్డాయి వాటిని క్లుప్తంగా ఈ వ్యాసంలో పరామర్శించటం జరుగుతున్నది.

* * *

"మానవుడు ఈ మధ్యనే పారిశ్రామిక యుగంలో ప్రవేశించాడు. ప్రకృతిని ఉపయోగించగల శక్తి పెరుగుతున్నది, అది ఇంకాతీవ్రంగా ఉపయోగ పడగల శక్తి. ఇది కొన్ని కొన్ని పద్ధతుల క్రింద తల ఎత్త గలదు. వాతావరణం కలుషితం కావటం, భూసారము నశించటం, నీటి కరువు వగైరాలు. ఇది ప్రకృతి సంపద అపరిమితంగా గల అమెరికాలో కూడా తప్పదు. తక్కువ ప్రకృతి సంపదగల దేశాలలో ఇది చాలా ముందే సంభవిస్తుంది. నాది అభివృద్ధి నిరోధక ధోరణి కాదు. మనం గనుక మన పద్ధతులను సక్రమంగా వినియోగిస్తే ప్రకృతి సంపదను వాడుటమే కాకుండా దానిని పూరించగలమని కూడా తెలుసు. ఇది మన దృషిని తప్పక ఆకర్షించాలి. ముఖ్యంగా ప్రకృతి సంపద తక్కువగా ఉన్న దేశాలలో ఇది ఆకర్షింపక తప్పదు. సాధారణంగా ప్రకృతిని మనం ఏది పడితే అది తీసుకోవటానికి వీలయిన 'స్టోర్సు'గా భావించకుండా, ప్రవహించే ప్రవాహమనీ దానిని మనం పూరించాలని గమనించాలి. మిగతా అనేక ఇతర జీవరాసుల మీద మానవ జీవితం ఆధారపడి ఉంటుందని మనం గ్రహించటానికి ఇది చక్కగా ఉపయోగపడుతుంది. దీనినే నేను ""పొలిటికల్ ఈ క్వాలజీ" అనిపిలుస్తాను"

ప్రముఖ ఫ్రెంచి ఆర్థికవేత్త, రాజకీయ తత్వవేత్త అయిన బెటాండ్ డిజొవెనల్ "ఆర్థికాభివృద్ధి సమస్యలు" అనే విషయం మీద ప్రసంగిస్తూ 1957 లో పై విధంగా అంటాడు. "ఈ క్వాలాజీ" అంటే జీవశాస్త్రంలో భాగమే. జీవరాసులు ఎలా బ్రతుకుతాయి, తమ పరిసరాలతో ఏవిధంగా మెలుగుతాయి మొదలగు విషయాలను వర్ణించే శాస్త్రము. పారిశ్రామిక వాదము, ప్రగతి పెరిగిన కొలదీ, మానవుడు పరిసరాలను ప్రకృతిని విరశించే ధోరణిని పెంపొందించుకుంటాడు. అది పనికిరాదని చెప్పేదే పై హెచ్చరిక.

మానవుని అస్తిత్వమంతా, భూమి పైభాగంలోగల 10 అంగాళాల మట్టిలోనూ, దానిలోగల జీవరాశి మీద మాత్రమే ఆధారపడి ఉందనే విషయాన్ని మనం ఎన్నడూ విస్మరించరాదు. దీనిని విస్మరించి ఎక్కువ అధికారము, సంపదలకోసము వెంట పడిన బాబిలోనియా, సుమేరియా, గ్రీసు, రోము సామ్రాజ్యములు ఏ విధంగా ఈ తులాభారాన్ని ధ్వంసం చేసిందీ, ఫలితంగా చరిత్రలో నశించి పోయిందీ, Top scil and Civilization అనే పుస్తకంలో శ్రీ టామ్‌డేవ్ వివరంగా వర్ణించాడు.

కాబట్టే గాంధీజీ దృష్టిలో ఈ భూనాశనానికి దారితీయని, ఆర్థిక పరిష్కార మార్గాలకు ప్రాముఖ్యం ఏర్పడింది. తత్ఫలితంగానే, పారిశ్రామికీకరణవైపు మొగ్గును అతిగా చూపని, వ్యావసాయ దృక్పథం ఆధారభూతంగా తన కార్యక్రమాలను రూపొందించుకున్నాడు. ఈ దృష్ట్యా ఆయన ప్రబోధించిన రాట్నము ప్రాధాన్యత మనకు అర్థమవుతుంది.

* * * *

ఈ నాడు కూడా ఇలాంటి కార్యక్రమాలకు ప్రాధాన్యత ఉన్నదా లేదా అంటే, గాంధీ కాలంనాటి ఆర్థికస్థితి గతులున్నంత కాలం గ్రామీణ పరిశ్రమల ప్రాధాన్యతను ఎవ్వరూ కాదనలేరు. గాంధీజీ జనాభా నివేదికలనుంచి, అనేక ప్రముఖ ఆర్థికవేత్తల పరిశోధనల ఫలితంగా, భారతదేశంలోని గ్రామీణ రైతునకు సంవత్సరం పొడుగునా పని ఉండటం అసంభవం అనే నిర్ణయాని కొచ్చారు. భారతదేశపు 1921 జనాభా లెక్కల ప్రకారం చిన్న కమతము, నేటి ఉత్తర ప్రదేశ్‌లో 2.51 ఎకరాలుంటే, బొంబేలో 12.15 ఎకరాలుంది. షుమారుగా ఉన్న పంజాబ్‌లో-కమతము 91.8 ఎకరాలున్నా, కాల్వర్ట్ యొక్క అంచనాల ప్రకారము 12 నెలలలోనూ సరియైన పూర్తిపని 150 రోజుల కంటె ఎక్కువ ఉండదు. గ్రీన్ యొక్క అంచనాల ప్రకారం-కమతం 21 ఎకరాలు గల లంకషైర్‌లోనే వాతావరణము విషమించిన రోజులలో అదనపు ఆదాయాన్నిచ్చే పని వర ప్రసాదంగా భావింపబడితే, పై పరిస్థితులు గల భారతదేశంలో చెప్పవలసిన పని ఏముంది?

గాంధీజీ చరఖా కార్యక్రమాన్ని రూపొందించిన 1925 ప్రాంతాలలో శ్రీ ఫిండ్లేషిరాస్ లెక్కల ప్రకారము భారతీయుని తలసరి ఆదాయము 116 రూపాయలు మాత్రమే. ఈ పరిస్థితులలో రోజుకుఅణాచొప్పున సంవత్సరానికి 24 రూపాయలైన, నిరాకరించదగిన, లేదా నిరాదరణ చేయదగిన మొత్తం కాదు. కాబట్టే గాంధీజీ గ్రామీణ పునరుద్ధరణకు ముఖ్యంగా చరఖాను చేబట్టటం జరిగింది.

ఈ నాడు తీరు తెన్నులలో అమలులో కొన్ని మార్పులు కనపడవచ్చు కాని గాంధేయ ఆర్థిక దృక్పథం మూల సూత్రాలను ఎవ్వరూ కాదనలేరు. అవి క్లుప్తంగా ఇవి. ప్రతి దేశమూ తన నైసర్గిక పరిస్థితుల రీత్యా వాతావరణ పరిస్థితుల రీత్యా, చరిత్ర, సంప్రదాయాల రీత్యా, తన దేశానికి తగిన ప్రత్యేక పద్ధతులను పెంపొందించుకుంది. తన సౌరశక్తి సంపదను-అది బొగ్గు, నూనె, కొయ్య, జలసంపద, పశు, వృక్ష, మానవ సంపదలతో సహా-ఏ విధంగా వాడాలో నిర్ణయించుకొని-అలా నిలువ చేయబడిన శక్తి వినియోగానికి ప్రస్తుత శక్తి వాడకానికి గల నిష్పత్తిని సర్దుకుంటూ పోవాలి. ఈ దృక్పథాన్ని విడనాడటం ఎంతమాత్రం మంచిదికాదు. దీనికి చేర్పులు, కూర్పులూ, కుదింపులు, మదింపులు ఉండవచ్చు. ఫెయిర్‌గ్రీవ్ చెప్పినట్లుగా, చరిత్రలోని ప్రతి నాగరికతా ఒక దృక్పథంనుంచి చూస్తే, తన సౌరశక్తివి ఉపయోగించటంలోనూ, నిలవచేసుకోటంలోనూ అవలంబింప బడిన వాటివాటి ప్రత్యేక పద్ధతుల యొక్క ఫలితమా అనిపిస్తుంది. 

**శతజయంతి శ్రద్ధాంజలి**

# విక్రమదేవవర్మ



సుప్రసిద్ధ పండితులు, తెనుగుభాషా పోషకులు అయిన జయపూర్ మహారాజా, సాహిత్య సమ్రాట్ డాక్టర్ విక్రమదేవ వర్మ, పర్వతాలపేటలో 1868 జూన్ 28 వ తేదీన జన్మించారు. విశాఖపట్నంలోను, జయపూర్ (ప్రస్తుతం ఒరిస్సాలో కోరాపుట్టి జిల్లాలోవుంది) ఆయన జీవితం గడిపారు. 1931 జూన్‌లో విక్రమదేవ వర్మ సింహాసనం నధిష్టించారు. 1951 ఏప్రిల్ 12వ తేదీన మరణించారు. 60 సంవత్సరాలకు పైగా విద్యారంగానికీ, పండితలోకానికీ ఆయన సాటిలేని సేవచేశారు. గ్రంథకర్తగా, కవిపోషకుడుగా తెనుగుభాషకు ఆయన చేసిన సేవ అపారమైనది.

విశాఖ పట్టణంలోని జగన్మిత్ర నాటకసభలోనూ, కవితా సమితిలో సభ్యులుగానూ డాక్టర్ విక్రమదేవ వర్మ ప్రముఖపాత్ర వహించారు. ఒరియా జాతిలో జన్మించినా ఆంధ్ర ప్రజలకూ, ఆంధ్ర భారతికి ఆయన గణనీయంగా సేవచేశారు. రెండు దశాబ్దాలకు పైగా ఆంధ్ర విశ్వవిద్యాలయానికి లక్ష రూపాయల వార్షిక విరాళం యివ్వడంలోనే ఆయన భాషా పోషకత్వం స్పష్టమవుతున్నది.

జయపూర్ సింహాసనం అధిష్టించకపూర్వం, విశాఖ పట్టణంలో వుంటున్న రోజుల్లో పట్టణంలోనూ, జిల్లాలోనూ సాంఘిక సాంస్కృతికజీవితంలో ఆయన ప్రధాన పాత్రవహించి పనిచేశారు. తునిలో జరిగిన ఆంధ్ర సాహిత్యపరిషత్ సభలకు డా॥ విక్రమదేవ వర్మ అధ్యక్షత వహించారు. జయపూర్ గద్దె ఎక్కకముందే ఆయన సంఘంలోనూ, సాహిత్యరంగంలోనూ ఆశ్రితులకు ఉదారంగా విరాళాలు యిచ్చేవారు. కాని తన వితరణశీలానికి ఏ విధమైన ప్రచారం ఆశించేవారు కారు. 1931 వరకు స్వరాజ్యోద్యమాన్ని బలపరిచారు.

రాజుగా వున్నప్పుడూ, లేనప్పుడూకూడా ఆయన అందరికీ అందుబాటులో వుండేవారు. ఎవరితోనైనా సరదాగా మాట్లాడడం దయాస్వభావంతో మేలుచేయడం ఆయన సుగుణాలు. జమీందారీ కుటుంబంలో పుట్టినా ఆయన నిరాడంబరంగా వుండేవారు. ఆలోచనలో మాత్రమే ఉన్నతుడుగా ఉండేవారు. ఏటేటా జరిగే దసరా ఉత్సవాల్లో ఉదారంగా విరాళాలుయిస్తూ రెండు భాషలకు చెందిన సాహిత్యవర్గాలకు ఆయన గౌరవభాజకుడుగా వుండేవారు. ఆయన తరచు జరుపుతూ వుండే కవి దర్బారులలోకూడా కవి పండితుల ప్రేమ గౌరవమునకు ఆయన పాత్రులైనారు. ఈ విధంగా ఒరియా ప్రజలకూ, ఆంధ్రులకూ మధ్య సామరస్య భావనకు వంతెనగా డా॥ విక్రమదేవ వర్మ ప్రజాసేవ చేశారు.

తెలుగు, ఒరియా, హిందీ, సంస్కృత భాషలలో డాక్టర్ విక్రమదేవ వర్మ సుప్రసిద్ధులైన పండితులు. సంగీతం, నృత్యం, జ్యోతిషం, వైద్య విషయాలలోనూ, యితర సాంస్కృతిక రంగాలలోకూడా ఆయనకు గొప్ప పాండిత్యం వుండేది. 'అజాతశత్రువు", "రాజర్షి", "ఆధునిక జనక మహారాజు" అంటూ ఆయనను అన్ని వర్గాల ప్రజలు గౌరవించేవారు. ధర్మ ప్రభువులైన హిందూరాజుల ఔదార్యమూ, ధర్మ కార్య దీక్ష ఆయనలోవుండేవి.

ఇటు మద్రాసునుండి అటు కటకంవరకు సాంస్కృతిక కార్యక్రమాలు ఏవిజరిగినా ఆయననే అధ్యక్షులుగా ఆహ్వానించేవారు. వివిధ విషయాలనుగురించి ఆయన చేసిన చర్చలు ఆలోచనాత్మకంగా వుండేవి. గిడుగు, గురజాడ, సాంఖ్యాయనశర్మ, వసురాయకవి, వేదం వేంకటరాయశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి వంటి సుప్రసిద్ధ తెలుగు కవి పండితులు ఆయన సమకాలీనులు. మారేపల్లి రామచంద్రకవి, సెట్టి లక్ష్మీనరసింహం, డా॥ బుర్రా శేషగిరిరావు, ఉమర్ ఆలీ షా, త్రిపురాన ప్రసాదరాయకవి మొదలగు ప్రముఖులుకూడా ఆ కాలంవారే.

కళింగ ప్రాంతంలో విక్రమదేవ వర్మ 50 సంవత్సరాలకు పైగా సాంఘిక, సాంస్కృతిక రంగాలలో ఒక వ్యక్తిగాకాక ఒక నిర్మాణాత్మక ఉద్యమంగా తన ప్రభావాన్ని ప్రసరింపజేశారు. "నిష్కామ కర్మ" కు ఉదాహరణగా ధన్యజీవితం గడిపారు. డా॥ విక్రమదేవ వర్మ అంటే ఆ కాలంలో ఔదార్యానికి, ఈవికి, సచ్ఛీలానికీ పర్యాయపదంగా వుండేది. ధర్మకార్య తత్పరతతో 83 ఏండ్ల సంపూర్ణజీవితం అనుభవించి 1951 లో ఆయన పరమపదించారు.



## చైతన్యమూర్తులు

### లోకమాన్య బాల గంగాధర తిలక్



భారత స్వాతంత్ర్య మహాయజ్ఞంలో 'స్వరాజ్యం నా జన్మ హక్కు' అనే మంత్రాన్ని పఠించినవాడు బాలగంగాధర తిలక్. ఆయన మహారాష్ట్రంలోని కొంకణ ప్రాంతంలోని రత్నగిరిలో 1856 జులై 23వ తేదీని జన్మించారు. ఆయన తండ్రి గంగాధర రావు ఆ ఊరి పాఠశాలలో ఉపాధ్యాయుడు. చిన్న నాటి నుంచి ఆయన బాలగంగాధరునిచేత శ్లోకాలు కంఠస్థం చేయిస్తూఉండేవాడు.

లాయరు పరీక్షలో ఉత్తీర్ణుడైనా తిలక్ ఫెర్గూసన్ కళాశాలలో గణితాధ్యాపకునిగా పనిచేశాడు. ఆయన మనస్సు దేశ స్వాతంత్ర్య సాధనకోసం తపనపడేది. 'కేసరి' అనే మరాఠీ పత్రికను 'మరాఠా' అనే ఆంగ్ల పత్రికనూ నడిపి ఆయన మహారాష్ట్రములో చైతన్యం కలిగించాడు.

మహారాష్ట్రంలో గణేశోత్సవాలనూ, శివాజీ జన్మదినోత్సవాలనూ ప్రారంభించి ప్రజలలో ఉత్సాహాన్ని పెల్లుబికించాడు. గోపాలకృష్ణగోఖలే, మహాదేవ గోవిందరెనడె వంటి మితవాదుల ధోరణి ఆయనకు నచ్చలేదు. సూరత్ కాంగ్రెసులో ఆయన నిర్వహించిన పాత్రవల్ల కాంగ్రెసు సంస్థ అభ్యర్థనలుచేసే సంస్థగా గాక స్వతంత్ర జాతీయ సంస్థగా మారింది.

లోకమాన్యుడు 'అగాధసముద్రం' అని వర్ణించాడు గాంధీజీ. ఆయన వాస్తవంగా జ్ఞానసముద్రుడే. పరిపాలనలోని దోషాలనూ, విదేశీయ సంస్కృతిలోని లోపాలను ఆయన గ్రహించాడు. విద్యార్థులలో వ్యాయామాసక్తిని కలిగించి దేశభక్తిని రేకెత్తించాడు. లోకంలో గీతా మహత్త్వాన్ని ప్రచారంచేశాడు. ఆనాటి విప్లవాదులైన యువకులు, చేత గీతనుపట్టుకొని ఉరి స్తంభాల మీద యెక్కడానికి సిద్ధపడ్డారు ప్రభుత్వానికి తిలక్ అంటే సింహస్వప్నం అయింది. 1902లో ఆయనను శిక్షించి మాండలే జైలుకు పంపించారు. ఆ జైలులో ఉండినప్పుడే ఆయన 'గీతా రహస్యం' అనే ఉద్గ్రంథం రచించారు. జైలునుంచి విడుదల ఐన తరువాత ఆయన 'హోమ్ రూల్' ఉద్యమం నడిపించారు.

తిలక్ నిర్యాణం చెందినప్పుడు గాంధీజీ ఇలా అన్నారు: "అలాంటివాడు చనిపోయాడని అనడం అభక్తి, అమర్యాద అనిపించుకొంటుంది. ఆయన తత్వం మనలో శాశ్వతంగా ఉండిపోతుంది. భారత దేశపు ఏకైక లోకమాన్యుడైన ఆయన ధైర్యం, నిరాడంబరత, అద్భుత పరిశ్రమ అసమాన దేశభక్తి అనే లక్షణాలను పెంపొందించుకోవడమే మనం ఆయనకోసం నిర్మించే స్మారక చిహ్నం కాగలదు."

---ఎం. పద్మావతి

### అల్లూరి సీతారామరాజు



పోలీసు బలగం, సైనిక పటాలం, తుపాకులు, ఫిరంగులు–ఇన్ని హంగులూ వుండికూడా ఆంగ్లేయ పాలకులు ఒకే ఒక వ్యక్తిని–ఓ మూడు వందలమంది అనుచరులతో కొద్దిపాటి బాణాలూ, యీటెలూ, తుపాకుల అండతో నిలచిన ఒకే ఒకవ్యక్తిని ఎదుర్కొవడానికి రెండేళ్ళపాటు శ్రమించారంటే చాలా ఆశ్చర్యంగానే వుంటుంది. నిజానికి బలాన్ని బలంతోనే జయించగలం. అంటే తలతన్నేవాడిని తాడితన్నేవాడు జయిస్తాడు. అయితే అల్లూరి సీతారామరాజు విషయంలో మాత్రం యిది నిజం కాలేదు. ఎన్ని తుపాకులు పేల్చినా, ఎంత పోలీసు బలగాన్ని పెంచినా సీతారామరాజు విషయంలో అవి ఎందుకూ కొరగాకుండా పోయాయి. మన్యం పితూరీని అణచడానికి ఆంగ్లేయ పాలకులకు 40 లక్షల రూపాయలయ్యింది. అదిన్నీ నాలుగున్నర దశాబ్దాల క్రిందటిమాట. అంటే

ఇప్పటి రూపాయికన్న ఆనాటి రూపాయి ఎన్నోరెట్లు ఎక్కువ విలువగల రోజులవి. నిజంగా అల్లూరి సీతారామరాజు అసాధారణ వ్యక్తి!

సీతారామరాజుకు చిన్నప్పుడు స్కూల్లో సరిగా చదువు ఎక్కలేదు. సన్యాసి కావాలని లోలోపల అతనికి ఓ చిన్న కోరిక మెదులుతూ వుండేది. పుణ్యక్షేత్రాలను సందర్శిద్దామని బయలు దేరాడు. కాశి, హరిద్వారం, బ్రహ్మకపాలం సందర్శించి విశాఖ జిల్లాలోని కృష్ణదేవీపేటకు తిరిగి వచ్చాడు. ఆ గ్రామంలోని నీలకంఠేశ్వర దేవాలయం వద్ద సన్యాసిగా కూర్చునేవాడు.

ఈ బాలయోగి నిష్ఠాగరిష్ఠలు అక్కడి కోయ ప్రజలను, గిరిజనులను ఆకర్షించాయి. వారు పాలూ పళ్ళూ తెచ్చి ఎంతో భక్తి ప్రపత్తులతో ఆయనకు అర్పిస్తుండేవారు. అల్లూరి సీతారామరాజు జన్మతః క్షత్రియుడు కావడం వలన ఆయనలో ధైర్య సాహసాలు మూర్తీభవించాయి. కత్తియుద్ధంలోనూ, ధనుర్బాణాల ప్రయోగం లోనూ, గుర్రపుస్వారీలోనూ బాగా ఆరితేరినవాడయ్యాడు. హస్తసాముద్రికం కూడా ఆయనకు వచ్చు. జ్యోతిషం తెలుసు. వనమూలికలతో రోగాల్ని పోగొట్టడం నేర్చుకున్నాడు.

గిరిజనులు అతని వద్దకు మందుమాకులు తీసుకుందామనో, సలహా పొందుదామనో వచ్చినప్పుడు వారి సమస్యలను అతనికి చెప్పుకునే వారు. వారి కష్టాలను అతని ముందు వెళ్ళబోసుకునేవారు. పోలీసు అధికారులు, అటవీశాఖాధికారులు యీ గిరిజనుల్ని చీటికీ మాటికీ బాధిస్తుండేవారట. ఆ అమాయక గిరిజనుల్లో సీతారామరాజు ఆత్మవిశ్వాసాన్ని కలిగించాడు. ధైర్యాన్ని నూరిపోశాడు. ఒక విప్లవానికి సమాయత్తం చేశాడు. ఆంగ్లేయ పాలకుల రాక్షస పాలననుండి మన్యం ప్రాంతానికి విముక్తిని ప్రసాదించి భారత స్వాతంత్ర్య సముపార్జనకు ప్రథమసోపానాన్ని నిర్మిద్దామనుకున్నాడు సీతారామరాజు.

1922 ఆగస్టు 22న చింతపల్లి పోలీసుస్టేషనుమీద అల్లూరి సీతారామరాజు అకస్మాత్తుగా మెరుపులా దాడిచేశాడు. మర్నాడు కృష్ణదేవీపేట పోలీసుస్టేషను అతనికి వశమయ్యింది. ఆ తర్వాత ఒమ్మంగి పోలీసుస్టేషను కూడా అతని వశమైంది. తుపాకులు, మందుగుండు సామగ్రిని ఆయన హస్తగతం చేసుకున్నాడు.

ముందుగా చెప్పి మరీ దాడి చేసేవాడు సీతారామరాజు. పోలీసులు లొంగిపోవడంకన్న మరోదారేవుండేది కాదు. అయితే వాళ్ళ కెప్పుడూ ఆయన హానిచేయలేదు.

1923 ఏప్రెల్ 17వ తేదీన అన్నవరం పోలీసుస్టేషను అల్లూరి సీతారామరాజుకు లొంగిపోయింది. ప్రజలు అతనికి స్వాగతం పలికారు. వీరాధి వీరునిగా ఆరాధించారు. సీతారామరాజుకు ఘనంగా స్వాగతమివ్వడానికై అన్నవరం, శంఖవరం గ్రామాల్లో రూ 4,000 పునిటివ్ టాక్స్ను కూడా వసూలు చేశారు. సీతారామరాజు సాహసగాథలు అసంఖ్యాకంగా వున్నాయి. రోజుల తరబడి వాటిని చెప్పుకోవచ్చు.

అహింసాయుత మూర్తి, శాంతి ప్రవక్త అయిన గాంధీజీ సైతం సీతారామరాజును వీరునిగా, మాతృదేశ యోధునిగా పొగడకుండా వుండలేక పోయారు. నిజంగా సీతారామరాజు విప్లవ వీరుడు. తన దేశానికి తను నమ్మిన బాటలో సేవచేసిన స్వాతంత్ర యోధుడు.

## పొట్టి శ్రీరాములు




పొట్టి శ్రీరాములు వంటి కార్యదీక్షాపరులు ఓ పదిమందిని తనకు యిస్తే ఒకఏడాదిలోగా స్వరాజ్యాన్ని సాధించగలనని మహాత్మాగాంధి చెప్పారు. అంత గణనీయులైన పదిమందిలోనూ ఒకరుగా పేర్కొనబడిన యీవ్యక్తి ప్రత్యేకత ఏమిటి? అలాంటి వ్యక్తులు మరో తొమ్మండుగురు లేనేలేరంటే ఆవ్యక్తి ఎలాంటి వాడై వుంటాడు?

పొట్టి శ్రీరాములుగారు 1920లోనే చక్కటి రైల్వే ఉద్యోగాన్ని వదులుకుని, గాంధీజీ నెలకొల్పిన సబర్మతి ఆశ్రమాన్ని చేరుకున్నారు.

అహింసలోంచే-అంటే ప్రేమలోంచే-నిస్వార్థ సేవ ప్రాణం పోసుకున్నదని పొట్టిశ్రీరాములుగారి విశ్వాసం సత్యాహింసల ద్వారానే మన స్వరాజ్యం సాధించగలమని, పరిపోషించగలమని మనమంతా గట్టిగా విశ్వసించి అందుకు కృషిచేసినప్పుడే నేను కోరే స్వరాజ్యం సిద్ధించగలదని చెప్పిన జాతిపితకు పొట్టి శ్రీరాములుగారు అక్షరాలా నిజమైన శిష్యులు.

సత్యాగ్రహికి, గ్రామసేవకునికి ఏ ఏ గుణాలు వుండాలని గాంధీజీ భావించారో ఆ లక్షణాలన్నీ పొట్టి శ్రీరాములుగారిలో

ముమ్మూర్తులా మూర్తీభవించివున్నాయి, భగవంతునిమీద నమ్మకం సత్యా, హింసలమీద విశ్వాసం, లక్ష్యసాధనకై తన సర్వస్వాన్నీ చివరకు తన ప్రాణాన్ని సైతం త్యాగంచేయడానికి సిద్ధపడడం– ఇవన్నీ శ్రీరాములుగారిలో మూర్తీభవించాయి. అంతేకాదు గాంధీజీ ఉద్దేశించిన ఖద్దరు వస్త్రధారణ మద్యపాన నిషేధంమీద ఆయనకు పూర్తి విశ్వాసం వున్నది.

అహింస, సత్యవ్రతం ఆచరణ, దొంగతనం చేయకుండడం, బ్రహ్మచర్యంపాటించడం, వైభావాలమీద ఆశలేకపోవడం, కష్టపడి పనిచేయడం, ఉద్రేకాలనుఅణుచుకోగలగడం, నిర్భీతి, అన్నిమతాల మీద సమాన గౌరవం, స్వదేశీ వస్తువుల వాడకం, అన్నదమ్మల వలె మెలగగల సహృదయత–యివి గ్రామసేవకునికి వుండవలసిన లక్షణాలని గాంధీజీ ప్రవచించివున్నారు. ఈ లక్షణాలన్నీ పొట్టి శ్రీరాములుగారిలో వున్నాయి. గాంధీ ఆశ్రమంలోనూ, కొమరనోలు, రాజకోట్‌లలోనూ ఆయన గ్రామీణుల అభ్యున్నతికి విశేషంగా కృషిచేశారు. 1938లోనూ, 1942లోనూ సత్యాగ్రహంచేసి కారాగార శిక్ష అనుభవించారు.

గాంధీజీకి నిజమైన అనుయాయుడుగా పొట్టి శ్రీరాములుగారు 1944లో నెల్లూరును కేంద్రంగా చేసుకుని ఖాదీవ్యాప్తికి తీవ్రంగా కృషిచేశారు. హరిజనులు వారి హృదయానికి అత్యంత సన్నిహితులు. హరిజన సంక్షేమానికి ఆయన ఎంతగానో తోడ్పడ్డారు తొలిసారిగా వారుచేసిన నిరాహారదీక్ష హరిజనులకొరకే, నెల్లూరులోని వేణుగోపాలస్వామివారి ఆలయంలో హరిజనులకు ప్రవేశాన్ని కల్పించడానికై శ్రీరాములుగారు తమ తొలి నిరాహారదీక్షను కావించారు. తద్వార హరిజనులకు ఆలయ ప్రవేశాన్ని కల్పించ గలిగారు

1952 అక్టోబరు 19న ప్రత్యేక ఆంధ్రరాష్ట్రాన్ని సాధించే నిమిత్తం ఆమరణ నిరాహార దీక్ష ప్రారంభించారు. రోజులు గడిచాయి. వారాలు దొర్లిపోయాయి.

తను సత్యమని నమ్మినదాని గురించి ఒకానొక ఉద్రేకంలో ఏ వ్యక్తయినా తన ప్రాణాన్ని అర్పిస్తే అర్పించవచ్చు. యుద్ధంలో ధైర్యంతో పోరాడి వీరావేశంతో ప్రాణాలు కోల్పోవడానికి కూడా వెనుకంజ వేయకపోవచ్చు. కొద్దిసేపు బాధతో మృత్యువు కౌగలించుకుంటే ఒకవిధంగా అది అదృష్టమే. కాని యిదేమిటి? శరీరంలోని ప్రతి అంగుళాన్నీ, మనసులోని ప్రతి ఆలోచననీ మృత్యువు కబళిస్తూ హింసిస్తూ నిమిషాల తరబడి, గంటల తరబడి, రోజుల తరబడి చివరకు వారాల తరబడి బాధిస్తూవుంటే ఆ బాధను భరించడం అంటే మాటలా! యాభై ఎనిమిది రోజులపాటు అలా శ్రీరాములుగారు గడిపారు. అప్పటికీ ఆయన లొంగిపోలేదు. రాజీపడలేదు, ప్రాయోపవేశాన్ని ఉపసంహరించుకోలేదు. ఆమరణ నిరాహార దీక్షను ఆయన మధ్యలో వదలివేయలేదు. ఆయన వదలివేసిందల్లా యీశరీరాన్ని, డిశంబరు 15న ఆయన ప్రాణవాయువు అనంత వాయువుల్లో కలిసిపోయింది.

పొట్టి శ్రీరాములుగారి ఆత్మార్పణతో 1953 అక్టోబరు 1న ఆంధ్రరాష్ట్రం సిద్ధించింది.

# నాటి గాంధీ సాహిత్యం

—ఆచంట వేంకట సాంఖ్యాయనశర్మ

అన్న వస్త్రములకు ఆధారమనుకున్న
ప్రత్తి విదేశాల పాలబడియె
కూరనారలకేమి కొదువనుకొను గోగు
పంట విదేశాల పాలబడియె
పాడిపంటల కాట పట్లనుకొనియున్న
పసులు విదేశాల పాలబడియె
ధనధాన్యములకు నిదానమ్మ గానున్న
పసిడి విదేశాల పాలబడియె
భారతీయులకికముందు బ్రదుకు తెరువు
నూలువడుకుటయని తెల్ప నూర నూర
నాడునాడుల గాంధిరాట్నముల కిట్టు
సీమవారికి బొడమంగ జేసె గుట్టు.

# నా స్మృతి పథంలో . . .

# కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

పండ్రంగి రాజేశ్వరరావు

దాతలలో అనేక రకాల వారుంటారు. కొందరు పిల్లికి బిచ్చము వెయ్యకుండా కూడబెట్టి ఏదో ఒక సంస్థకు భూరి విరాళం యిస్తారు. మరికొందరు అడిగిన వాళ్ళకు లేదనకుండా తోచినంత యిస్తూ వుంటారు. కొందరు కటువుగా మాట్లాడి యిస్తారు. మరి కొందరు మార్దవంగా సానుభూతితో యిస్తారు వారి దాన ధర్మాలు వేరుపరచేవి కాకుండా సమన్వయ పరుస్తాయి. అట్టివ్యక్తి శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు. మాంట్రియాల్ (కెనడాలోని నగరంలో) బెడ్డ విసరితే చర్చి శిఖరానికి తగులుతుందనే సామెత వుంది. ఆ పట్టణం అంతా చర్చిలమయం. అట్లాగే నాగేశ్వరరావు గార్ని అర్థించిన వ్యక్తులు, సంస్థలు ఆంధ్రదేశమంతటా వున్నాయి.

వీరు రెంటాల వెంకట సుబ్బారావుగారి మేనగోడల్ని వివాహంచేసుకోవటం ద్వారా వారినుంచి వ్యాపార దక్షత విజ్ఞాన విశేషాలు పదిమందిని చేర్చి ఆదరించడం అలవరచుకున్నారు. వృత్తితః వ్యాపారులైనా యీషణత్రియాలలో ప్రధానమైన ధనేషణ ఎడ వీరికి మమకారం వుండేదికాదు. అమృతాంజనంద్వారా లక్షల ఆదాయం వస్తూవున్నా లెఖ్ఖ లేకుండా ఖర్చుచేయటంచేత అప్పులుకూడా వుండేవి. చేతిలో డబ్బులేనపుడుసహితం పెద్ద పెద్ద బాధ్యతలు నిర్వహించేవారు. సంకల్ప సిద్ధులవటంచేత తలపెట్టిన పనులు నెరవేరి కృతకృత్యులయ్యారు. ఉప్పుసత్యాగ్రహ సందర్భములో తాము ఆరునెలలు జైలులోవుండి వచ్చేసరికి యాబదివేలు అప్పుతీరిందని అన్నారు. "ఆంధ్రపత్రిక"ను అమృతాంజనం ప్రకటనకు బొంబాయిలో వారపత్రికగా స్థాపించినా మదరాసుకు తీసుకువచ్చి దినపత్రికగా చేశారు. అదే మన ప్రథమ జాతీయ దినపత్రిక. ఆంధ్రలో తొలి స్వాతంత్ర్య వీరుడుగా పేరొందిన శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావు గార్ని తొలి సంపాదకులుగా నియమించడం ద్వారా చక్కటి ఔచిత్యాన్ని పాటించారు. తదుపరి సంపాదక వర్గంలో పనిచేసిన సర్వశ్రీ కొండా లి శివరామకృష్ణరావు, చల్లా శేషగిరిరావు, వెదురుమూడి శేషగిరిరావు ప్రభృతులంతా ఆంధ్రోద్యమమునకు సన్నిహితులే. ఆపుడు పత్రికా ప్రచురణ లాభసాటైన పరిశ్రమకాదు, త్యాగముతో కూడుకున్న సాహస కార్యము.

1930 వ సంవత్సరము వరకు 'ఆంధ్రపత్రిక'చందాదారుల సంఖ్య అయిదువేలు దాటలేదు పల్లెటూళ్ళకు ఒక ప్రతివస్తే ఏ గుడిఅరుగు మీదో కూర్చుని ఒకరు చదువుతూవుంటే అంతా వినేవారు. గ్రంథాలయాలకు, సంఘాలకు అడగటం తరువాయిగా వుచితంగానో సంఘం చందాకో పంపుతూ వుండేవారు. దానికి వార పత్రికను, మాసపత్రిక అగు 'భారతి'ని జోడించారు. 'కృష్ణాపత్రిక'ను తప్పిస్తే



కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

ఆంధ్రుల అభిమానాన్ని చూరగొన్న మరో పత్రిక ఆ నాడు లేదు. శ్రీ అవుటపల్లి నారాయణరావు బర్మానుంచి తిరిగి వచ్చాక వీరినీ, శ్రీ ముట్నూరి కృష్ణారావుగారినీ ప్రముఖ సంపాదకులని ఘనంగా సన్మానించారు వీరు నిష్ణాతుల అభిప్రాయాన్ని సేకరించి పాటించేవారు. విప్లవ వీరుడైన శ్రీ భయంకరాచారి సంస్కృతంలో తాము వ్రాసిన గ్రంథం ప్రతి చూపగా అందు పై పండితులైన శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తి అభిప్రాయం వచ్చాక ఆదరించారు.

1926 లో వీరిని భీమవరం తాలూకా బోర్డువారు ఘనంగా సన్మానించినపుడు నేను తొలుత చూచాను 1930 లో జరిగిన ఉప్పు సత్యాగ్రహ సందర్భంలో తిరుచునాపల్లి జైలులో వుండగా వీరితో వ్యక్తిగత సాంగత్యంకలిగింది. అపుడు వారు 'ఎ' క్లాసులో వుండుటచేత తమకు వచ్చేవూరగాయలు, తినుబండారాలు మాకు తరలించేవారు. ఒకసారి ఆంధ్ర-తమిళ సత్యాగ్రహ ఖైదీల నడుమ స్పర్థరాగా వీరు, ఆంధ్ర కేసరి ప్రకాశంగారు వచ్చి సరుబాటు చేశారు. శిక్షాకాలము పూర్తియ్యాక తిరిగివస్తూ నేను బొంబాయికి చెందిన శ్రీ మాత్రే అనే పట్టభద్రుడు మన ప్రాంతానికి చెందిన మరో నలుగురు కలిసి మదరాసులో వీరివద్ద దిగాము. అంతకు పూర్వం మాలో ఎవ్వరము చెన్నపట్నం చూచినవారముకాదు. మాకు ముందర విడుదల అయినవారు సహితము వీరివద్ద ఆగి సకల మర్యాదలు పొంది వెళ్ళినట్లు విన్నాము. వసతి, వాహన, భోజన సౌకర్యాలు ఏర్పాటుచేసి మనిషినిచ్చి వూరంతా చూపించారు. మరునాడు శ్రీబాగ్‌లో తలంట్లు అయ్యాక వారి సహపంక్తిని షడ్రసోపేతంగా పిండివంటలతో భోజనం పెట్టించారు రైలుకు వెళ్ళేటప్పుడు అందరకు చెరో అయిదురూపాయలు చేతిఖర్చుకు యిచ్చారు.

ఆదరణ, అన్నదానం అందరినీ ఆకర్షిసాయి. నేటివలె వారు ఆ పని వ్యాపార దృష్టితో చేయలేదు 1963 లో ప్రముఖ పారిశ్రామికవేత్త అయిన శ్రీ గుజ్జరుమల్ మోదీకి శ్రీప్రకాశతో నేను అతిథిగా నుండగా అధికారంలో వున్న పెద్దలు వారికి ఎట్లా ఋణపడియున్నది వివరంగా విని ఆశ్చర్యపోయాను. నేటి శ్రీమంతులు మామూలు మనిషిని మర్యాదచెయ్యరు. గుమ్మంలో కుక్క వున్నది జాగ్రత్తఅనే బోర్డు ప్రత్యక్షమవుతుంది. వారి పెట్టుబడికి పదిరెట్లు లాభం రావాలంటారు. జాతీయ సమరం కాలంలో శ్రీమంతులు ధార్మికంగా వుండేవారు, నాగపూరు జెండా సత్యాగ్రహ సందర్భంలో శ్రీ జమన్‌లాల్ బజాజ్ (వీరు కాంగ్రెసుకు చాలాకాలం కోశాధికారిగా వుండిరి గాంధీజీ అడగటం తరువాయిగా వేలు గుమ్మరించేవారు. బ్రిటిషు ప్రభుత్వము వీరికి సంకెళ్లు వేసి రెండు మైళ్లు నడిపించి జైలులో 'సి'క్లాసు యిచ్చారు) సత్యాగ్రహులను ఆదుకుని ఆదరించిన తీరు చరిత్రాత్మకమైనది. అందువల్ల వారి సిరిసంపదలు యినుమడించాయి.

అట్లాంటి ప్రోత్సాహము, ఆదరింపు లేనిచో జాతీయోద్యమం ఆనాడు విజయవంతం అయ్యేదికాదు. ఆ రోజుల్లో దేశభక్తి పెల్లుబికేది. ఒక జైలునుండి మరొక జైలుకు బదిలీ అవుతున్న సందర్భమున ఒక పెద్దమనిషి తన వద్దనున్న యావత్తు పైకముతోను మాకు తినుబండారములను కొని యిచ్చారు. మరి యిద్దరకు ఫలహారము తక్కువ కాగా హోటలు యజమాని వుచితముగ ఇచ్చాడు ఇట్టి సౌభ్రాతృత్వము నేడు మృగ్యమైనది. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షపదవిని చాలకాలము శ్రీనాగేశ్వరరావుగారు సంతృప్తికరముగ నిర్వహించిరి. రాయలసీమవారు తొలుత ఆంధ్ర రాష్ట్రముకు విముఖులుగ నుండగ వీరి యింటియందే సంతృప్తికరమగు ఒడంబడిక జరుగగా దానికి 'శ్రీ బాగ్ ఒప్పందము' అను పేరువచ్చెను. ప్రథమ ప్రపంచ యుద్ధ సమయమందు అమెరికను అధ్యక్షుడగు వుడ్ రావిల్సనుకు మదరాసు హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తియగు సర్. యస్. సుబ్రహ్మణ్య అయ్యరు భారత దేశముకు స్వయం నిర్ణయాధికారము, స్వపరిపాలన కావలెనని వ్రాసిన ఘాటైన లేఖలో శ్రీ కొండా వెంకటప్పయ్యతో పాటు వీరును సంతకముచేసిరి.

## సారస్వత సేవ

వీరి సారస్వత సేవ బహుముఖమైనది. అనేక మంది కవులు, పండితులు వీరి ప్రాపుతో పైకివచ్చిరి. వీరికి ప్రతి విషయమును గురించి ఖచ్చితమగు అభిప్రాయములున్నను యితరుల అభిప్రాయములను మన్నించి గౌరవించెడివారు. వీరిది రాగద్వేష రహితమైన వేదాంత దృక్పథము. శాంత స్వభావులు సత్వగుణ సంపన్నులు అగుటచేత వీరెవ్వరితోను ఘర్షణపడలేదు.

జీవించి యుండగనే అందరి మన్ననలను పొందిరి. ఆంధ్ర విశ్వ విద్యాలయము వీరిని కళా ప్రపూర్ణ బిరుదముతో సత్కరించెను. వీరి నాంధ్ర భోజులనవచ్చును. వీరి దాన ధర్మములకు పరిధిలేనందున విశ్వదాతగ పేర్గాంచిరి. దేశోద్ధారకులనుటలో అతిశయోక్తిలేదు. అత్యధిక సంఖ్యాక బలముతో కేంద్ర శాసన సభ సభ్యులైరి. వీరిది సమగ్ర జీవితము. అన్ని విధముగ ధన్యులు. గాంధీజీకి వీరియెడ ప్రత్యేకాభిమానముండెడిది.

చాలమంది ధన మార్జించెదరు. కొద్దిమంది మాత్రమే అట్టి ధనమును సద్వినియోగము చేయుదురు. అట్టివారిలో శ్రీ నాగేశ్వరరావు ముఖ్యులు. ఇపుడు వారి శత వార్షికోత్సవము జరుగుచున్నది. అందరు వారియెడ తమకుగల గౌరవాభిమానములను తెల్పుకొనవలసిన తరుణమిది. ఇట్టి ప్రజా నాయకుల పవిత్ర స్మృతి చిరస్థాయిగ నుండగలదు.



# మహాభారతము

తెన్నెగంటుల లక్ష్మణశాస్త్రి

అస్త్రములను సంపాదించుటకు అర్జునుడు ఇంద్రలోకమునకు పోయిన తరువాత పాండవులు ద్రౌపదితో పాటు కామ్యకవనము నందు నివసించుచుండిరి. వారు ఒకనాడు రాజ్యము పోవుట వలన, అర్జునుడు దూరదేశమునకు పోయినందు వలనను మిక్కిలి దుఃఖించుచు కూర్చొని యుండిరి. అపుడు భీముడు ధర్మరాజుతో ఇట్లనెను;

" రాజా ! మీ ఆజ్ఞ చేతనే అర్జునుడు తపస్సు చేయుటకు పోయెను. మన ప్రాణములన్నియు అతని యందే నిలిచి యున్నవి. అతడు నశించినచో మనమేకాక పాంచాలురు, యాదవులు కూడ నాశనము చెందుదురు. అర్జునుడు అనేక కష్టములనుభవించుచు తపస్సు చేయుచున్నాడని మన కందరికిని మిగుల దుఃఖము కలుగుచున్నది. ఎందుకనగా "అతని భుజ బలమునే ఆధారముగ గైకొని మనము శత్రువులను లక్ష్యము చేయకున్నాము. అతనిని, కృష్ణుని సహాయముగ గైకొని శత్రువులను ఓడించి తిరిగి మన రాజ్యమును సంపాదించుకొని ఏల గలము" అను విశ్వాసముతో నున్నాము. మీరు చేసిన జూదపు దోషముచేత మేము బలవంతులమై యుండియు దీనులమై పడి యున్నాము. జూదములో గెలిచిన సంపద చేత శత్రువులు బలసియున్నారు. మనము దీనులమై యిట్లు అడవిలో నివసించుట క్షత్రియ ధర్మము కాదు. రాజ్య మేలుటయే క్షత్రియునకు ఉత్తమ ధర్మము. ఈ ధర్మము మీకు తెలియునిది కాదు. కనుక నీవు ధర్మ మార్గమును విడువకూడదు. ఈ పన్నెండేండ్ల కాలము ముగియు లోపలనే మనము కృష్ణార్జునుల సహాయముతో శత్రువులను ఓడించి రాజ్యమును సంపాదించవచ్చును. నాకు ఆజ్ఞ యిమ్ము. శత్రువులందరిని సంహరించి వచ్చెదను. నీవు ఈ వనవాస నియమమును పాలించిన తరువాతనే రాజ్యము నకు రావచ్చును. దానిచేత నీకు అసత్య దోషము కూడ అంటదు. ఒకవేళ శత్రునాశమువలన మనకేదైనా పాపము అంటినచో దానిని మనకు రాజ్యము వచ్చిన తరువాత అనేక యజ్ఞములు చేసి ఆ పాపమును పోగొట్టుకొన వచ్చును. నీకు ధర్మము తెలియును. నా సలహాను నీవు పాటించినచో, " నీవు అవివేకివి" అను జనాప వాదము నుండి దూరముగా నుండగలవు. " దుష్టగుణమును దుష్టత్వము చేతనే నశింపజేయవలయును " అను సిద్ధాంతము ఉన్నది. అట్లు చేయుట వలన పాపము అంటదు.

మహారాజా ! ధర్మజ్ఞులు " ఒక దినము ( రాత్రి-పగలు) ఒక సంవత్సరముతో సమానము " అని చెప్పిరి. కనుక అతి కఠినమైన వ్రతములచేత పదుమూడు దినములు మనము గడిపి నప్పుడే మన పదమూడేండ్ల వన-అజ్ఞాతవాస సమయము గడిచి పోయినట్లుగా భావించవలయును. ఇది వేద సమ్మతమైన విష యము. ఇప్పుడు మనము దుర్యోధనాదులను సంహరించి రాజ్యము చేపట్టవలసిన కాలము ఆసన్నమైనది. కనుక పదుమూడేండ్ల కాలము వేచి యుండవలసిన అవసరము లేదు. రాజా ! నీవు జూదపు వ్యసనములో పడి మమ్మందరిని సంకటములో పడవేసి తివి. అజ్ఞాతవాసములో దుర్యోధనుడు మనను కనుగొనజాలని చోటు ఉండదు. ఏదో విధముగా కుట్రలు పన్ని గూఢాచారుల ద్వారా మనను కనుగొని మనకు తిరిగి పదమూడేండ్ల శిక్షను అతడు తప్పక విధించి తీరును. ఒకవేళ మనము ఆ గడువును దాట గలిగినచో అతడు ఓర్వలేక తిరిగి నిన్ను జూదమాడుటకు పురి గొల్పగలడు. అప్పుడు నీవు అతని మాట కాదనజాలవు. ఈ సత్యము యిదివరకే, నీవు రెండవసారి జూదమునకు పోయి నప్పుడు మాకు ధ్రువపడినది. జూదములో ఆరితేరిన శకుని నిన్ను తిరిగి ఓడించి మనందరను మరల అడవులపాలు చేయకమానడు. మహారాజా! నీవు మమ్ము జీవితాంతము హీనముగా, దీనముగా ఉంచదలచినచో ధర్మమునే పాటించుచుండుము. కపటిని కటపము చేతనే చంపవలెను. కనుక నీవు ఆజ్ఞ ఇచ్చినచో గడ్డి వామిలో పడిన అగ్ని, వాయువు సహాయముతో వామిని భస్మము చేసినట్లు నేను శత్రుసైన్యముపై బడి నా బలము యొక్క సహాయముతో దుర్యోధనాదులను అంతమొనరించెదను. కనుక నాకు ఆజ్ఞ ఇమ్ము."

ఇట్లు పలుకుచున్న భీమసేనుని చేరదీసుకొని ధర్మరాజు ఊరడించుచు ఇట్లనెను;

"నాయనా ! నీవు పదుమూడేండ్ల తరువాత అర్జునుని సహాయముతో యుద్ధమునందు దుర్యోధనాదులను తప్పక చంప గలవు. ఇందులో లేశమాత్రము సందేహము లేదు. ఆ పనికి ఇప్పుడే సమయము ఆసన్నమైనదని నీవు అనుచున్నావు. కాని అది సరి కాదు. నాకు అసత్యములాడు అభ్యాసము లేదు. నీవు మహా వీరుడవు. కపటోపాయములను ఆశ్రయించకయే దుష్టుడైన దుర్యోధనుని బంధుసహితముగా హతమార్చగలవని నాకు పూర్తిగా విశ్వాసము కలదు"

ఇట్లు ధర్మరాజు భీమునితో మాట్లాడుచుండగనే వారి కడకు మహాత్ముడగు ' బృహదశ్వ ' మహాముని వచ్చెను. ఆ మునికి స్వాగత సత్కారములు చేసి యుధిష్ఠిరుడు అతిదీనముగా నతనితో నిట్లనెను;

" మహాత్మా ! కుటిలులును, జూదమునందు నేర్పరులును నయిన దరులు నన్ను జూదమాడుటకు పిలిచి కపటముతో ఓడించి నా సర్వసంపదలను అపహరించిరి నేను ద్యూత మర్మము నెరిగిన వాడను కాను. నా ప్రాణప్రియ ధర్మపత్నిని వారు వెంట్రుకలను బట్టి సభలోని ఈడ్చిరి. అది గడిచిన పిదప రెండవసారి గూడ నన్ను జూదమునకు లాగి అతి భయంకరమైన యీ వనవాసమును నాకు కలిగించిరి. నేను ఈ వనమునందు దుఃఖమయమైన జీవనమును గడుపుచున్నాను. నన్ను ఎత్తి పొడుపు మాటలతో నామిత్రులు, బంధువులు కూడ బాధించు చుందురు, రాత్రులలో ఆ మాటలు తలచుకొనుచు నిద్ర లేక బాధపడుచుందును. దానికి తోడు నాకు ప్రాణాధికుడైన అర్జునుడు గూడ నాకడ లేడు. 'అతనినెప్పుడు చూడగలనా' అని ఉవ్విళ్లూరుచుందును. మహాత్మా! జూదము వలన ఇన్ని బాధలు పడిన నావంటి దురదృష్టవంతుడగు రాజు ప్రపంచములో నెక్కడనైన నుండెనా ? ఎక్కడనైన ఇట్టి వానిని కంటివా? వింటివా? నాకంటె అధికముగా దుఃఖితుడు, మరియొకడు లేడని నా నిశ్చయము."

## నలోపాఖ్యానము:_

ధర్మరాజు మాటలు విని బృహదశ్వమహాముని ఇట్లనెను.

రాజా! జూదము వలన నీ కంటె ఎక్కువ దుఃఖపడిన రాజు ఉండెను. చెప్పెదను వినుము. నిషధదేశ పాలకుడుగా వీరసేనుడు అను రాజు ఉండెను. అతనికి నలుడు అను కొడుకు ఉండెను. నలుడు ధర్మార్థతత్త్వజ్ఞుడు. అతడు పుష్కరుని చేత జూదమునందు కపటముగా జయింపబడి అతి దుఃఖారుడై భార్యతో బాటు అడవుల పాలయ్యెను. అతనికి వనమునందు సేవకులు రథములు, సోదరులు, బాంధవులు, మొదలగు పరివారము ఎవ్వరును లేకుండిరి. అతనికన్న నీవేమేలు. నీకు దేవతలతో సమానులగు సోదరులు, బ్రహ్మదేవునితో సమానులగు మహా మునులు సహాయకులుగా నీ వనమునందున్నారు. కనుక నీవు దుఃఖింపదగదు. ఆ కథను సవిస్తరముగా చెప్పెదను. వినుము.

నలమహారాజు సకల సద్గుణ సంపన్నుడు. రూపసౌందర్య శోభితుడు. అశ్వవిద్యయందు పండితుడు. రాజులకెల్ల తలమానికము. భూలోకమునందు సూర్యుని వలె ప్రకాశించువాడు. బ్రహ్మజ్ఞాన సంపన్నుడు. వేదశాస్త్ర కోవిదుడు. మహాపరాక్రమవంతుడు. ద్యూతక్రీడ యందు, ప్రీతి మిక్కుటముగా గలవాడు. దేశములోని ఉత్తమస్త్రీలందరు కోరునంతటి సుందరుడు. మనువుతోసమానుడుగా ధర్మరక్షకుడై సత్యము దప్పక రాజ్యమును పాలించుచుండెను

ఆ విధముగనే విదర్భదేశము లందు మహాబలపరాక్రమ సంపన్నుడగు భీముడు అను రాజు ఉండెను, అతనికి సంతానము లేకుండెను. సంతానముకొఱకు అనేక ప్రయత్నములుచేయుచుండెను.

ఇట్లుండ ఒకనాడు అతనివద్దకు 'దమనుడు' అను బ్రహ్మర్షి సత్తముడు వచ్చెను. ఆ మహామునికి భీమరాజుభార్యతో కలిసి స్వాగత సత్కారములు, పూజలు సలిపి ఆదరపూర్వకముగా నాతిథ్యమిచ్చిన తరువాత దమనముని సంతుష్టుడై యతని కోర్కె తెలిసికొని యతనికి నొక కన్యా రత్నము, ముగ్గురు పుత్ర రత్నములును కలుగునట్లు వరమును ప్రసాదించి యా రాజదంపతు లను ఆశీర్వదించెను. ఆ వర ప్రభావము చేత నల్గురు పిల్లలు ఆ రాజదంపతులకు కలిగిరి. కన్యకకు ' దమయంతి ' యనియు ముగ్గురు పుత్రులకు వరుసగా ' దముడు, దాంతుడు, దమనుడు ' అనియు నామకరణము చేసెను. ఆ నల్గురు సద్గుణసంపన్నులై పెరుగుచు వచ్చిరి. దమయంతి, సౌందర్య, సౌభాగ్య, యశస్సం పదలలో నుత్తమురాలని లోకములో కీర్తి గాంచెను. ఆమెను సేవించుటకు నూర్గురు దాసీజనులను, నూర్గురు సఖీజనులను భీమరాజు నియమించెను, ఆ నారీమధ్యములో దమయంతి తటి ల్లతవలె ప్రకాశించుచుండెను. దేవతలలోను, యక్షగంధర్వులలోను ఆమెతో సమానులైన స్త్రీలు లేకుండిరి. లోకులు ఆమె సమీపములో నలుని గుణ రూపసంపదలను, నలుని కడ ఆమె సద్గుణములను వర్ణించుచుండిరి. ఈ విధముగా పరస్పర గుణరూపసౌందర్యము లను వినుచున్న ఆ యిరువురకు పరోక్షముగా పరస్పరము ప్రేమ వర్ధిల్లెను.

ఇట్లుండగా దమయంతీ విషయకమైన విరహ బాధను సహించలేక నలుడు తన భవనము వద్దనున్న ఉద్యానవనములోనికి విహారార్థమై పోయెను. అక్కడ బంగరు హంసలు విహరించు చుండగా నందులో నొక దానిని నలుడు పట్టుకొనెను. అప్పుడు అంతరిక్షమునుండి, ' రాజా ! నన్ను చంపకుము, నేను దమయంతి కడ నీ గుణరూపసౌందర్యములను కీర్తించి ఆమెను నీకు గూర్చెదను. ఆమె మరియొకనిని కోరకుండ చేసి నీకు ప్రియము గూర్చెదను' . అను మాట వినబడగనే నలుడు హంసను విడిచెను. వెంటనే హంసలన్నియు ఎగిరిపోయి విదర్భ నగరములో దమయంతి కడ వాలెను. అద్భుతరూపముగల పక్షులను జూసి దమయంతి వాటిని పట్టుకొనదలచెను. అవి చిక్కకుండ తొలగి పోయెను. వాటి వెంట సఖులందరు పరుగెత్తుచు పోయిరి. దమయంతి వెన్నంటిన హంస మనుష్య వాక్కుతో ' కాంతా ! నిషధ రాజగు నలుని నీకు గూర్చెదను. అతడు రూపసంపదలలో మన్మథుని వంటివాడు. నీకు అతడే తగినవాడు. అతడు చేపట్టినచో నీరూపసౌందర్యములు సఫలములై నీ జన్మ ధన్య మగును. నీవు నారీరత్నమవు. అతడు నరరత్నము. మీ యిరువురి సంగమము విశిష్టమై ఒప్పగలదు. ' అని చెప్పెను. ఆ మాటలు విని దమయంతి సంతుష్టురాలై హంసతో నీవు నలుని వద్దకు పోయి ఆయనకు ఈలాగే నివేదించుము. ' అని చెప్పగనే ఆ హంస నిషధపురికి పోయి జరిగిన వృత్తాంత మంతయు నలునితో చెప్పెను.

దమయంతి నలుని మాట విన్నప్పటి నుంచి అస్వస్థురాలుగా నుండి చింతతో వివర్ణవదనయై దైన్యముతో నిట్టూర్చుచుండెను. సర్వదా ఊర్ధ్వదృష్టితో ధ్యానించుచుండెను. ఉన్మత్తురాలివలె కన బడుచు శరీరము విరహవేదనచే తెల్లబారి మన్మథునిబారికి

తట్టుకొనలేకుండెను. ఒకచోట శయనించుటకుగాని, కూర్చొనుటకు గాని, ఏ యితర భోగముల ననుభవించుటకుగాని ఇష్టపడకుండెను. రేయింబవళ్లు నిద్రలేక హాహాకారముతో నేడ్చుచుండెను.

అట్టి పరిస్థితులలో అవస్థ పడుచున్న దమయంతి సమాచారమును సఖీజనులు భీమరాజునకు తెలిపిరి. అది విని ఆయన ఆమెకు ఏకారణము చేత ఈ బాధ కలిగియుండునా అని చింతించుచు ఆమెను స్వయముగా చూచి, ఆమెకు గల విరహావస్థను గమనించి, మంత్రి పురోహితులతో మంతనము సల్పి స్వయంవరము చాటించెను. అదివిని అనేక రాజపుత్రులు దమయంతీ స్వయంవరమునకు విదర్భ నగరమునకు వచ్చిరి. వారిని భీమరాజు యధార్థముగా సత్కరించెను.

ఇంతలో దేవర్షిసత్తములైన నారదుడు పర్వతుడు అను నిరువురు మునులు విదర్భనగరములో జరుగుచున్న దమయంతీ స్వయంవరసన్నాహమును చూచి దేవలోకమునకు పోయి దేవరాజుచేత పూజితులై తమ కుశలమును తెలిపి రాజా! భూలోకములో రాజు లందరను కుశలమగు నన్నారు, అని ఇంద్రునకు చెప్పిరి. ఆ మాట విని యింద్రుడు. భూలోకములో రాజులు ధర్మాచరణము చేసి ధర్మయుద్ధములో నిహతులై స్వర్గసుఖ మనుభవించుటకు వచ్చుచుండిరి. కాని యిప్పుడు కొంతకాలము నుండి వచ్చుట లేదు. దీనికి కారణమేమి ? ' అని ఆ మునులను అడిగెను. ఆ మాటకు నారదుడు, ' భూలోకము అత్యంత గుణరూప సంపదలతో శోభిల్లుచున్న దమయంతియను కన్యారత్నమునకు స్వయంవరము జరుగుచున్నది. ఆమెను చేపట్టుటకు రాజులందరును తత్కార్యసాధనములో నిమగ్నులై యున్నారు. కనుక యుద్ధములు లేక వారు వీరస్వర్గమునకు వచ్చుట లేదు.' అని నారదుడు చెప్పుచుండగనే అక్కడికి లోకపాలకులు వచ్చి నారదుని పలుకులు విని హర్షముతో 'మనముగూడ ఆ స్వయంవరమునకు పోవుదము' అని చెప్పి అందరును విదర్భదేశమునకు ప్రయాణమై పోయిరి.

నలుడు గూడ దమయంతిపై ఆశలు గలవాడై అచ్చటికి పోవుచుండెను. మార్గమధ్యములో అతనిని లోకపాలురు చూచి ఆకాశమునందే తమ విమానమును ఆపి భూమికి దిగివచ్చి తమకు దూతగా నుండి సహాయము చేయుమని నలుని కోరిరి. తప్పక చేసెదనని యతడు ప్రతిజ్ఞ చేసి, అంజలిబద్ధుడై ' మీరెవరు ? నన్ను దూతగా ప పదలచినది యెచ్చటికి ? మీకు నేను చేయవలసిన కార్యమేది? సవిస్తరముగా చెప్పుడు, అని యడిగెను. ఆ మాటకు ఇంద్రుడు, మేము దేవతలము. దమయంతి కొరకు భూలోకమునకు పోవుచున్నాము. నేను ఇంద్రుడను. ఈ ముగ్గురు అగ్ని-యమ-వరుణులు. నీవు దమయంతి కడకుపోయి మా నలుగురిలో నొకరిని ఆమె వరించునట్లు దూతకార్యము నెరపుము.' అని యడిగిరి. ఆ మాట విని నలుడు చేతులు జోడించి వారితో "నేను గూడ మీరు పోవు పనికే పోవుచున్నాను. ఒకే ప్రయోజనమునకై పోవుచున్న నన్ను ఆ పనికే దూతగా నియోగింపదగదు. లోకములో పురుషుడైన వాడెవడు గూడ ఒక స్త్రీని పొందవలెనని మనస్సులో కలిగిన సంకల్పమును విడిచి, యితరులకై ఆ స్త్రీనే కూర్చుటకు సంధానము చేయునా ? ఇది లోక విరుద్ధము. కనుక నన్ను ఈ పనికై నియోగించకుడు. క్షమించుడు." అని ప్రార్థించెను. ఆ మాటలు విని దేవతలు. "నీవు తొలుత ప్రతిజ్ఞ చేసి యిపుడు మాట తప్పుచున్నావు అది తప్పు. నీవు తప్పక పోయి తీరవలెను" అని చెప్పిరి. ఆ మాటకు నలుడు, సేవకులచేత రక్షింపబడు అంతఃపురములోకి నేనెట్లు పోగలను." అనెను! అది విని యింద్రుడు, మా ప్రభావముచేత నీవు నిర్విఘ్నముగా లోపలికి పోవగలుగుదువు." అని చెప్పెను.

## నలదౌత్యము

దేవతల ఆజ్ఞ గొని నలుడు దమయంతి కడకు పోయి ఆమెను చూచెను. ఆమె సఖిగణ పరివృతయై లక్ష్మీదేవి వలె ప్రకాశించుచుండెను! తన శరీర కాంతిచేత వెన్నెలను ఆక్షేపించుచున్నట్లుండెను. ఆమెను జూడగనే అతని మనస్సులో కామము వృద్ధిచెందెను కాని, తన ప్రతిజ్ఞను సత్యము చేయదలచుకొని కామమును మనస్సులోనే అణచుకొనియుండెను అతనిని చూడగనే అచటి స్త్రీలు సంభ్రాంతలై లేచి నిలుచుండిరి. అతని తేజస్సును జూచి బెదరిపోయిరి. అతని రూప సౌందర్యములను మనస్సులోనే ప్రశంసించుచు ఏమియు మాట్లాడకుండిరి. ఇంతటి సుందరుడు, ధీరుడు దేవ యక్ష గంధర్వాదులలో నెవడై యుండునో కదా ! యని తలచుచు సిగ్గు చెందియుండిరి. వారినిజూచి చిరునవ్వు నవ్వుచున్న యతనిని చూచి కొలదిగ నవ్వుచు దమయంతి ఆశ్చర్యముతో నిట్లనెను.

" సకలావయవ సౌందర్యవంతుడవైన నీవెవడవు ? నా మనస్సులో కామమును పెంచుచున్నావు. నీవిక్కడికెటు వచ్చితివి? ఎవరును నిన్ను జూడలేదా ? ఈ యంతఃపురము సురక్షితము గదా మా రాజు ఉగ్రశాసనుడే. ఇట్లు దొంగతనముతో వచ్చిన నిన్ను అతడు సహించజాలడే," అని యనెను. ఆ మాటకు నలుడు ఇటు బదులు చెప్పెను. "నేను నలుడను. నన్ను దేవదూతగా తెలిసికొనుము. దేవతలు నిన్ను కోరి నన్ను దూతగా పంపిరి. నీవు ఇంద్రాగ్నియమ వరుణులలో నొకనిని చేపట్టుము. వారి ప్రభావముచేతనే నేను ఎవరికిని కనపడకుండ ఈ కన్యాంతఃపురములో చేరగలిగితిని. నన్నెవరును చూడలేదు. వారించ లేదు. ఇక నీ యిష్టము వచ్చినట్లు చేయుము "

నలుడు చెప్పిన మాటలన్నియు విని దమయంతి భక్తితో దేవతలకు నమస్కరించి నలునితో "రాజా ! నన్ను నీవు వివాహమాడుము. నీకు ఏమి సేవ చేయవలెనో తెలుపుము నేను, నా సర్వస్వము నీ యధీనము. స్వేచ్ఛగా నన్ను పెండ్లాడుము. హంస నిన్ను గూర్చి చెప్పినప్పటి నుండి విరహముచే నేను తపించుచున్నాను. నీ కొరకై రాజ కుమారులందరను రప్పింప జేసితిని. నన్ను నీవు నిరాకరించినచో విషము త్రాగి కాని, అగ్నిలోపడి కాని, లేక ఉరి పోసికొనియైన మరణించెదను. కాని యితరుని చేపట్టను." అని యనెను.

( సశేషము )

**కవిత :**

# రెండు ప్రపంచాలు

అద్దేపల్లి రామమోహనరావు

అదొక ప్రపంచం

అక్కడ అన్నీ వలయాలు

ఆ వలయాలలోపల తలవంచుకుని చుట్టూతిరుగుతూ ఉంటారు
మనుష్యులు

తమ వలయంలోకి తలవంచుకురాని మరొక వలయంలోని
ప్రతి మనిషీ వారికి విరోధి

తమ వలయంలోనే దేవుడూ ధర్మం నీతీ విజ్ఞానం అన్నీ
కుంచించుకుపోయి యిమిడిపోవాలి

ఆ వలయమే సమస్తప్రపంచమంటే మిగిలిన వలయాలన్నీ
విశ్వసించాలి

వారికి ప్రతి విషయంమీదా కొన్ని అభిప్రాయాలుంటై
ఒకటి కులంభుజంమీద చెయ్యి వేసి నిలుస్తుంది
ఒకటి మతవృక్షపుకొమ్మ చివర పండుగా మెరుస్తుంది
ఒకటి రాజకీయపుకఱ్ఱచివర పతాకమై నిలుస్తుంది

కాని యివేవీలేవని వలయంమధ్య నిలబడి అరుస్తారు మనుష్యులు:
వారినెత్తికి జానెడెత్తున ఆకాశం ఏడుస్తూఉంటుంది
వారికళ్ళకి అంగుళం వెనక పాతాళం బుస్సుమంటూ ఉంటుంది
వారి ముక్కులనిండా సమాజసమస్యల నల్లని పొగలు

వారి కంఠం నిండా వణికి పోతున్న ప్రాణవాయువులు—
వారి భుజస్కంధాల మీద ప్రపంచమంత బరువు—
ఈ బాధలన్నిటికీ మరొకవలయంలోని మనుష్యులే కారణమనీ.
తాము సుఖంకోసమే జన్మిస్తే ఎదుటివలయంవారు కష్టసముద్రంలో
తోస్తున్నారనీ,

అహంకారపు కొండమీద నిలబడి
ఆకాశం చివరదాకా అరుస్తారు వారు
వారికి స్వార్థం ఉంటుంది
జగ మంతా స్వార్థంతో దుర్వాసన వేస్తోందని ఉపన్యాస వేదికలు
పగులగొడతారు:

వారికి కోపంఉంటుంది
ఆది న్యాయమైన కోపంగా వారిమనస్సు అంతరాత్మకి సంజాయిషీ
చెప్తుంది:

వారికి ఇతరవలయాల నాశన చింత ఉంటుంది
ఆది ధర్మంకోసం జరిగే నాశనంగా వారి విజ్ఞానం సమర్థిస్తుంది
ఏ వలయాని కావలయం ఈ భావాలతో స్వయం సంపూర్ణమై
అనుక్షణమూ వలయంలోనించి మరొక వలయాన్ని పుట్టించి

రెండు వలయాల అంచులు రాచుకున్న చోట దావాగ్నిచెలరేగి
అన్నివలయాలూ విలయాభిముఖంగా ప్రయాణంచేస్తూఉంటై;
విలయ సమయంలో కూడా, అవతల వలయాలే దానికి కారణమని
ప్రతి వలయమూ అనంతవలయాలుగా ఘోషిస్తుంది:

ఆ వలయాల లోపల తలవంచుకుని చు తిరుగుతూనే ఉంటారు
మనుష్యులు:

ఇదొక ప్రపంచం
ఇక్కడ వలయాల అంచుల్ని చెరిపేశారు మనుష్యులు
ప్రతి మనిషీ అనంత భావాల ఏకైక అభివ్యక్తి
ఎదుటి మనిషిభావాలు తన భావాలకు పరమ వి: ద్ధమైనా

భావాతీతమైన స్నేహబంధం
తన రెండు రెక్కలతో ఇద్దరినీ తట్టగలదు:
ఇక్కడ ప్రతి మనిషికీ ఒకసంపూర్ణమనః ప్రపంచంఉంది
ఆ ప్రపంచానికి తాను ఏకచ్ఛత్రాధిపతి

చీకటి గోతిలో అడుగు వేసినా
వెలుగుకొండపై అడుగు పెట్టినా
తనచేష్టకు తనే బాధ్యుడు:
తన మనస్సు కళ్ళాలు తన చైతన్యపు చేతిలోనే ఉన్నై

తను. తప్పుచేస్తే
తనను తాను శిక్షించుకుని, కన్నీటితో గుండె కాల్చుకుని
పరిపూర్ణ భవిష్యత్తుని సృష్టించుకోగలడు:
వానికి స్వార్థం ఉంటుంది
అది ప్రక్కవాని స్వార్థానికి చోటిచ్చి గుండె లోపలికి జరిగిపోగలదు—

వానికి కోపం ఉంటుంది
అది వెలికి దూకిన కొద్దీ హృదయాన్ని నిర్మలం చెయ్య గలదు—
వానికి ఇతర భావాలనాశన చింత ఉంటుంది
కాని, ఆ భావాలుగలవ్యక్తుల క్షేమానికి నీరాజనం పట్టగలదు—

ఏవ్యక్తికా వ్యక్తి ఈ భావాలతో స్వయం సంపూర్ణమై
అనుక్షణమూ భావంలోనించి మరొక భావం పెరిగి
రెండు భావాల కౌగిట్లో చైతన్యం విస్తరిల్లి
ఆ చైతన్యం దిగంత సౌఖ్య భాండంమీదికి చేతులు జాస్తుంది:

తనతో పాటు చాచుకొన్న యితరుల చేతుల్ని ఆనందంగా
స్పృశిస్తుంది:

సౌఖ్య భాండాన్నిసాధించి
తల ఎత్తి నిలిచి వర్తమానాన్ని వెలిగించి
భవిష్యత్తుకు తన చైతన్యాన్ని అందించి
బంగారు కాలాన్ని పండిస్తాడీ మనుషుడు:

# పరిమిత కుటుంబ పథకం :
## తిరుపతి శిబిరం విశేషాలు

– రావుల సూర్యనారాయణమూర్తి

అనేక ప్రాంతాలనుంచి అనుదినం అసంఖ్యాకజన సందోహాన్ని ఆకర్షించి కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వర స్వామి అపార కృపాకటాక్షాలకు పాత్రులని చేస్తున్న దివ్యస్థలం తిరుపతిలో మహమాన్వితమూ, మహోన్నతము అయిన పర్వతం దిగువభాగమునగల సుందర సువిశాలమైన శ్రీ వేంకటేశ్వర రామ నారాయణరూయా ఆసుపత్రి హర్మ్యం. గత మార్చి 20వ తేదీ ఉషోదయానంతరం సంతోషతరంగాలు పొంగి పొరలుతున్న ప్రజావాహినితో కళకళలాడుతున్నది. వ్యాధి పీడితులను ఆరోగ్యవంతులనుచేసే ఆ ప్రదేశంలో ప్రత్యేకంగా కేటాయించబడ్డ గదులలో మెత్తని పరుపులతో, తెల్లతెల్లని అంబరాలతో శయ్యలు ఏర్పాటుచేయబడ్డాయి.

గ్రామసీమలలో ఆరోగ్య సదుపాయాలు సత్వరంగా, సమర్థవంతంగా కలగజేయడంలో యితోధికంగా దోహదం చేస్తున్న యూనిసెఫ్ శకటాలు అక్కడకువచ్చి ఆగాయి వాటిలోనుంచి కొంత మంది కోమలాంగులు దిగారు. జానా నంద జలధికి మహోదయం సంప్రాప్తించబోతున్న ఆ తరుణంలో తరుణుల సుకుమార సుందరవదనాలపై నవ్యకాంతులు నాట్యమాడుతున్నాయి. ఒక స్వచ్ఛంద సేవకురాలు ప్రసన్న వదనంతో, ప్రశాంతలోచనాలతో వారిని శస్త్ర చికిత్సాలయం వైపుకు తీసుకువెడుతున్నది. కళ్లుతెరచి చిమ్మచీకటిలో చీకాకైపోతున్న అనేక కుటుంబాలను ఆలోకించిన ఆ అతివలు సంతోషకరమూ, సౌఖ్యదాయకమూ అయిన సంసారాలను రూపొందించుకొంటున్నట్లు తెలుసుకున్న దారిలోని ప్రజలు ప్రమోదభరిత మానసులయ్యారు. దుర్భరమైన దుఃఖాంధకారంలో అల్లాడిపోతున్న దౌర్భాగ్యదామోదరులకు కుటుంబనియంత్రణ వరప్రసాదం వంటిదని వారుచెప్పుకొన్నారు. ఈ పథకాన్ని సద్వినియోగం చేసుకొంటున్నవారి అదృష్టవైభవాన్ని అభినందించారు.

అక్కడకు సమీపంలో అతినిరాడంబరముగా జరిగిన ఒక సభలో చిత్తూరు జిల్లా కలెక్టరు శ్రీ యస్. ఎన్. ఆచంట స్వాగతోపన్యాసమిస్తూ కుటుంబనియంత్రణ, సమాజంలో సాంఘిక దృక్పథంలో సత్పరిణామాన్ని సాధించే నిమిత్తం తలపెట్టిన ఉద్యమమనీ, దానిసాఫల్యానికి దేశం దశదిశలా జరుగుతున్న అవిరళ కృషిలో భాగంగా భారీఎత్తున మగువలకూ, మగవారికీ కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సలు చేయడానికి నెల రోజులపాటు నిర్వహించబడుతున్న తిరుపతి శిబిరం ఏర్పాటు బహుశః రాయలసీమ జిల్లాల వైద్య, ఆరోగ్యశాఖ చరిత్రలోనే అపూర్వమైన సంఘటన అని వెల్లడించారు. మహిళల శస్త్రచికిత్సలకు ప్రత్యేకవైద్య సదుపాయాలూ, శ్రద్ధాసక్తులూ అవసరమనీ, అందుకు అన్నివిధాల అనువైన ప్రదేశమనే ఉద్దేశంతో తిరుపతిలో శిబిరాన్ని ఏర్పాటు చేయడంజరిగిందనీ కూడా ఆయన తెలియజేశారు. ఆ శిబిరంలో శస్త్ర చికిత్సలు చేయించుకునేవారికి, వారి సహాయకులకూ కలగచేయబడుతున్న సౌకర్యాలను విశదీకరించారు.

శిబిరప్రారంభకులైన ఆంధ్రప్రదేశ్ వైద్య, ఆరోగ్య శాఖల డైరెక్టరు డాక్టర్ ఐ. భూషణరావు తమ ప్రసంగంలో కుటుంబనియంత్రణ అనేది అతిముఖ్యమైన జాతీయ కార్యక్రమమనీ, భారతదేశ భవిష్యత్తుకు యిది అత్యవసరమైనదనీ తెలియజేశారు. ఆంధ్రప్రదేశ్‌లో పెద్దపెట్టున నిర్వహించబడ్డ శిబిరాలలో కృష్ణాజిల్లా గన్నవరంలో జరిగిన శిబిరం అందరినీ సంతుష్ట హృదయులను చేసిందనీ, ఎంతోమంది దంపతులు అమందానంద పరవశులై సుఖజీవనం సాగించడానికి దోహదం చేసిందనీ ఆయన వ్యక్తపరిచారు. అదేవిధంగా మహబూబ్‌నగర్ జిల్లాలోని జడచర్లలో ఏర్పాటుచేయబడ్డ శిబిరం అఖిలభారత ప్రసిద్ధిపొందిందనీ, అందుకు ప్రధాన కారకులైన శ్రీ ఎస్. ఎన్. ఆచంట ఎక్కడ పనిచేస్తున్నప్పటికీ పరిమిత కుటుంబ పథకంపట్ల అచంచల విశ్వాసంతో, అవిరళకృషి సలుపుతున్నందుకు అభినందనీయులనీ అన్నారు. కుటుంబనియంత్రణలో మహిళల శస్త్ర చికిత్సలకు సంబంధించినంతవరకూ భారతదేశంలో ఆంధ్రప్రదేశ్ అగ్రస్థానం వహిస్తున్నదని ఆయన బహిర్గత పరచారు.

సభాధ్యక్షులు, ప్రముఖ జాతీయ నాయకులు శ్రీ ఎం. అనంత శయనం అయ్యంగారు మాట్లాడుతూ నేటిక్లిష్టపరిస్థితుల్లో దేశం కుటుంబనియంత్రణను అమలు జరపడంతోపాటు ఆధునాతన పద్ధతుల్లో వ్యవసాయం సాగించి అధికాహారోత్పత్తిని సాధించాలని నొక్కివక్కాణించారు.

ఈ విధంగా లాంఛన ప్రాయంగా ప్రారంభించబడ్డ కుటుంబ నియంత్రణ శిబిరం నానాటికీ జిల్లాలు చెరగులానుంచీ సౌందర్యవంతులైన సౌఖ్యజీవనం సాగించదలచిన అనేక వందల మంది అతివలను ఆకర్షిస్తున్నది. మానవజాతికి నవజీవనం అందిస్తున్న కుటుంబనియంత్రణోద్యమ ఆశయ ఆదర్శాలను ప్రజలలోప్రచారం చేస్తూ సమాచార, జనసంబంధశాఖ కేంద్రప్రభుత్వ క్షేత్ర ప్రచార శాఖ, వైద్యఆరోగ్యశాఖ విస్తీర్ణ విభాగం వంటి సంస్థలు విస్తృత సంచారాలద్వారా నిద్రాముద్రితులను ప్రబుద్ధులను చేస్తున్నాయి. అభ్యుదయకరమైన ఆనంద సూత్రంతో మానవ మానివసాభాలను సంఘటించి విజయమాల విసిరిస్తున్నాయి.

భారతదేశం భవిష్యత్తును నిండుహృదయంతో కాంక్షించే ప్రతిఒక్కరినీ కలవరపరుస్తూన్న సమస్యఅధిక జనాభా. ఈసమస్యను అనేకదృక్కోణాలనుంచి అధ్యయనం చేసిన కేంద్ర ఆరోగ్యశాఖ సహాయమంత్రి డాక్టర్ ఎస్ చంద్రశేఖర్ మాటల్లో చెప్పాలంటె జనాభా సమస్య అత్యంత ప్రాథమికమూ, మానవ సమస్యలలో అతిక్లిష్టతరమూ ఆయిన ఒక సమస్యగా పరిగణించింది. అది మానవుడి వ్యక్తిగత, జాతీయాంతర్జాతీయ సాంఘిక జీవనంలో ప్రతిరంగంలోనూ ప్రతిబంధకమవుతుంది. వ్యష్టికుటుంబాల ఆరోగ్యానందాలకు, దేశాల భౌతికాభివృద్ధి సాంఘిక పురోగమానా లకూ అవరోధమవుతుంది, శాంతి సమరాలకు చెందినసమస్యలతో జనాభా తీవ్రత సమస్యలు అంతర్లీనంగా సంబంధం కలిగివున్నం దువల్ల అంతర్జాతీయ శాంతిభద్రతలకు కూడా అది విఘాతం కలగ జేస్తుంది. భారతదేశంలోని మనకు మనదేశపు జననాల స్థాయిని సత్వరంగా తగ్గించడమే మన ప్రాథమిక ఆర్థిక సమస్యపరిష్కా రానికి మార్గం. కనుక దాని సాధనకు సమైక్యకృషి సాగించడమే మనకర్తవ్యం."

ప్రస్తుత ప్రపంచంలో మనదేశం జనాభా సంఖ్యలో ద్వితీయ స్థానమూ, భూమివిస్తీర్ణంలో సప్తమ స్థానమూ ఆక్రమిస్తున్నది అంటే భారతావని మొత్తం ప్రపంచ జనాభాలో 14 శాతమూ, ప్రపంచ భూభాగంలో 2.4 శాతమూ కలిగివున్నది. నేటి మన జనాభా 50 కోట్లను అధిగమించింది. అంటే ఈ 5.15 కోట్ల జన సంఖ్య 55 ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల జనాభాకు సమాన మైన దన్నమాట. ప్రతి ఒకటిన్నర సెకండ్లకు ఒక శిశుజననం జరుగుతున్నది. దీనివిబట్టి రోజుకు 55,000; సంవత్సరానికి 2.1 కోట్లు సంతానోత్పత్తి సాధించబడుతుంది. ఇది ప్రమాద భరితమైన విషయం.

సముచిత సహజ సంపదలు, సాంకేతిక నిపుణతలు కలిగి వున్నట్లయితే భారతదేశానికి ఈ అధిక జనాభా మేలు చేకూర్చి వుండేది అయితే అత్యల్పమైన మన జీవన ప్రమాణాన్ని ప్రవృద్ధి చేయడానికి అవసరమైన వాటితో పోల్చిచూచినటయితే మన ప్రకృతి సంపదలు, పెట్టుబడి, శాస్త్రీయ సాంకేతిక పరి జ్ఞానం దురదృష్టవశాత్తు అతి పరిమితంగా వున్నాయి. మరో ముఖ్యమైన విషయమేమిటంటే దేశం జీవన స్థాయిని పెంపొం దించడానికి వ్యవసాయోత్పత్తి, ఆహారం మాత్రమేకాకుండా ఎన్నో విధాలైన సహజ సంపదలు అవసరం. వ్యవసాయోత్ప త్తిని ఒకస్థాయి వరకూ అభివృద్ధిచేయగలం కాని, జనాభాపెరుగు దలతోపాటు భూమి. యితర ప్రకృతి సంపదలూ విస్తృతం కావు.

మనదేశంలో సామాన్య పౌరుడి జీవన ప్రమాణాన్ని గ్రాస వాసాలు, దుస్తులు, విద్యాసౌకర్యాలు, వైద్యసదుపాయాలు, విరామ వేళలు, కొన్ని సాంస్కృతిక వసతులు వంటి నాగరిక జీవనానికి కావలసిన కనీసావరాల వినియోగస్థాయి అని సూక్ష్మంగా నిర్వ చించవచ్చు. నిరాశా నిరుత్సాహాల మధ్య సతమత మవుతున్న సామాన్య పౌరుడి జీవితం భారతావనిలో హీనదీనావస్థలో వున్నది. స్వరాజ్య వాతావరణానంతరం పంచవర్ష ప్రణాళికల మూలంగా గ్రామాలలో సైతం జీవనస్థాయి కొంతవరకూ మెరుగుపడినప్పటికీ, ప్రభుత్వమూ ప్రజలూ ఆశించిన మేరకు అది అభివృద్ధిచేయడం ఎంతమాత్రం జరగలేదు.

ఈ సంక్లిష్ట పరిస్థితిని సరిదిద్దడానికి ప్రపంచ చరిత్రలో ఎన్నడూ ఎరుగనంతటి విశాలమూ, విస్తృతమూ అయిన మహో ద్యమం కుటుంబనియంత్రణ కార్యక్రమమం భారత దేశంలో ప్రారంభించబడింది. వైద్య, ఆరోగ్య, సంక్షేమ సేవల చరిత్రలో యిది కనివినీ ఎరుగనంతటి మహోద్ధృతమైనది. పత్రికల్లో, చర్చల్లో, సదస్సుల్లో వెల్లడవుతున్న అభిప్రాయాలను బట్టి కుటుంబ నియంత్రణ కార్యక్రమం ప్రజావిశ్వాసాన్ని అపారంగా చూర గొంటున్నట్లు తేటతెల్లమవుతున్నది. మన సమాజంలో విశిష్ట సాంఘిక పరిణామ ప్రారంభానికి యిదొక సూచిక. వ్యాధిపీడితులు సేవలకోసం తమవద్దకు రావాలని భావించేవైద్య, ప్రజారోగ్య కార్యకర్తల సంప్రదాయసిద్ధమైన దృక్పథంలో మార్పుతీసుకు రాబ డింది నూతన పద్ధతి ప్రకారం ప్రజలు వైద్యుల సహాయాన్ని కోరడానికి బదులుకుటుంబనియంత్రణోద్యోగులు జనసామాన్యంలో వైద్యుల సేవలను పొందాలనే భావం పేరేపిస్తున్నారు.

ఈ విధమైన ప్రోత్సాహప్రోద్బలాలవల్ల కుటుంబనియం త్రణ శిబిరాలు జయప్రదమవుతున్నాయి. చిత్తూరు జిల్లా కలెక్టరు శ్రీ ఎస్.ఎన్. ఆచంట తిరుపతి శిబిర నిర్వహణకు ఎంతో ముందునుంచీ నిర్దిష్టమూ, నిర్దుష్టమూ అయిన ఒక కార్యక్రమాన్ని రూపొందించి ఎన్నోరంగాల, ఎన్నోసంఘాల వ్యక్తుల సలహాలు, సహాయ సహకారాలు పొందడము జరిగింది. ప్రభుత్వంతోపాటు తిరుమల తిరుపతి దేవస్థానం. జిల్లాపరిషత్తు, పంచాయితీ సమి తులు, రోటరీక్లబ్బులు లైన్సుక్లబ్బులు, అనేక యితర సంస్థలూ ఆయన సత్సంకల్పాన్ని సర్వవిధాల బలపరచాయి. జిల్లాలోని బస్సుయజమానులు కుటుంబనియంత్రణ శస్త్రచికిత్సనుపొందేవారికి తమబస్సులలో ఉచితంగా ప్రయాణం చేయడానికి అవకాశం కలగజేశారు. చికిత్స పొందేవారికి ఉచిత భోజన వసతులు కలగ జేయడంతోపాటు వారి సహాయకులకు కూడా సౌకర్యాలు ఏర్పాటు చేయబడ్డాయి. శస్త్రచికిత్స చేయించుకున్న మహిళలకు పదిహేను రూపాయలు, మగవారికి పన్నెండు రూపాలు ఆర్థిక సహాయం అందజేయడమేకాకుండా పేదలకువస్త్రదానంకూడాచేయబడుతున్నది.

రూయా ఆసుపత్రి సూపరింటెండెంటు డాక్టరు సి సావిత్రి. జిల్లా ఆరోగ్య వైద్యశాఖాధికారి డాక్టరు పి వెంకటేశ్వరరావు, శ్రీ వేంకటేశ్వర వైద్యకళాశాల ప్రధానాచార్యులు డాక్టరు పి రామ చంద్రరావు, జిల్లా కుటుంబనియంత్రణ శాఖాధికారిణి డాక్టర్ ఎం వి. సీత ప్రభృతుల చేయూతతో జిల్లా కలెక్టరు శ్రీ ఎస్.ఎన్ ఆచంట అత్యంత సమర్థవంతంగా నిర్వహిస్తున్న ఈ శిబిరంలో యితర సంతృప్తికర సౌకర్యాలన్నిటికీ మించి ప్రజ్ఞావంతులూ, ప్రేమార్ద్రహృదయులూ అయిన వైద్యుల సహాయం లభిస్తున్నది. అందుకే అంచలవారీగా అక్కడ శస్త్రచికిత్సలు చేయించు కుంటున్న స్త్రీ పురుషులు ప్రతి ఒక్కరూ తగిన విశ్రాంతి తీసు కున్న అనంతరం సంతోషంతో; సత్కార్యసమాచరణం చేశా మనే సంతృప్తితో స్వగృహాలకు బయలుదేరే దృశ్యం సందర్శ కులకు కొత్తఆశనూ, కొత్త ఆనందాన్నీ కలగజేస్తున్నది. ★

# అతిలో అనర్థం, పరిమితిలో పరమార్థం

- శ్రీరంగాపురం కేశవాచార్య

ఏది ఎంత మోతాదులో ఉండాలో అది అంతే ఉండాలి, అంతకు మించితే అది మంచిదైనా విషమిస్తుంది. అందుకే "అతి సర్వత్ర వర్జయేత్" అన్నారు. అతి మధురంలో సాక్రైన్ లాంటి చేదు ఉన్నట్లు మంచి వాటిలోకూడ అతి కూడదు. వినయం అత్యుత్తమ భూషణమే కాని 'అతి' చేరే సరికి అది శోషణంగా మారుతుంది. "అతి వినయం దూర్తలక్షణమ్" కాబట్టి జాగ్రత్త పడకుంటే అతిలో అనర్థముంది.

ఇక పరిమితిలో పరమార్థముంది. పరిమితి అంటే ఎక్కువ కాక తక్కువకాకసరిపోను ఉండటం, ఏదైనా అవసరానికి తగినంత మోతాదులో ఉన్నప్పుడే సవ్యంగా ఉంటుంది. అయితే పిడుక్కూ పిల్లికి ఒకేమంత్ర మన్నట్లు అందరికీ ఒకేమందు పనికిరాదు. కూరల్లో ఒకరికి ఉప్పు కారం ఎక్కువ మరొకరికి తక్కువ కావాలి. ఎవరికెంత అవసరమో అంతే ఉండాలి. ఒక దేశంలో జనాభా పెరుగుదల వాంఛనీయమైతే మరొక దేశంలో అది అవాంఛనీయం కావచ్చు, జనాభా ఆర్థిక స్తోమత కనుగుణంగా పెరగాలి.

అతి సంతతి అతి వృష్టిలాంటిది, అతి వృష్టివల్ల దేశం క్షోభితమౌతుంది. దేశాన్ని సస్య శ్యామలం చేయడానికి వర్షం అవసరమే. కాని సకాలానికి అవసరమైనంత వర్షం రావాలి. అవసరానికి మించి వచ్చిన వర్షం అనర్థదాయకం. మనదేశంలో సంతాన విషయంలో "అతి" బాగా ఆక్రమించి పోయింది. ప్రతి $1\frac{1}{2}$ సెకండుకు ఒక శిశువు ప్రకారం రోజుకు దాదాపు యాభైయేడు వేల పిల్లలు పుడుతున్నారు. ఇంత విపరీతంగా పెరిగి పోతున్న మన జనాభా కనుగుణంగా మన ఆహారోత్పత్తి కాని, నివాస యోగ్యమైన భూమి కాని పెరుగు తుందా ? లేదు, తాటి చెట్టులా జనభా పెరుగుతుంటే తంగెడిచెట్టులా ఆహారోత్పత్తి పెరుగుతున్నది, ఇది సహజ లక్షణం. మనం వ్యవసాయరంగంలో ఎంత అభివృద్ధి సాధించినప్పటికీ అభివృద్ధి ఒక స్థాయినందుకున్నాక ఆహారోత్పత్తి పెరుగుదల పరిమితమై ఉంటుంది. కాని జనాభా పెరుగుదల అట్లాకాదు. మన జనాభా లెక్కలను బట్టిచూస్తే జనాభా పెరుగుదల ప్రతి దశాబ్దిలోనూ రానురాను హెచ్చుముఖంగా కనుపిస్తుంది. 1931-41 దశాబ్దంలో మన రాష్ట్రంలో జనాభా 30.86 లక్షలు పెరిగితే మరొక దశాబ్దిలో (3941-51) 38.26 లక్షలు ; మళ్లీ 1951-61 దశాబ్దికి 48.68 లక్షలు పెరిగింది. ఈ వైఖరి చూస్తే వచ్చే దశాబ్దికి (1961-71) మన జనాభా 63.98 లక్షలు పెరుగవచ్చునని అంచనా. ఇట్లా ప్రతి దశాబ్దిలో ఇన్నన్ని లక్షలు జానాభాలో హెచ్చిపోతుంటే మన ఆర్థిక వ్యవస్థ దెబ్బతిన గలదని శాస్త్రజ్ఞులు ఆందోళన పడుతున్నారు. ప్రవల జీవన ప్రమాణం పెంచాలంటే జనాభా పెరుగుదలను అరికట్టక తప్పదు. ఎంత వేగంగా ప్రగతిని సాధించినా అభివృద్ధి అడ్డంకులను అదుపులో పెట్టందే ఫలితం దక్కదు. చిల్లిపడ్డకుండలో ఎన్ని నీళ్లు పోసినా ఏం లాభం ?

జనాభా అతిగా పెరిగి పోవటానికి ముఖ్య కారణమొకటుంది, స్వాతంత్ర్యానంతరం ఆరోగ్య సౌకర్యాలు పెంపొందుట వల్ల మరణాల సంఖ్య మునుపటికంటె చాల తగ్గిపోయింది. ఏటా మరణాల సంఖ్య వెయ్యింటికి 27 నుండి 16కు తగ్గింది. ఒక్క మలేరియా వ్యాధి నిర్మూలనా ప్రణాళిక కారణంగా పదిలక్షల మరణాలు ప్రతిఏటా అరికట్టబడ్డాయని అంటున్నారు. ఏటా వెయ్యింటికి 16 మరణాలవుతే జననాలు 41. మన ఆర్థికాభివృద్ధిని హరిస్తూ అతిగా పెరిగి పోతున్న జననాల సంఖ్యను పరిమితం చేయాలంటే కుటుంబ నియంత్రణ' ఏకైక మార్గమని విజ్ఞుల అభిప్రాయం, నారు పోసినవాడు నీరుపోయడా ? అనుపాత సామెత పాటిస్తూ కూర్చుంటే సరిపోదు, నీరున్నంత నారు పోసుకోవాలి. మంచమున్నంతలో కాళ్లు సాచుకోవాలి. పరిమితిని మించకూడదు. స్తోమతకను గుణంగా కుటుంబాలు పరిమితమైయుంటే ఆర్థికంగా ఏ తగాదా ఉండదు, పరిమిత సంసారం బ్రతుకే బంగారం. మంది ఎక్కువైతే మజ్జిగ పల్చన అన్నట్లు పరివారం అపరిమితంగా పెరిగిపోయి స్థితిగల కుటుంబాలు సైతం చితికి పోవచ్చు, సంతతి పెరిగే కొలది సౌఖ్య సంపదలు తరుగటం కాన్పుకాన్పుకి ఇల్లాలి ఆరోగ్యం కరిగి పోవటం కద్దు.

జాతీయ సమస్యలలో జనాభా సమస్య ఒకటిగా పరిగణింపబడుతున్నది. దేశభాగ్యోదయంలోనే వ్యక్తి భాగ్యోదయం ఇమిడి ఉంది. కనుక దేశ క్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని 'అతి'ని వర్జించి 'పరిమితి'ని పాటిద్దాం.

---

కేంద్ర ప్రభుత్వ క్షేత్ర ప్రచారశాఖ కార్యాలయంవారు రాష్ట్ర పౌరసంబంధశాఖ సహకారంతో. కర్నూలు జిల్లా నంద్యాల రెవిన్యూ మండలంలో కుటుంబ నియంత్రణ కార్యక్రమాల ముమ్మరంగా ప్రచారం కల్పించేందుకు ఒక ఉద్యమాన్ని నిర్వహించారు. పిల్లలు పుట్టకుండా ఉండేందుకుగాను, ఇంతవరకూ 400 మంది స్త్రీలు శస్త్రచికిత్స చేయించుకొన్నారు. గ్రామ ప్రాంతాలలో మహిళలు కుటుంబ నియంత్రణ పట్ల బాగా హెచ్చు ఆసక్తి కనబరుస్తున్నారు. శస్త్రచికిత్స చేయించుకునేందుకు అనేక మంది స్త్రీలు వస్తూ వుండటంతో జిల్లా వైద్యశాఖ అధికారులు, అచటి పడకల సంఖ్యను 200 నుంచి 320 కు పెంచారు.

కుటుంబ నియంత్రణ పద్ధతులపట్ల, పురుషులకన్న మహిళలకు ఎక్కువ ఆసక్తి ఉన్నదని. ఇందుకు సంబంధించి జరిపిన పరిశీలనవల్ల వెల్లడైంది.

---

# కుటుంబ నియంత్రణ బహుమతులు

కుటుంబనియంత్రణా కార్యక్రమాలను 1967-68 సంవత్సర కాలానికి అమలుపరచడంలో వివిధ స్థాయిలలో బహుమతు లివ్వాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించినది. తదనుగుణంగా తూర్పు గోదావరి జిల్లా అగ్రస్థానం వహించింది. 1967_68 మధ్యకాలంలో ఇక్కడ మొత్తం 30,420 శస్త్ర చికిత్సలు జరిగాయి. అంటే వెయ్యి జనాభాకు 10,256 చొప్పున శస్త్రచికిత్సలు జరిగాయనమాట.

పైన పేర్కొన్న కాలంలో తూర్పు గోదావరి తర్వాత చెప్పుకోదగినది జంట నగరాలు. ఇక్కడ వెయ్యికి 6,32 శస్త్ర చికిత్సలు జరిగాయి. కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను అమలు జరపడంలో మొత్తం దేశంలోనే తూర్పుగోదావరి జిల్లా బహుశా ప్రథమ స్థానం వహించవచ్చు. లేదా కనీసం అగ్రగణ్యమనదగిన వాటిలో ఒకటి కావచ్చు.

కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను అమలు జరపడంలో యిచ్చే ఉత్తమ పంచాయతీ సమితి బహుమతి తూర్పుగోదావరి జిల్లాలోని అన్నవరానికి లభించింది. ఇక్కడ 1967_68లో ప్రతి వెయ్యి జనాభాకీ 15.20 శస్త్రచికిత్సలు జరిగాయి. ఉత్తమ గ్రామ పంచాయతీ బహుమతి నల్గొండ జిల్లాలోని జుల్లూరుకు లభించింది.

స్థానిక సంస్థలు నిర్వహించే ఉత్తమ పట్టణ క్లినిక్ బహుమతి ఏలూరు పురపాలక సంఘ క్లినిక్‌కు లభించింది. ఇక్కడ వెయ్యి జనాభాకి 7.09 శస్త్రచికిత్సలు చొప్పున జరిగాయి.

స్వచ్ఛంద సంస్థలు నిర్వహించే పట్టణ క్లినిక్కులలో ఉత్తమమైనదిగా ఆంధ్రప్రదేశ్ విభాగానికి చెందిన కుటుంబ నియంత్రణ అసోసియేషన్ వారి మలకపేట క్లినిక్ ఎన్నికైనది. ఇక్కడ ప్రతి వెయ్యికి 20.73 శస్త్రచికిత్సలు జరిగాయి. పట్టణాలలోని ఉత్తమ క్లినిక్కులకు యిచ్చే బహుమతి రాజమండ్రిలోని ప్రభుత్వ ఆసుపత్రికి లభించింది. ఇక్కడ ప్రతి వెయ్యికి 33.5 చొప్పున శస్త్రచికిత్సలు జరిగాయి.

తెలంగాణా ప్రాంతంలో ఉత్తమ జిల్లా బహుమతి 1967_68 లో ఖమ్మంకు లభించింది. ఇక్కడ 5,221 శస్త్రచికిత్సలు జరిగాయి. అంటే ప్రతి వెయ్యి జనాభాకు 4.432 చొప్పున శస్త్రచికిత్సలు జరిగాయన్నమాట.

ఉత్తమ పంచాయతీ సమితి బహుమతి ఖమ్మం జిల్లాలోని భద్రాచలానికి లభించింది. ఉత్తమగ్రామ పంచాయతీ బహుమతికి మహబూబ్‌నగర్ జిల్లాలోని కొత్తపేట ఎన్నిక చేయబడినది. ఇక్కడ ప్రతి వెయ్యి జనాభాకి 1.22 చొప్పున శస్త్రచికిత్సలు జరిగాయి. ఏలూరు పురపాలక సంఘం క్లినిక్కుకు, స్థానిక సంస్థలు నిర్వహించే క్లినిక్కులలో ప్రథమ స్థానమూ, మహబూబ్‌నగర్‌లో ఆంధ్ర మహిళా సభ నిర్వహించే క్లినిక్కుకు స్వచ్ఛంద సంస్థలు నిర్వహించే క్లినిక్కులలో ప్రథమ స్థానము లభించాయి.

ఈ కార్యక్రమాలను జరిపించినందుకు ప్రభుత్వ డాక్టర్లకు, ప్రైవేటు డాక్టర్లకు కూడా ఉత్తమ బహుమతులు ప్రకటించబడ్డాయి. అదే విధంగా కుటుంబనియంత్రణ కార్యక్రమాలను ప్రోత్సహించిన వారికి కూడా ఉత్తమ బహుమతి యివ్వబడినది.



ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి జూన్ 4 వ తేదీన హైదరాబాదుకు విచ్చేసినప్పటి చిత్రం



నగరంలో ఇటీవలి ఆందోళనల కారణంగా ఆర్. టి. సి. బస్సు డ్రైవర్లకు రక్షణగా బస్సులకు ఇనుప జాలీని ఏర్పాటుచేయడం జరిగింది. అట్టి జాలీ ఏర్పాటుచేయబడిన ఒక ఆర్. టి. సి. బస్సు.

# రాష్ట్రంలో పశు సంరక్షణ చర్యలు

పి. పాండురంగారావు

మన రాష్ట్రం 'అన్నపూర్ణ' కాదు, 'కామధేనువు' అనిగూడా పిలవడానికి మన రైతు చేసిన కృషిని మనం ఎంతో చెప్పుకోవచ్చు. అటు పాడి, ఇటు పంట సమృద్ధిగా యిస్తూ మనదేశంలోని రాష్ట్రాల్లో కల్లా ముందంజ వేస్తున్నది మన రైతే. అయితే యీలా ముందంజ వేయడంలో ముఖ్యంగా పాడికి, పంటకూ మూలమైన పశువులను చక్కగా కాపాడుకొని, వాటిని అంటురోగాల బారినుండి తప్పించుకుంటూ నాణ్యమైన పాడిపశువుల సంఖ్య వృద్ధిచేస్తూ మనకెంతో గర్వకారణంగా జీవిస్తున్నాడు మనరైతు.

ఇవన్నీ ఎలా జరుగుతున్నాయో మీకు తెలుసా? ముఖ్యంగా మన రైతుకు తన పశువంటే ఎంతో ప్రీతి. దానికి ఏ విధమైన బాధ కలిగినా చూడలేడు. వాటికి అంటువ్యాధి వచ్చింది అంటే అసలే సహించలేడు. వెంటనే పశుసంవర్ధకశాఖవారి సిబ్బందికి విషయాలన్నీ తెలిపి, వారివల్ల సరిగ్గా పని జరిగేదాకా వూరుకోడు. ఇవన్నీ యీ శాఖవారెప్పుడో తెలుసుకున్నారు. రైతుకు ముందు జాగ్రత విషయాలు ఎన్నో వివారించి, కట్టుదిట్టమైన పనులను ఎన్నో చేశారు. ఇవి ఏవంటారా!

అసలు పశువుల్లోకల్లా గొప్ప నష్టం కలిగించి రైతుకు తీరని బాధపెట్టేది పెద్దజబ్బు ఒకటుంది. దీనిమూలాన, మనరాష్ట్రంలో రైతులు ప్రతి యేడాది చాలా పశువుల్ని నష్టం పొందేవాళ్ళు. ఈ జబ్బు తగిలిన గ్రామాల్లో ఎక్కడ పడితే అక్కడ యీ పశువులు కుప్పలు కుప్పలుగా చచ్చిపడి వుండేవి. ఈ జబ్బుకు, యిది ఎద్దు, ఆవు, ఆంబోతు, దూడ అనే విచక్షణ వుండేదికాదు. ఒక్కొక్క గ్రామంలోఇక చెప్పలేం. వూరంతా గబ్బు కొట్టేది ఈ చచ్చిన పశువులతో. చిన్న పిల్లలకు పాలుకూడా దొరికేవికావు. ఇలాంటి జబ్బు ఇప్పుడు మనం ఎరుగం. ఇలావుండేది ఒకప్పుడు అంటే, మన పిల్లలు ఆశ్చర్యపడతారు. నిజంగా ఇంత తీవ్రమైన జబ్బును ఎలా అరికట్టారో తెలుసా? మనకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వం కలసి తీవ్రంగా ఆలోచించి కొన్ని లక్షలు ఖర్చుచేసి ప్రత్యేకపు సిబ్బందిని నియమించి రాష్ట్రంలోనున్న అన్ని పశువులకు యీ జబ్బు రాకుండా టీకాలు వేయడానికి నిశ్చయించాయి. ఈ కార్యక్రమం మొట్టమొదట ఆంధ్రప్రదేశ్‌లోనే ప్రారంభించారు. అక్కడక్కడ కొంతమంది రైతులు అజ్ఞానంవల్ల టీకాలను పశువులకు వేయించుకోలేదు. అప్పుడు ఏమయిందో తెలుసా? ఈ రకంగా టీకాలు వేయని గొడ్లు కొద్ది కాలంలో పెద్ద జబ్బుతో బాధపడి చచ్చిపోయినై. టీకాలు వేసినవన్నీ బాగావున్నాయి. అప్పటినుంచి ప్రతి రైతు ప్రభుత్వపు సిబ్బందితో సహకరించి వాళ్ళ పశువులన్నిటికి టీకాలు వేయించుకున్నాడు.

రాష్ట్రంలో పశువులన్నిటికి టీకాలు వేశాముగదా అని యిక జబ్బు రాదని ప్రభుత్వంవారు వూరుకోలేదు. మన రాష్ట్రానికి ఇతర రాష్ట్ర సరిహద్దులున్నవికదా, అక్కడ అంటే, మధ్యప్రదేశ్, ఒరిస్సా, మహారాష్ట్ర మొదలైన రాష్ట్రసరిహద్దులలో, కొండ ప్రాంతంలో, అరణ్య ప్రాంతాల్లో 10 మైళ్ళ వెడల్పున అక్కడవున్న పశువులకు ఎప్పుడూ టీకాలువేసే మెలకువ సిబ్బందిని పెట్టి అటునించి మన రాష్ట్రంలోకి జబ్బును ప్రవేశించకుండా, ఒక రకమైన, జబ్బుని నిరోధించే ప్రాంతంగా ఇమ్యూన్ బెల్ట్ తయారు చేశారు. యిలాంటివి ఆదిలాబాదు జిల్లాల్లో ఆరుచోట్ల, కరీంనగరు జిల్లాలో మూడు చోట్ల, ఖమ్మం జిల్లాలో ఐదుచోట్ల, నిజామాబాదు జిల్లాలో రెండుచోట్ల, శ్రీకాకుళం జిల్లాలో ఐదుచోట్ల పెట్టారు.

ఇంతేకాదు యింకా రైలు మార్గాలలోనూ, యితర రాష్ట్రాలనుంచి మన రాష్ట్రానికివచ్చే రోడ్డు మార్గాల సరిహద్దులలోనూ ప్రత్యేకంగా టీకా కేంద్రాలను తెరిచారు. ఇక్కడవున్న ప్రత్యేకపు సిబ్బంది మన రాష్ట్రంలోకి వచ్చే ప్రతి పశువుకి టీకాలు వేస్తారు. ఇలాంటి రోడ్డు సరిహద్దు కేంద్రాలు ఆదిలాబాదు జిల్లాలో రెండు, చిత్తూరు జిల్లాలో నాలుగు, ఖమ్మం జిల్లాలో రెండు, నిజామాబాదు జిల్లాలో ఒకటి, శ్రీకాకుళం జిల్లాలో ఏడు, ప్రత్యేకంగా హైదరాబాద్ రైల్వే స్టేషన్‌లో ఒకటి వున్నవి. ఈ విధంగా యీ పెద్ద జబ్బును ఇతర రాష్ట్రాలనుండి మన రాష్ట్రానికి రానివ్వకుండా కట్టుదిట్టమైన చర్యలు ఎన్నో తీసుకున్నారు.

ఇంతేకాదు మన రాష్ట్రంలోనే వారంలో ప్రతిరోజూ, ఎక్కడో ఒకచోట పశువుల సంత జరుగుతూ వుంటుంది. వీటిల్లో చుట్టుపట్ల వూళ్ళనించి పశువులను కొనటం, అమ్మటం జరుగుతూవుంటుంది. అంటే కొత్త పశువుల కలయిక జరుగుతూ వుంటుందన్నమాట. ఈ విధంగా కలిసినప్పుడు, ఏ ఒక్క పశువుకు పెద్ద జబ్బు తగిలినా అది ఇతర పశువులకు అంటించడం కాకుండా, దాన్ని అమ్మేసినప్పుడు చాలా వూళ్ళకు యీ జబ్బును తెలియకుండా రవాణచేయడం జరుగుతుంది. యిది చాలా ప్రమాదం కదూ? యిలా చాలాసారు యిదివరలో జరిగింది. దీన్ని అరికట్టే మార్గం ఒక్కటే. అదేమంటే, కొన్ని సంవత్సరాలదాక ఎంత శ్రమ అయినాసరే, ఖర్చు అయినాసరే, ప్రతి సంతలో ప్రతి పశువుకి టీకాలు వేయటం. ప్రభుత్వం దీన్ని అమలు పరుస్తున్నది. దీనివల్ల యిటు సంత పశువులు, అటు వూళ్ళల్లోని పశువులు క్షేమంగా వుంటాయి.



# గృహిణి

## పిలకా గణపతి శాస్త్రి

---

### జరిగిన కథ

పార్థసారథి, రాఘవ నాట్యకళామండలి ద్వారా నాటకాలు వేస్తుండేవాడు. సరోజ ఆ నాటకాల్లో హీరోయిన్ వేషం వేస్తుండేది. ఒకసారి ఏలూరులో కృష్ణ తులాభారం నాటకం వేయడానికి అన్ని ఏర్పాట్లూ జరిగాయిగాని సమయానికి సరోజ మద్రాసు వెళ్ళిపోవడం వల్ల నాటకం ఆగిపోయింది. ఆ విషయమేమిటో తెలుసుకుందామని పార్థసారథి మద్రాసువెళ్ళాడు. అక్కడ అతను జ్వరపడ్డాడు. అతని భార్య విజయలక్ష్మి చాలా ఆందోళన పడి మేనమామ కొడుకు కృష్ణమూర్తిని మద్రాసుకు పంపించింది.

---

విజయలక్ష్మి మనస్సు కొంచెం కుదుటపడింది. ఆ తరువాత సావిత్రిని తిరిగి ఇంటికి వెళనీయలేదు. మద్రాసు నించి ఇద్దరూ తిరిగి వచ్చేదాక నయినా తమ ఇంట్లోనే ఉండిపో వలసిందని బలవంతపెట్టింది. అలా బ్రతిమాలు కున్నప్పుడిక సావిత్రి కాదనలేక పోయింది. పైగా ఆ పరిస్థితిలో విజయలక్ష్మిని విడిచి వెళ్ళడానికి కూడా మనస్కరించలేదు. అందుచేత భర్త తిరిగి వచ్చేదాకా అక్కడ ఉండిపోవాలని నిర్ణయించుకుంది.

ఆ తరువాత అమ్మమ్మ తను చెప్పిన మాటలవల్ల కొంత ధైర్యం తెచ్చుకున్నట్టు కనబడినా విజయలక్ష్మి ఆంతర్యంలో బాగా ఆందోళనపడుతున్నదని గ్రహించింది. అందుచేత ఆ కబుర్లు ఈ కబుర్లు చెప్పి ఆమెకు ఉల్లాసం కలిగించాలని ప్రయత్నించింది. పిల్లల నిద్దరిని దగ్గిర కూర్చుండబెట్టుకుని ఆడించింది. వద్దువద్దని అంటున్నా ఇంట్లో పనులన్ని చాలావరకు తానే చేసింది. ఆవేళ రాత్రి హరికేన్ లైటు దగ్గిర కూర్చుని కాలక్షేపానికని కాశీ మజిలీ కథల పుస్తకం తెరిచింది.

'అక్కయ్యా! కాశీమజిలీకథ చదువుతాను వింటావా?'

కాదనలేక విజయలక్ష్మి రాత్రి చాలా సేపటివరకు అది వింటూ కూర్చుంది. సావిత్రి తెల్లవారిన తరవాతకూడా ఇంటిపనులలో విజయలక్ష్మి కనేక విధాల సాయపడుతూ తోడునీడలా మసులుకుంది. మధ్యాహ్నం భోజనాలయిన తరవాత పనులన్ని ముగించి 'గవ్వలాడుకుందామా?' అని అడిగింది. ఆమె ఆదరణ, కలుపుగోలుతనము తలచుకుంటూంటే విజయలక్ష్మి కెంతో ముచ్చట వేసింది. వయస్సులో తనకన్న బాగా చిన్నదయినా కాపరానికి వచ్చినప్పటినించి ఎంత ఒద్దిక, ఓరిమి, అణకువ అలవాటు చేసుకుంది! గవ్వలాట అయిన తరవాత సావిత్రిని దగ్గిర కూర్చోబెట్టుకుని తలదువ్వి, పూలు ముడిచి జడ అల్లుతూ ఆమె ఓదార్పు మాటలు విని నెమ్మదిగా సమాధానం చెప్పింది.

'సావిత్రీ! నేనేమి అధైర్యపడడం లేదమ్మా! మొట్టమొదటి నించి అన్నిటికి గుండెరాయి చేసుకోవడం అలవాటయింది. ఏదో ఆ చాల్లని తల్లిదయవల్ల ఆయనకి కాస్త నింపాదిగా ఉంటే అదే పదివేలని అనుకుంటున్నాను అంతే!'

'ఆఁ! నింపాదిగా ఉండకేంజేస్తుంది అక్కయ్యా! రెండు మూడురోజులలో అదే తగ్గిపోతుంది. అది ఏదో బడలిక జ్వరం అయిఉంటుంది. అంతే!'



ఆ తరవాత ఇద్దరు కలిసి ఇంటి పని అంతా చక్కబెట్టుకున్నారు! ఆ మరునాడు సావిత్రిని వెంటబెట్టుకుని స్టేషనుకి వెడతానని విజయలక్ష్మి అమ్మమ్మతో చెప్పింది. కాని దానికామె అంగీకరించలేదు.

'ఎందుకే నీకంత కంగారు! ఆ జ్వరానికి అంత భయపడవలసిందేమీ లేదమ్మా! అదీగాక కృష్ణమూర్తి అతన్ని జాగ్రత్తగా ఇంటికి తీసుకు వస్తున్నాడుగా!'

అయినా విజయలక్ష్మి ఆ సలహా పాటించలేదు. మొట్టమొదట పిల్లల్ని కూడా వెంటబెట్టుకుని వెడతానన్నదిగాని వర్ధనమ్మ మాటమీద ఆ ఆలోచన మార్చుకుంది. సావిత్రితో బాటు గుర్రపు బండిలో కూర్చుని బండి వచ్చేవేళకి అరగంట ముందుగానే స్టేషను చేరుకుంది. ప్లాట్ ఫారమ్ టిక్కట్లు కొని ఇద్దరూ లోపలికి వెళ్ళారు ఆవేళ బండి అయిదారు నిముషాలకన్న ఎక్కువలేటు కాలేదు. విజయలక్ష్మి, సావిత్రి ఎంతో ఆత్రంగా మొదటి తరగతి పెట్టెలదగ్గిరికి వెళ్ళారు. ఒకపెట్టెలో కృష్ణమూర్తి, పార్థసారథి కనిపించారు. బాగ చిక్కి పాలిపోయిన భర్తవైపు చూసి విజయలక్ష్మిఎంతో ఖేదపడింది

కూలీలు సామానుదింపుతూంటే కృష్ణమూర్తి పార్థసారథి చెయ్యి పట్టుకుని నెమ్మదిగా నడిపించుకుంటూ ఇవతలికి తీసుకువచ్చి స్టేషన్ హాల్లో ఒక కుర్చీలో కూర్చోబెట్టాడు.

'ఎలాగుంది జ్వరం? కొంచెం తగ్గిందా?'
విజయలక్ష్మి కంగారుపడుతూ అడిగింది
'ఇంకా అలాగే ఉందిగాని అదేతగ్గిపోతుందిలే"

నీరసంగా సమాధానం చెప్పాడు పార్థసారథి. ఇక అనవసరంగా ఆలస్యం చెయ్యడ మెందుకని కృష్ణమూర్తి రెండు గుర్రపు బళ్లు తీసుకువచ్చాడు. ఒకదానిలో పార్థసారథి దంపతులు, ఇంకొక దానిలో కృష్ణమూర్తి దంపతులు కూర్చున్నారు. ఇంచుమించుగా అరగంటలో అందరు ఇంటికి చేరుకున్నారు. వర్ధనమ్మ కృష్ణమూర్తి ఆసరాతో నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ నడిచి వస్తున్న పార్థసారథిని సమీపించి 'కొంచెం నింపాదిగా ఉందా నాయనా?' అని ఎంతో ఆత్రంగా అడిగింది. పార్థసారథి నెమ్మదిగానే ఉన్నదన్నట్టు తలపంకించాడు. పిల్లలిద్దరు తండ్రి దగ్గిరికి వెళ్లి బెంబేలుపడి బెదురుగా చూశారు. విజయలక్ష్మి ప్రత్యేకంగా భర్తకొకగదిలో మంచంవేసి మెత్తని పరుపు దిండ్లు అమర్చింది. కొంచెం విశ్రమించిన తరవాత వేడి వేడి కాఫీ చేతికందించింది.

కృష్ణమూర్తి అంతకుమునుపే అయిదు రోజులవరకు సెలవు తీసుకున్నాడు. అందుచేత అతనికి వెంటనే పార్థసారథి కుటుంబం డాక్టరు మధుసూదనరావు దగ్గిరికి వెళ్లి జ్వరం సంగతి సావకాశంగా చెప్పడానికి వీలైంది. స్వయంగావచ్చి రోగిని పరీక్ష చేసిన తరువాత కాని మందు ఇవ్వడం మంచిది కాదని డాక్టరు సలహా ఇచ్చాడు. అందుచేత అతడు బయలు దేరేదాకా కృష్ణమూర్తి అక్కడి నుంచి కదల లేదు. ఆ పైన కొందరు రోగుల పరీక్ష జరిపిన తరువాత ఇద్దరు కలిసి పార్థసారథి ఇంటికి వచ్చారు.

డాక్టరు మధుసూదన రావు ఆ పట్టణంలో కొంత చెప్ప దగ్గ ప్రాక్టీసున్న వ్యక్తి. అంత పొట్టికాదుగాని బాగుగా పుష్టిగా ఉండడం వల్లఅయితేనేమి; ఫాంటు, బుష్‌షర్టు వేసుకోవడం వల్ల అయితేనేమి పొట్టిగా ఉన్నట్టు కనిపిస్తాడు. కావడానికి ఎం.బి.బి.ఎస్ పట్టా పుచ్చుకున్న డాక్టరే. కాని అత్యవసర పరిస్థితులలో ఎక్కువగా హోమోపతీ మందులే వాడుతుంటాడు. వాటి వల్ల కూడా పని జరగక పోతే, ఆయుర్వేదం మందులు, డిషేన్ ఔషధాలు కూడా వాడుతుంటాడు. మనిషి మొత్తం మీద మంచి వాడు. ఎప్పుడూ కులాసాగా నవ్వుతూ పేలుతూంటాడు. అందుచేత అతనితో మాట్లాడితేనే రోగం నయం అయిపోతుందని ఆ పట్టణంలో ఒక వాడుక పుట్టింది. ఎలాంటి గడ్డు రోగమయినా మరేం ఫరవా లేదని గట్టిగా ధైర్యం చెబుతూంటాడు.

మధుసూదన రావుకి రోగనివారణలో చిత్రమయిన అభిప్రాయలు కొన్ని ఉన్నాయి. ప్రతి రోగం అంతరాంతరాలలో అణిగిమణిగి ఉన్న మానసిక వ్యాధుల వల్లనే పొట మరిస్తుందని అతని గట్టి నమ్మకం. అటువంటి మనోవ్యాధులవల్ల కొన్ని రుగ్మతలు బయలు దేరవచ్చును. కాని అన్నింటికి అవేకారణాలంటాడు. మధుసూదన రావు! ఆ వాదం ఎంతవరకు వెళ్లిపోవాలంటే చిట్టచివరికి చేతి మీద గజ్జికురుపులు బయలు దేరినా వాటికి లోలోపల అణిగిఉన్న మానసిక వేదనలే కారణాలని గట్టిగా వాదిస్తాడు అందు చేత జబ్బుచేసినవారి నెప్పుడు పరిశుభ్ర పరిసరాలలోనే వుంచాలని, వారితో ఎలప్పుడు కులాసాగానే మాట్లాడుతూ ఉత్సాహం కలిగించాలని మాటి మాటికి హెచ్చరిస్తూంటాడు అవన్నీ చికిత్సలో కొంతవరకు మాత్రమే ఉపకరిస్తాయని అతనికి తెలియదనే అనాలి. లేక తెలిసినా వాటి కనవసరమయిన ప్రాముఖ్యం కలిగిస్తున్నాడనో నిశ్చయించాలి. ఏది ఏమయినా ఆ చాదస్తానికి కొందరతని వెనకాల నవ్వుతుంటారు. కాని మధుసూదన రావు వైద్యం కావలసిన వారు మాత్రం అతని నియమాలన్నీ తు.చ తప్పకుండా అక్షరాల పాటించి తీరవలసిందే.

డాక్టరు లోపలికి వచ్చి పార్థసారథి పడుకున్న గదిలో ప్రవేశించి కొంచెంసేపు నిదానంగా అతని వైపు చూచి రోగపరీక్ష ప్రారంభించాడు. టెంపరేచరు తీసి గుండె, నాలుక, కను రెప్పలు నిశితంగా పరీక్షించాడు.

"ఎన్నాళ్లనుంచి వస్తూందమ్మా ఈ జ్వరం"

విజయలక్ష్మి వైపు తిరిగి ప్రశ్నించాడు. ఆమె భర్త ఇంటి దగ్గిరినించి బయలు దేరిన తేదీ చెప్పి ఆనాడే కొంచెం పులకరం గలిగిందని అన్నది. ఆ పైన కృష్ణమూర్తి అందుకొని మద్రాసులో రాఘవ ద్వారా తనకి తెలిసిన వివరాలన్ని ఏకరువు పెట్టాడు. డాక్టరు స్టెతస్కోపుతో పార్థసారథిని మరి కొంత సేపు పరీక్ష చేసి కులాసాగా నవ్వుతూ పెద్దగా కంగారు పడవలసింది ఏమి లేదన్నటు కొట్టి పారవేశాడు.

"అబ్బే! దీనికి మీ రేమి భయపడ నక్కర లేదు. చాలా సామాన్య జ్వరం. నాలుగయిదు రోజులలో తప్ప కుండా పత్యానికి వస్తుంది. మందు తీసుక రావడానికి ఎవరినయినా పంపించండి!

ఆ పైన ఆ జ్వరం పుట్టు పూర్వోత్తరాలను గురించి పార్థసారథిని నాలుగయిదు ప్రశ్నలడిగాడు. క్షీణ స్వరంతో చెప్పిన అతని ప్రతి సమాధానాలు విని, బాగా సంతృప్తి పడి తన రోగవిధానం సరిగా అతికి నట్టు సరిపడినదని నిర్ణయించుకున్నాడు. గది అంతా పరిశుభ్రంగా ఉంచాలని, పార్థసారథికి రవంతయినా చిరాకు, విసుగు, నిరుత్సాహము కలుగనియ్యకూడదని, ఎల్లప్పుడు అతనికి కులాసా కలిగించాలని తిరిగి తిరిగి హెచ్చరించి మందు యివ్వడం కోసం కృష్ణ మూర్తిని వెంట బెట్టుకుని వెళ్లి పోయాడు.

డాక్టరు చెప్పిన ధైర్యంతో ఇంటిల్లిపాదికి ఎంతయినా సంతోషం కలిగింది. కృష్ణమూర్తి ఎంతగానో ఆనందించాడు. విజయ లక్ష్మి తిరిగి భర్త గది అంతా అద్దంలా తుడిచి పరిశుభ్రంగా తీర్చి దిద్దింది. దుప్పటీలు, తలగడాలు మార్చింది. భర్త ఎదురుగా ఉన్న బల్ల మీద అగరువత్తులు వెలిగించి దోసిలిలో అమర్చిన వెండి అచ్చర బొమ్మ పెట్టింది. సమక్షంలో కుర్చీ మీద కూర్చుని నవ్వు ముఖంతో పిచ్చాపాటి మొదలు పెట్టింది.

మరి కొంత సేపటికి మందు సీసాతో, మాత్రలతో, పొడరు పొట్లాలతో కృష్ణమూర్తి తిరిగి వచ్చాడు వారందరికి పార్థసారథి చాలా సంగ్రహంగా నీరసంగా సమాధానాలిచ్చాడు. పిల్లలందరు దగ్గరకి వచ్చి పలక రించినప్పుడు అతని పెదవులమీద చిరునవ్వులు కూడా కనిపించాయి. పార్థసారథిని అంతకన్న ఆయాస పెట్టడం మంచిది కాదని అందరు వంట ఇంట్లోకి వెళ్లి పోయారు.

మాటల సందర్భంలో మద్రాసు విశేషాలు ఏమి టని అడిగిన తరువాత రాఘవ ద్వారా తనకి తెలిసిన సంగతులు కొన్ని కృష్ణమూర్తి విజయ లక్ష్మి కెరిగించాడు. అకస్మాత్తుగా జరిగిన సరోజ వివాహము, సినీమాలో ఆమె ప్రవేశము, రాఘవ కూడా దాని లోనే చేరిపోవడము వెంకటకృష్ణయ్యతో పోట్లాట అంతకు మునుపే ఏలూరులో జరిగిన గొడవ మొదలయిన విషయాల్ని సంగ్రహంగా వివరించాడు. ఇక ఇప్పటినుంచి సరోజ బెడద పూర్తిగా తొలగి పోగలదని గట్టిగా ధైర్యం చెప్పాడు. కాని విజయలక్ష్మికంతగా నమ్మకం కలగలేదు ! అయినా ఆ వ్యవహారంలో కొంతకాలం నుంచి ఆమెకొక విధమైన నైరాశ్యము, ఉపేక్ష కలిగాయి. అందు చేత అంటీ అంటనట్లు తన అభిప్రాయం వ్యక్తీకరించింది.

'నేనీ గొడవ పట్టించుకోవడం మానేసి చాలా రోజులయింది బావా ! నువ్వేమిటో అంటావుగాని నాకంతగా నమ్మకం కలగడం లేదు. సరోజ మద్రాసులో స్థిరపడిపోతే మాత్రం, ఈయన అక్కడికి వెళ్ళరని ఎక్కడుంది ? పోనీ, నువ్వన్నట్టు ఆ చల్లని తల్లి దయవల్ల ఈ గొడవలన్నీ ఇంతటితో వదిలిపోతే మంచిదే ! ఇంత కన్న కావలసింది ఏమి ఉంది'.

అటు పిమ్మట సంభాషణలో ప్రస్తావన మార్చి కాస్త భర్త పథ్యం పుచ్చుకునేదాకా నయినా భార్యతోపాటు కృష్ణమూర్తిని తమ ఇంట్లో ఉండిపోవలసిందని కోరింది. అటువంటి ఇబ్బంది సమయంలో సాయపడడం తన విధి అని చెప్పి అతడు దాని కంగీకరించాడు. ఆ మరునాటినుంచి హైస్కూలుకి వెళ్ళినా తిరిగి రాగానే సర్వదా పార్థసారథినే కనిపెట్టుకుని ఉన్నాడు. ఏపూట పరిస్థితి ఆపూట వెంటనే డాక్టరుకి తెలియజేశాడు. సరిఅయిన సమయానికి మందులిచ్చి టెంపరేచరు, మిగిలిన లక్షణాలు జాగ్రత్తగా గుర్తించాడు.

అలాగలాగ నాలుగయిదు రోజులు గడిచిపోయాయి. ఐనా పార్థసారథి పరిస్థితిలో మంచి మార్పేమాత్రము కనబడలేదు ! పైగా గుండెలో ఆరాటము, చలి, విదాహము, బొత్తిగా నిద్రపట్టక పోవడము మొదలయిన అవలక్షణాలు కొన్ని ప్రారంభమయ్యాయి. డాక్టరు తిరిగి జాగ్రత్తగా పరీక్షచేసి అది శరీరంలో జీర్ణించిపోయిన మలేరియా జ్వరమని నిర్ధారణ చేశాడు. కాని ఒకవేళ టైఫాయిడ్ జ్వరమేమోనని కూడా అతనికి రవంత అనుమానం కలగకపోలేదు. కాని చిట్టచివరికి మలేరియా జ్వరమే అని నిశ్చయించి దాని చికిత్స ప్రారంభించాడు. కాని దానివల్ల కూడా తగినంత ఫలితం కనబడ లేదు. ఒకటి రెండు రోజులు గడిచిన తరువాత అప్పుడప్పుడు చెరుపు మరుపు మాటలు కూడా ప్రారంభమయ్యాయి. మధుసూదన రావు దానికంతగా కంగారుపడవలసిన అవసరం లేదని ధైర్యం చెప్పి మందేదో మార్చి ఇచ్చాడు. దానితో విదాహము, చెరుపు మరుపు మాటలు, ఆరాటము రవంత తగ్గినా టెంపరేచరు మాత్రం ఒక్క పాయింటయినా కిందికి దిగలేదు ! అయితే అది తగ్గించడం ఏమి అంత కష్టం కాదని డాక్టరు విజయలక్ష్మికి, కృష్ణమూర్తికి ధైర్యంచెప్పి తిరిగి మందులు మార్చి ఇచ్చాడు.

ఇంటికి తిరిగివచ్చిన అయిదారు రోజులవరకు పార్థసారథి అంతర్యంలో అప్పుడప్పుడు సరోజనుగూర్చి రకరకాల ఆలోచనలు చెలరేగుతూనే ఉన్నాయి ఆమె ఎన్నెన్ని విధాల ప్రయత్నించినా ఏలూరు నాటకానికి రాలేకపోయిందా? లేక రాఘవ అన్నట్టు అది అంతా వట్టి నటనేనా? అలాంటప్పుడు కొంత ముందుగానే ఆ సంగతి తనికి తెలియజేసిఉండవచ్చునే! ఎందుకు తెలియజెయ్యలేదు? అనవసరంగా ఇబ్బందిలో పెట్టివేయడంవల్ల తనకి జరిగేది ఏముంది? సరోజ చాలాకాలం క్రితమే మేనమామని వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నదా? లేక ఆ నిర్ణయం ఇటీవలే జరిగిందా? ఏది ఏమయినా ఆ సంగతి రవంత తనతో చెప్పిఉండవచ్చునే! అది అంతటి పరమరహస్యగా దాచివెయ్యడంవల్ల తనకేమి ఒరిగింది? అలాగ ఆలోచిస్తూంటే మునుముందుగా రిజిస్టర్ మారేజ్ చేసుకుని ఆపైన తిరిగి కొండమీద వివాహం ఏర్పాటు చేసుకోవడానికేమి కారణమో ఎంతగా ఆలోచించినా అతనికేమాత్రము అవగాహనకాలేదు! 'ఏదో ఒకటి చాలదా? రెండు వివాహాలు ఏర్పాటు చేసుకోవడం ఎందుకు ?' అని ప్రశ్నించుకున్నాడు. కానీ ఎంతగా ఆలోచించినా దానికి సరి అయినా సమాధానమేదీ స్ఫురించలేదు!

ఆ తరవాత వట్టి సరదా కోసమే కొండమీద తిరిగి పెళ్లి ఏర్పాటు చేసుకుని ఉండవచ్చునని సమాధాన పడ్డాడు. కాని అంతలోనే అతనికి, అవసరమయితే మున్ముందు విడాకు లివ్వ వచ్చునన్న ఆలోచనతోనే ఆమె మొట్టమొదట రిజిస్టర్ మారేజ్ చేసుకుని ఉండవచ్చునని అనుమానించాడు. మరి కొంత సేపటికి ఆ అనుమానం బలపడింది. దానితో ఇక మిగిలిన ఆమె చర్యల కన్నింటికి కేవలం నిర్లక్ష్యంతో, నిరసనతో పేరుకొన్న స్వార్థమే, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలే మూలకారణాలని కూడా గ్రహించుకున్నాడు. అటువంటి వ్యక్తిమాట మరి తలపెట్టకుండా ఉండలేక పోతున్నందుకు అతని కెంతయినా తీవ్రవ్యథ కలిగింది. మాటి మాటికి తలుచుకుని తలుచుకుని గాలం గాటంగా మోట గుచ్చుకున్న చిన్నచిన్న చేపలాగ విపరీత యాతనతో విలవిల లాడిపోయాడు!

(సశేషం)

# జిల్లాలనుండి

## మహబూబ్‌నగర్ జిల్లా పరిషత్తు ప్రణాళిక

మహబూబ్‌నగర్ జిల్లాలోని 16 బ్లాకులలోను రూ 1.10 కోట్ల ఖర్చుతో కూడిన ఒక అభివృద్ధి ప్రణాళికను మహబూబ్‌నగర్ జిల్లా పరిషత్తు రూపొందించింది. ఇందులో రూ 40 లక్షలు గ్రామీణ విద్యుదీకరణకు కేటాయించడమైనది.

జిల్లా విస్తీర్ణం ఎక్కువగా ఉన్న దృష్ట్యా అదనంగా రూ 50 లక్షల గ్రాంటును కూడా ఇవ్వమని ప్రభుత్వాన్ని అడగడానికి పరిషత్తు నిశ్చయించింది.

మహబూబ్‌నగర్, జెడ్‌చర్ల, షాద్‌నగర్, అమన్‌గల్, కల్వకుర్తి, నాగరకర్నూలు, బిజ్నేపల్లి, కొల్లాపూర్, మద్దూర్, కొడంగల్ బ్లాకులలో లక్షన్నర రూపాయల ఖర్చుతో అసంపూర్తిగా వుండిపోయిన చిన్న నీటి పారుదల పనులను నూట ఇరవైవరకు చేపట్టాలని ఉద్దేశించారు. 1 లక్ష 75 వేల రూపాయల ఖర్చుతో ఈ జిల్లాలోని బ్లాకు లన్నిటిలోనూ కొత్త నీటిపారుదల పనులను చేపట్టాలని కూడా నిశ్చయించారు. వరద నిరోధక చర్యలుగా రూ 1,85,000 ల వ్యయంతో కూడిన 74 పనులను కూడా చేపట్టాలని ఉద్దేశించారు.

జెడ్‌చర్ల, షాద్‌నగర్, కల్వకుర్తి, ఆత్మకూర్, మక్తల్, మద్దూర్, కొడంగల్, వనపర్తి, గద్వాల్, అలంపురం, అచ్చంపేట, బిజ్నాపల్లి, నాగరకర్నూలులలో రూ 48,40,000 ల ఖర్చుతో కూడిన యీ బైరోడ్ల నిర్మాణాలను చేపట్టాలని ఉద్దేశించారు.

32 సెకండరీ పాఠశాలలు, కొన్ని ప్రాథమిక పాఠశాలలు వెరసి 92 పాఠశాలల భవనాల నిర్మాణాన్ని చేపట్టాలని భావించారు. రూ 19,86,000 ల ఖర్చుతో 62 గ్రామాలకు రక్షిత మంచినీటి సరఫరా చేయడం జరుగుతుంది. అలక్షింపబడిన ప్రాంతాల్లో వివిధ పథకాలను, పనులను చేపట్టడానికై రూ 6 లక్షలను కూడా ప్రత్యేకించారు.

తెలంగాణా అభివృద్ధికి సంబంధించిన ప్రత్యేక పథకం క్రింద ఈ జిల్లాకు రూ 70 లక్షలను కేటాయించడం జరిగింది.

## గ్రామీణ విద్యుదీకరణ కరీంనగర్ జిల్లాలో

కరీంనగర్ జిల్లాకు ఈ ఏడాది ప్రత్యేక గ్రాంటుగా కేటాయించిన ఒక కోటి రూపాయలలోనూ రూ 40 లక్షలను గ్రామీణ విద్యుదీకరణ కార్యక్రమాలకు కరీంనగర్ జిల్లా పరిషత్తు ప్రత్యేకించింది.

మిగిలిన మొత్తంలో జిల్లాపరిషత్తు రోడ్లకు పబ్లిక్ వర్క్సు రోడ్లకు అధిక ప్రాధాన్యం యివ్వడం జరుగుతుంది. హరిజనుల అభ్యుదయానికై రూ 5 లక్షలు ప్రత్యేకంగా కేటాయించడం జరిగింది. ఈ అయిదు లక్షల మొత్తాన్ని హరిజనవాడల్లో రోడ్లు, మంచినీటి బావులు, పాఠశాల భవనాలు నిర్మాణానికి వెచ్చిస్తారు.

## నిజామాబాదు జిల్లాకు రూ 60 లక్షల ప్రణాళిక

వర్తమాన సంవత్సరంలో తెలంగాణా ప్రత్యేక అభివృద్ధి పథకాల క్రింద అభివృద్ధి పనులకుగాను నిజామాబాదు జిల్లాకు ప్రభుత్వం రూ 60 లక్షలు కేటాయించింది.

జిల్లాలో చిన్ననీటి వనరులు, మంచినీటి సరఫరా, రోడ్ల వంటి వివిధ అభివృద్ధి పథకాలకు యీ మొత్తాన్ని ఖర్చుచేయాలని ఉద్దేశించారు.

23 చిన్ననీటి వనరులను చేపట్టాలని ఉద్దేశిస్తున్నారు. దీని కింద 10,227 ఎకరాల ఆయకట్టు వుంటుంది. ఈ చిన్ననీటి వనరుల నిర్మాణం ఈ జిల్లాలోని అన్ని తాలూకాలకు విస్తరించి వుంటుంది.

## వరంగల్లు జిల్లాలో గ్రామీణ విద్యుదీకరణ

ప్రత్యేక అభివృద్ధి పథకాల క్రింద వరంగల్లు జిల్లాలో గ్రామీణవిద్యుదీకరణ నిమిత్తం రూ 60 లక్షలను వెచ్చించడానికి జిల్లా పరిషత్తును అనుమతించ వలసిందిగా ప్రభుత్వాన్ని కోరాలని మే 26 న జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ పి. ధర్మారెడ్డి అధ్యక్షతన సమావేశమైన వరంగల్లు జిల్లా పరిషత్తు సర్వసభ్య సమావేశం తీర్మానించింది.

ఇతర అభివృద్ధి పనులకు గాను రూ 40 లక్షలను ఖర్చు చేయాలనికూడా యీ పరిషత్తు నిశ్చయించింది. రోడ్లు, చిన్ననీటి వనరులు, మంచినీటి సరఫరా, పాఠశాలల భవనాలు, షెడ్యూల్డు కులాల, షెడ్యూల్డు జాతుల సంక్షేమం, మహిళా సంక్షేమం మొదలైన వాటికి సంబంధించిన పనులు వీటిలో వుంటాయి.

## లిఫ్ట్ ఇరిగేషన్ పథకానికి ప్రారంభోత్సవం

హుజూర్‌నగర్ తాలూకాలోని గడిపల్లి గ్రామంలో మహాత్మాగాంధీ లిఫ్ట్ ఇరిగేషన్ పథకానికి ఇటీవలే ప్రారంభోత్సవం జరిగింది. నాగార్జున సాగర్ ఎడమ కాలువ నుంచి నీటిని పొందడానికి గాను లిఫ్ ఇరిగేషన్ సహకార సంఘం నెలకొల్పబడింది. సేద్యపునీటి సౌకర్యాల కల్పన, ట్రాక్టర్లు తదితర పరికరాల కొనుగోలులకు గాను 6 లక్షల రూపాయలను వెచ్చించడానికి యీ సంఘం నిశ్చయించింది. ఈ పథకం క్రింద యిక్కడి రైతులు ఏడాదికి రెండుగాని మూడుగాని పంటలు పండించ వచ్చని భావిస్తున్నారు.

## మవరం ప్రకృతి ఆశ్రమం రజతోత్సవం

భీమవరంలోని రామకృష్ణా ప్రకృతి ఆశ్రమానికి శ్రీమొరార్జీ దేశాయ్ మే 18 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

## గుంటూరు జిల్లాలో పన్నుల వసూళ్ళు

గుంటూరు జిల్లాలో 1968_69 వ సంవత్సరంలో మొత్తం 1034 పంచాయితీలలో 426 పంచాయితీలు నూటికి నూరుపాళ్ళ పన్నులను వసూలు చేశాయి. గత సంవత్సరం 172 పంచాయితీలు మాత్రమే పూర్తిగా పన్నులను వసూలుచేశాయి.

1967_68 వ సంవత్సరంలో మొత్తం పన్నుల వసూళ్ల శాతం 37 కాగా 1968_69 లో 67 శాతం వరకు వసూలుచేశాయి.

## గుంటూరు జిల్లాలో హరిజనులకు పట్టాలు

గుంటూరు జిల్లా తాళ్ళూరు పంచాయితీ సమితిలోని తాళ్ళూరులో వీధి విద్యుద్దీపములకు గుంటూరు జిల్లా కలెక్టరు శ్రీ యం. వెంకటరత్నం జూన్ 18వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంలో జరిగిన సభకు పరిషత్ చైర్మన్ శ్రీ మేడూరి నాగేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు.

ఆదే రోజున కంభంపాడు గ్రామంలో 'గాంధీనగర్ హరిజన కాలనీకి' కలెక్టర్ శ్రీ యం. వెంకటరత్నం, కరువు నివారణపనులక్రింద రు 65 వేల ఖర్చుతో నిర్మించబడిన శ్రీ యం. వెంకటరత్నం బ్రిడ్జికి, యం. యల్. ఏ. శ్రీ గణపా రామస్వామి రెడ్డిగారు ప్రారంభోత్సవం చేశారు. హరిజనకాలనీకి సంబంధించిన 41 మంది హరిజనులకు యిండ్లస్థలముల పట్టాలు, యిండ్లు నిర్మించుకొనుటకు ఒక్కొక్కరికి రు 100/- లు పంచిపెట్టారు

## ప్రగతి పథంలో రాయలసీమ ప్రదర్శన

జూన్ 7, 8 తేదీలలో కడపజిల్లా ప్రొద్దుటూరులో జరిగిన రాయలసీమ మహాసభల సందర్భంగా జనసంబంధశాఖ తరపున "ప్రగతి పథములో రాయలసీమ" అనే ప్రదర్శనశాలను ఏర్పాటు చేశారు. కడప, చిత్తూరు, అనంతపురం, కర్నూలు జిల్లాలకు సంబంధించిన నైసర్గిక స్వరూపము, ప్రకృతి రమణీయకత, ప్రణాళికాయుగంలో వివిధ రంగాలలో జరిగిన అభివృద్ధిని సూచించే వివరాలతో కూడిన చిత్రాలు, చార్టులు, మ్యాపులు ప్రదర్శనశాలలో అమర్చబడినవి. ప్రసిద్ధ పుణ్యక్షేత్రములు నిరతము యాత్రికుల నాకర్షించే తిరుపతి, శ్రీశైలము, శ్రీకాళహస్తి, అహోబిలము, మహానంది, బ్రహ్మంగారి మఠము, మంత్రాలయమునకు సంబంధించిన ఫొటోగ్రాఫులు, రాయలసీమ చారిత్రిక ఔన్నత్యాన్నిచాటే లేపాక్షి శిల్పకళాఖండాలు, ప్రణాళికాయుగంలో ఆధునాతన దేవాలయములుగా పరిగణింపబడే తుంగభద్ర, ఎగువ, మధ్యపెన్నారు, భైరవానితిప్ప, శ్రీశైలం, ఫించా, స్వర్ణముఖి ప్రాజెక్టుల వివరాలతోకూడిన ఫొటోలు; శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయపు చిత్తరువులు ప్రదర్శనలో ఆకర్షణీయముగా అమర్చారు. "మీ జిల్లాను గూర్చి తెలుసుకో" అనెడి ఆయా జిల్లాల గణాంక వివరాల ఛార్టు ప్రతినిధులను ఆకర్షించినది. సమావేశానికి హాజరైన వేలాది ప్రతినిధులే కాక, ప్రజలు విరివిగా విచ్చేసి ప్రదర్శనను తిలకించారు.



ఆఫ్ఘన్ జర్నలిస్టుల బృందం ఇటీవల హైదరాబాదు విచ్చేసినప్పుడు బేగంపేట విమానాశ్రయంలో వారికి స్వాగతం చెప్పినప్పటి దృశ్యం



ఫెడరల్ రిపబ్లిక్ జర్మనీ కాన్సల్ జనరల్ డా. కె. ప్రా మెయర్ జూన్ 14 వ తేదీన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిని ఆనందనిలయంలో కలుసుకుని ఆంధ్రప్రదేశ్‌లో ఇటీవల సంభవించిన తుఫానుబాధితుల సహాయార్థం తమ ప్రభుత్వం తరఫున చెక్కు ఒకదానిని అందజేస్తున్న దృశ్యం

PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION AND PUBLIC RELATIONS, ANDHRA PRADESH, HYDERABAD.
PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVERNMENT OF ANDHRA PRADESH, AT THE GOVERNMENT CENTRAL PRESS, HYDERABAD.

